# అపరాధ పరిశోధన

రు.5 | డిసెంబర్ '81 |



# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ప్రేమ కత్తులు

రచన : వసుంధర

## నగల దోపిడి

రచన : ఇమంది రామారావు

## బ్రిడ్జిమీది శవాలు

రచన : ఎమ్. వి. వి. సత్యనారాయణ

## మూడు కత్తులు-రెండు హత్యలు

రచన : బొమ్మిడి అచ్చారావు

రక్తం త్రాగే పిశాచం - ఆరవ భాగం

# ప్రేమ కల్పం

## వసుంధర

అరుణ కోసం ఎదురు చూస్తూ కూర్చున్నాను. టైము ఆరు దాటి నలభై నిముషాలయింది. ఈ నలభై నిముషాలలోనూ యాభయి సార్లకు తగ్గకుండా వాచీ చూసుకున్నాను. అరుణ ఎప్పుడూ యింత ఆలస్యం చేయలేదు. ఈ రోజామెకు ఏమయిందో ఏమో!

మళ్ళీ టైము చూసుకున్నాను. ఆరూ నలభయి దాటి ముప్పైఅయిదు సెకండ్లు మాత్రమే గడించింది. క్షణాలు యుగాల్లా మించిపోతున్నాయి. ఇంకా ఎంత సేపని ఎదురు చూసేది?

ఆరూనలభయిమూడుకు అరుణ వచ్చింది.

“ఏమిటరుణా—మరీ యింత ఆలస్యం!” అన్నాను. ఆమె వచ్చినందుకూ, ఈ రోజు కూడా ఆమెను కలుసుకో గలిగినందుకూ సంతోషంగా ఉంది.

“ఈ ఒక్క రోజుకే ఆలస్యం—....” అంది అరుణ నెమ్మదిగా. ఆ మాట రోజూలా లేదు.

"హమ్మయ్య—అయితే రేపు మనం మళ్ళీ మామూలు టైముకే కలుసుకోవచ్చునన్నమాట!" అంటూ నవ్వాను.

నా మాటలకు అరుణ నవ్వలేదు—"ఈ ఒక్క రోజుకే ఆలస్యమంటే నా ఉద్దేశ్యం వేరు. రేపట్నించి మనమిక కలుసుకోబోవడంలేదు—"

ఉలిక్కిపడి—"ఏమన్నావ్?" అన్నాను.

"మళ్ళీ చెప్పమంటే చెబుతాను—" అంది అరుణ.

అవసరంలేదు. అరుణ మాటలు నేను విన్నాను. నా మెదడు కాసేపు పనిచేయడం మానేసింది. అది పని చేస్తోందనిపించగానే—"ఏమయిందరుణా?" అన్నాను.

"మా బావ వచ్చాడు!" అంది అరుణ.

అరుణకు బావ వున్నాడనీ, అతడామెను ప్రేమిస్తున్నాడనీ నాకు తెలుసు. అయితే నా ధైర్యమేమిటంటే నేను అరుణకు బావను కాకపోయినా ఆమె నన్ను ప్రేమిస్తోంది. అందువల్ల అరుణబావ ప్రేమకంటె, నా ప్రేమ ఫలించే అవకాశాలే చాలా చాలా ఎక్కువ!

"అతను నీకు బావేకానీ మొగుడు కాదుగదా—మనం కలుసుకోవడానికేం?" అన్నాను.

"బహుశా అతనే నాకు కాబోయే భర్త అనుకుంటాను—" అంది అరుణ తాపీగా.

"ఏమన్నావ్?" అన్నాను కంగారుగా.

"మళ్ళీ చెప్పమంటే చెబుతాను—" అంది అరుణ.

సూటిగా అరుణ కళ్ళలోకి చూసి—"నీకు కాబోయే భర్తని నేను! ఆ సంగతి నువ్వూ ఒప్పుకున్నావు—" అన్నాను.

"నేను నిన్ను ప్రేమిస్తున్నానని చెప్పాను. కానీ నువ్వు నా కాబోయే భర్తవని ఎన్నడూ అనలేదు—"

అంది అరుణ. ఆమె ముఖం గంభీరంగా వుంది. మాట్లాడుతున్నపుడు ఏదో ఆలోచిస్తోందనిపిస్తుంది.

"పెళ్ళికి ఒప్పుకోకపోయాక వెధవ ప్రేమ ఉంటేనేం లేకపోతేనేం?" అన్నాను.

"నాది వెధవ ప్రేమ కాదు—అందుకే పెళ్ళికి ఒప్పుకోవడంలేదు—" అంది అరుణ.

"ఏం జరిగిందరుణా?" అన్నాను.

"బావ దుర్మార్గుడు. అతను నన్నింతగా ప్రేమిస్తున్నాడని ఈ రోజే తెలిసింది. నువ్వు నన్ను ప్రేమిస్తున్నట్లు తెలిస్తే అతను నిన్ను చంపేస్తాడు. నా కోసం నీ ప్రాణాలు పోగొట్టుకోవడం నాకిష్టంలేదు—" అంది అరుణ.

ప్రేమకోసం ప్రాణాలు పోగొట్టుకోవడం నాకూ ఇష్టంలేదు. అందమైన అమాయకమైన అరుణ నాకెంతో నచ్చింది. నా అదృష్టం కొద్దీ ఆమె ప్రేమ నాకు లభించింది. ఆమెను నా దాన్ని చేసుకొంటే అదింకా అదృష్టమనుకొంటాను—"అంత ప్రాణాలు తీసే దుర్మార్గుణ్ని కట్టుకొని నువ్వేం సుఖపడతావు?" అన్నాను.

"నా కోసం మరొకళ్ళ ప్రాణాలు తీయడానికి సిద్ధపడే మనిషి నన్ను సుఖపెట్టడా?"

అరుణ నన్ను చాలా గొప్ప ప్రశ్న వేసింది. సినిమాల్లోని హీరోయిన్లంతా విలన్ల గురించి ఈ విధంగా ఆలోచించి వుంటే అసలు సినిమాలకు కథలే మిగిలి వుండేవి కాదేమో! హీరోలెప్పుడూ అన్నకోసమో, చెల్లెలి కోసమో, స్నేహితుడి కోసమో—తమ ప్రియురాండ్రను త్యాగం చేస్తారు. విలన్ హీరోయిన్ కోసం హత్యలు కూడా చేస్తాడు. ఎవరి ప్రేమ గొప్పది?—"నీ బావ

యింతవరకూ ఏమైనా హత్యలు చేశాడా?" అన్నాను.

"బావ హత్య చేస్తాననగానే పనులు సానుకూలమై పోతూ వస్తున్నాయి. అందువల్ల అతనికింత వరకూ హత్యచేసే అవకాశం లభించలేదు. నువ్వా కల్పిస్తావని నేననుకోవడంలేదు—" అంది అరుణ.

"ఎందుకని?"

"నీకు జీవితంలో ప్రేమ ఒక్కటే కాదు ముఖ్యం. నీ ముసలి తల్లి, పెళ్ళి కావల్సిన చెల్లెలు, చదువుకొంటున్న తమ్ముడు—ముగ్గురూ కలిసి నా బావ జోలికి వెళ్ళొద్దని చెబుతారు. ఆ మాటకొస్తే నేనూ అదే చెబుతున్నాను. బావ జోలికి వెళ్ళడంవల్ల నీ చావు తథ్యం. నువ్వు పోయినా నాకు కలిగే నష్టం తక్కువ. ఎవరినో పెళ్ళి చేసుకొని నా బ్రతుకు బ్రతుకుతాను. కానీ మీ ఇంట్లోని ముగ్గురూ నిరాశ్రయులై పోతారు. ఇది డెమోక్రసీ! ఒక్కరికోసం ముగ్గుర్ని కష్టపెట్టకూడదు. ఆ విషయం నీకూ తెలుసును. అందుకే నువ్వు బావ జోలికి రావని అనుకొంటున్నాను. ఇంకా బావకు నీ గురించి తెలియదు" అంది అరుణ.

ఒక్కసారి నా వాళ్ళంతా గుర్తుకొచ్చారు నిజమే! నేనేమైపోయినా ఫరవాలేదు — కానీ నా వాళ్ళు నిరాశ్రయులు కాకూడదు. అంటే నేనేమీ అయిపోకూడదు. "అరుణా! మీ బావ ఒప్పుకొంటే మన పెళ్ళి నీ కిష్టమేనా?" అనడిగాను.

"ఇష్టమే—కానీ బావ ఒప్పుకోవడం అసంభవం—" అంది అరుణ.

"ఆ సంగతి నేను చూసుకొంటాను—" అన్నాను.

"ప్లీజ్ బావకు మన ప్రేమ సంగతి తెలియకూడదు,

నీకేదైనా అయితే అది నా గురించే కదా! జీవితాంతం ఆ భారం నన్ను రంపపు కోత కోస్తుంది. నా కోసం నన్ను మర్చిపో!" అంది అరుణ.

అరుగంటలకు వస్తానన్న అరుణ చాలా ఆలస్యంగా వచ్చింది. అంతసేపు ఆమె కోసం ఎదురుచూడకుండా ఉండివుంటే ఈ దౌర్భాగ్యపు వార్త వినాల్సిన అవసరముండేది కాదుగదా!

నిరుత్సాహంగా లేచి నిలబడ్డాను.

"మరిచిపోవడం నీకూ, నాకూ కష్టమే! కానీ ప్రయత్నించి సాధిద్దాం—" అంది అరుణ.

## 2

అరుణకూ, నాకూ పరిచయం చాలా తమాషాగా జరిగింది.

ఒకరోజు అరుణ, తండ్రితో కలిసి మా ఆఫీసుకు వచ్చింది. ఆయన ఆఫీసరుతో లోపల విషయాలు మాట్లాడుతుంటే ఆమె నా దగ్గర కూర్చుంది. మనిషి కాస్త వాగుడుకాయ. కూర్చున్న కాసేపూ నన్ను పని చేసుకోనివ్వకుండా ఏమేమో చెప్పింది. సమయం తెలికగా గడిచిపోయింది. ఆఫీసరు దగ్గర్నుంచి అరుణ తండ్రి నా దగ్గరకు వచ్చాడు. ఆయనకు సంబంధించిన ఫైలు నా దగ్గరే వుందని ఆఫీసరు చెప్పాట్ట. చూసి నా శాయశక్తులా పనిచేసి పెట్టాను.

అరుణ తండ్రి పెద్ద కంట్రాక్టరు. లక్షాధికారి.

ఆ రోజు అరుణ వెళ్ళిపోయాక ఆమె పుస్తకం ఒకటి బల్లమీద ఉండిపోవటం చూశాను. అదో డిటెక్టివ్ నవల. తండ్రితో బయల్దేరినపుడల్లా అరుణ ఏదో నవల పట్టుకొంటుందట. ఆయనకు లక్ష వ్యాపకాలుట. చాలా

ఆఫీసులకు వెళ్ళి గంటలతరబడి కబుర్లలో పడిపోతారట. అరుణ బయట కూర్చుని నవల చదువుకొంటుండదట. ఈ రోజు నాతో మంచి కాలక్షేపం కావడంతో అరుణకు నవల అవసరంలేదని బల్లమీద ఉంచింది. వెళ్ళేటప్పుడు తీసుకువెళ్ళడం మరిచిపోయింది.

నా దగ్గరున్న ఫైల్లోని కాగితాల్లో అరుణ యింటి అడ్రస్ వుంది. సాయంత్రం ఆఫీసు వదలగానే ఆ పుస్తకం తీసుకొని అరుణ యింటికి వెళ్ళాను. నేను వెళ్ళే సమయానికి ఆమె యింట్లోనే వుంది. పుస్తకం చూసి ధన్యవాదాలర్పించింది.

నేను వెళ్ళబోతూంటే ఆమె అన్నది-"మన స్నేహం భగవన్నిర్ణయమనుకొంటాను. మరిన్నిమార్లు మనం కలుసుకోవాలనుకొంటున్నాను—"

నేను చాలా థ్రిల్లయ్యాను. "రోజూ సాయంత్రం ఆరుగంటలకు బీచీ దగ్గర గడపడం నా అలవాటు—" అని అక్కణ్ణించి బయటపడ్డాను.

మర్నాడామె బీచివద్ద నన్ను కలుసుకొంది. అలా ప్రారంభమైన పరిచయం ప్రేమగా మారింది. పెళ్ళిచేసుకోవాలనుకొన్నాం. అన్నీ ఊహాలేగా! ఊహల్లోనే ఈ రోజు విడిపోయాం కూడా!

మా సంభాషణల్లో అప్పుడప్పుడు అరుణ బావ ప్రసక్తి వస్తూండేది. అతడి పేరు ప్రదీప్. చాలా మొండి మనిషి. అరుణ నతనికివ్వాలని ఇంట్లో వాళ్ళ అభిప్రాయం దానికి ప్రదీప్ అంత సీరియస్‌గా తీసుకొన్నట్లు లేదు. అతడికి ప్రేమ, పెళ్ళిలాంటి విషయాల గురించిన ఆలోచన తక్కువ. ఎంతసేపూ డబ్బు, వ్యాపారం. అతడు గనుక నిజంగా అరుణని ప్రేమిస్తే వారి వివాహాన్ని భగవంతుడు కూడా

ఆపలేడంటుంది అరుణ. అయితే అతడు తనని ప్రేమించడం లేదని ఆమె అనుకొంది ఇంతకాలమూ! ఈ రోజు నిజం తెలిసింది.

ఇప్పుడు నేనేం చేయాలి? అరుణ ఒక్కసారిగా నా ఆశాసౌధాలన్నింటినీ కూల్చేసింది. ఆరంభంలో అరుణను అందరికివలెనే ఆవేశం కారణంగానే ప్రేమించాను. ఆవేశం ఎంతకాలముంటుంది? ఆమె కూడా నన్ను ప్రేమిస్తున్నదని తెలిశాక — మా వివాహం సంభవమయే సూచనలు కనపడ్డాక నేను కొన్ని ఆకాశహార్మ్యాలు నిర్మించసాగాను. అరుణ నలుగురన్నదమ్ములకు ఒక్కగా నొక్క ఆడబిడ్డ. గారంగా పెరుగుతోందామె. ఆమెకు వరుడుగా వచ్చేవాణ్ణి సామాన్య జీవనం అనుభవించనివ్వడు తండ్రి. నా ఉద్యోగం మెరుగుపడవచ్చు. సమాజంలో నా హోదా పెరగవచ్చు.

ఈ కలల కారణంగా నేను భవిష్యత్తును రంగులమయంగా ఊహించుకొన్నాను. ఆ కలలు కలలుగా మిగిలిపోవడం నాకిష్టంలేదు. దానికి నేనేం చేయాలి?

అరుణ తన బావను గురించి చెప్పిన విషయాలు నాకు నమ్మదగ్గవిగా అనిపించలేదు. ఆడవాళ్ళు ఊహాలోకంలో జీవిస్తూంటారు. ప్రదీప్ హాస్యానికనే మాటలు కూడా అరుణ నిజమని భ్రమించి అలా అనుకొని వుండవచ్చు. లేకపోతే ప్రదీప్ పొజిషన్‌లో ఉన్నవాడు హత్య గురించి ఆలోచిస్తాడా? అదీ ఓ ఆడదాని కోసం? అరుణ కాకపోతే—మరొకతె! నాకైతే ఆమె ప్రేమ జీవితంలో మలుపు కావచ్చు — కానీ ప్రదీప్ ఇప్పటికే భాగ్యవంతుడు.

అసలు ప్రదీప్‌కి అరుణ తనని ప్రేమించిన విషయం

తెలిస్తే ఏం చేస్తాడు? డబ్బున్నవారిని చాలామంది మధ్యతరగతి మనుషు లపార్థం చేసుకొంటూరు. ప్రదీప్ మంచివాడేమో! అతడు నిజంగా అరుణను ప్రేమిస్తూండి ఉన్నట్లయితే తప్పక మా యిద్దరికీ వివాహం జరిపిస్తాడు. అందువల్ల అసలు విషయం అతడి చెవిని వేయడంవల ప్రయోజనముండవచ్చు.

కానీ — ఒకవేళ అరుణ నిజమే చెప్పివుంటే నా ప్రాణాలు పోతాయి.

ఆమె అబద్ధం చెప్పివుంటే—.....నాకు అరుణ దక్కే అవకాశముంటుంది.

ఆమె చెప్పింది నిజమో అబద్ధమో తేల్చుకోవడం కోసం నా ప్రాణాలతో రిస్కు తీసుకోవడం నాకిష్టం లేదు. కానీ ప్రదీప్ మనసు తెలుసుకోమని నాలోని దురాశ వేగిర పెడుతోంది. అప్పుడు నాకు సత్యం గుర్తొచ్చాడు. సత్యం నాకు స్నేహితుడు.

సత్యం పరిచయం నాకు రైల్వే రిజర్వేషన్ కోసం క్యూలో నిలబడ్డప్పుడు జరిగింది. అతను కలుపుగోలుమనిషి. అప్పుడే మేమిద్దరం పక్కపక్క వీధుల్లో వుంటున్నట్లు తెలుసుకొన్నాం. అతనికి ఎవ్వరూలేరు. ఒంటరిపక్షి. ఇంకా వివాహం కాలేదు. అతడికి మా యింట్లో ఆదరణ నచ్చింది. తనూ మా కుటుంబంలోని ఒక వ్యక్తిగా కలిసి పోవాలని అనేవాడు. అతనలాగన్నప్పుడు నాకు చెల్లెలు మనసులో మెదిలినా—అమ్మ ఎప్పుడో అతడి కులాలూ అవీ నిర్ణయించేసి—"అతను నీకు స్నేహితుడిగానే తప్ప ఇంటల్లుడిగా పనికిరాడు—" అని చెప్పేసింది.

సత్యం తరచుగా మా యింటికి వస్తూ పోతూండేవాడు, నేను అప్పుడప్పుడు అతని గదికి వెళ్ళి వస్తూండే

వాణ్ని. అతను డిటెక్టివ్ నవల్లు చాలా ఎక్కువగా చదువుతాడు. మనిషికి అడ్వెంచర్స్ అంటే యిష్టం.

"ఇలా రోజూ ఆఫీసుకు వెళ్ళడం, తిరిగిరావడం— నెల జీతం పుచ్చుకోడం, ఖర్చు చేయడం—భోంచేయడం, పడుకోడం — ఇదేం జీవితమండీ — బొత్తిగా థ్రిల్ లేదు—" అనేవాడు సత్యం.

"థ్రిల్స్—విని ఆనందించడానికేగానీ స్వానుభవానికి బాగుండవు.—" అంటాను నేను.

"దొంగలు జైల్లో వుంటారు. మనం ఇంట్లో వుంటాం. పెద్ద తేడా లేదు—" అనేవాడు సత్యం.

"థ్రిల్స్ కోరడం వల్లనే వాళ్ళు ఇంట్లోంచి జైల్లో కెళ్ళారు—" అనేవాణ్ని నేను.

"ఇలాగంటున్నారు కానీ ఏదో ఓ రోజున మీరే నన్ను ప్రోత్సహించి — అడ్వెంచర్ చేయిస్తారని నా నమ్మకం. ఈ రోజే మాటన్నాను — గుర్తుంచుకోండి!" అన్నాడు సత్యం ఒకసారి.

సరిగ్గా ఈ మాటే నేనిప్పుడు ఉపయోగించుకోవాలను కొన్నాను. సత్యానికి థ్రిల్స్‌మీద వున్న సరదాను ఆధారంగా చేసుకొని నేనతన్ని నా ప్రేమ కథలో ఉపయోగించుకోవాలనుకొన్నాను.

పథకమొకటి మనసులో రూపు దిద్దుకొంటోంది.

## 3

"ఈ రోజు నేను నిజంగా థ్రిల్ చేయబోతున్నాను" అన్నాను.

"థ్రిల్ అండ్ యూ—" అన్నాడు సత్యం— "యూ కాన్ట్ మిక్స్."

"నువ్వే అన్నావోసారి — గుర్తుందా! నేనే నిన్ను

అడ్వెంచర్ కు ప్రోత్సహిస్తానని!"

"అయితే?"

"అదిప్పుడు నిజం కాబోతోంది—" అన్నాను.

"రియల్లీ!" అన్నాడు సత్యం. ఆశ్చర్యంతో అతడి కళ్ళు పెద్దవయ్యాయి.

"సావధానంగా విను—" అంటూ నేనతనికి అరుణ కథ అంతా చెప్పాను.

"మై గాడ్ — యూ ఆర్ హీరో!" అన్నాడు సత్యం.

"నా బొటాల్!" అన్నాను. "హీరో అయితే ఎవ్వరికీ భయపడడు — నేను ప్రదీప్ కి భయపడుతున్నాను. ఆ భయం కూడా నా గురించికాదు. నేను లేకపోతే నా తల్లి, చెల్లి, తమ్ముడు ఏమైపోతారన్నది నా బెంగ!"

"ఒస్ యింతే కదా—వాళ్ళకేలోటూ రానివ్వనని నేను హామీ యిస్తున్నాను—"

"హామీ యివ్వడం సులభం. వాళ్ళు నీకేమీ కారు. అందువల్ల నువ్వు మాట నిలబెట్టుకోలేవు. నిలబెట్టుకుందామనుకొన్నా నిన్ను కట్టుకొన్న భార్య సాగనివ్వదు—" అన్నాను.

"పోనీ—నీ కోసం—పెళ్ళి చేసుకోనని భీష్మ ప్రతిజ్ఞ చేయమంటావా?" అన్నాడు సత్యం.

"అదేమీకాదు. అడ్వెంచర్ కు నీకో గొప్ప ఛాన్సివ్వబోతున్నాను. నిజంగా థ్రిల్ కావాలనుకొంటే ఇది నీకు గొప్ప అవకాశం. కానీ చాలా గొప్ప రిస్కు కూడా!" అన్నాను.

"సస్పెన్స్ భరించలేకుండా వున్నాను. త్వరగా చెప్పు!" అన్నాడు సత్యం.

"ఈ కేసులో నా ప్రాణాలకు నీ ప్రాణాలు అడ్డు వేయాలి—"

"ఎలా?"

"నా తరఫున నువ్వు ప్రదీప్ వద్దకు వెళ్ళి అతడి మనసు తెలుసుకొని రావాలి."

"అందువల్ల నీకు ప్రాణాపాయ మెలా తప్పుతుంది? ఏరాయైతే నేం పళ్ళూడగొట్టుకో నేందుకు. ఈ విషయం అతడికి నువ్వు చెబితే నేం— నేను చెబితే నేం?" అన్నాడు సత్యం.

నేను నెమ్మదిగా — "నా పాయింటు నీకు అర్థం కావడంలేదు. అరుణను ప్రేమించింది— నేను కాదు. నువ్వే! అర్థమయిందా?" అన్నాను.

"ఏమన్నావ్?" అన్నాడు సత్యం ఒక్కసారిగా.

నేనతన్ని తమాయించుకోనిచ్చాను. నెమ్మదిగా సత్యానికి విషయం అర్థమయింది. అతను ప్రదీప్ దగ్గరకు వెళ్ళి తను అరుణను ప్రేమించాననీ, అరుణ తనని కూడా ప్రేమించిందనీ—తమ వివాహం జరిగేలా చేయమని చెప్పాలి. ప్రదీప్ మంచివాడైతే పెళ్ళి ఏర్పాట్లు జరుగుతాయి. చెడ్డవాడైతే సత్యం మీద హత్యా ప్రయత్నాలు జరుగుతాయి, మొదటిది జరిగితే ప్రయోజనం పొందేవాణ్ణి నేను. రెండవది జరిగితే సత్యం ప్రాణాలు ప్రమాదంలో పడతాయి.

"ఎలా వుంది నా అయిడియా?" అన్నాను.

"చాలా తెలివైన వాడివి నువ్వు—" అన్నాడు సత్యం.

"అయితే ఏమంటావ్?"

"బాగా ఆలోచించుకోవాలి నేను—" అన్నాడు

సత్యం.

"అరే-ఆలోచించుకోవాలంటున్నావా? ఎగిరి గంతేసి వెంటనే ఒప్పుకుంటావని నేననుకున్నాను—" అన్నాను.

సత్యం నవ్వి—"నీకు ప్రాణ ప్రమాదమైన సమస్య ఒకటి వచ్చావు. బాగా ఆలోచించుకొని అది నా మీదకు నెట్టేసే ఉపాయం ఆలోచించావు. నీ ఆలోచనై పోయింది. మరి నేనూ కాస్త ఆలోచించుకోవద్దూ!" అన్నాడు.

"నేను అరుణను ప్రేమిస్తున్నాను. అరుణ నన్ను ప్రేమిస్తోంది. ప్రదీప్ నిజంగా చెడ్డవాడేనో కాదో తెలియదు. నువ్వు ఊ అంటే మా ప్రేమ కథ ఫలిస్తుంది. అయినా ప్రదీప్ వున్నపళంగా హత్య చేసేయడు కదా! నీ ప్రేమకథ వినగానే అతను నిజానిజాలు విచారించ డానికి అరుణ దగ్గరకు వెడతాడు. అతను అభిమానంగా అడిగితే అరుణ నిజం చెబుతుంది. కోపంగా అడిగితే అబద్ధం చెబుతుంది. అప్పుడతను నీదగ్గరకు వస్తాడు. మాటలతో బెదిరిస్తాడు. డబ్బాశ చూపిస్తాడు. లేదా పెళ్ళికి మనస్ఫూర్తిగా తనూ అంగీకరిస్తున్నానని చెబుతాడు. అంతేగానీ—వెంటనే హత్యకు పాల్పడడం అన్నది సంభవం కాదనుకుంటున్నాను—" అన్నాను.

"సంభవమైనా, అసంభవమైనా ప్రమాదం నాకే గానీ నీకు కాదు గదా—అయినా నాకు ప్రాణ భీతి లేదు. ఇదో సవాలుగానే స్వీకరించి నేను రంగంలోకి దిగదల్చుకొన్నాను. ఎటొచ్చీ ఎలా మొదలు పెట్టాలా—అని ఆలోచించాలి గదా!"

సత్యం ఇలా అనగానే నాకు కలిగిన ఆనందమింతా అంతా కాదు. అతను నాకు సాయపడాలని అనుకుం

టున్నాడు. అదీ తన ప్రాణాలకు తెగించి! ఇది నేను ఆశించినదే.... కానీ ఆశ నెరవేరుతోంది!

"ఇందులో ఆలోచించడానికేముంది?" అన్నాను.

"చాలా వుంది. డబ్బున్న వాళ్ళ సంగతి నీకు తెలియదు. వాళ్లొకోసారి క్షణాలమీద నిర్ణయాలు తీసుకొని ఎలాంటి దారుణాలైనా చేయగల్గుతారు. ఎందుకంటే డబ్బుతో ఎలాంటి నేరాలైనా చేయవచ్చు. ఎలాంటి నేరమైనా మాపుకోనూవచ్చు. అందుకే వాళ్ళకు నిదానం గురించిన బెంగ వుండదు. కాబట్టి నేను ప్రదీప్ దగ్గరకు వెళ్ళేటప్పుడే మృత్యు ముఖంలోకి వెడుతున్నట్లుగా భావించుకొని అన్ని ఏర్పాట్లూ చేసుకొని వెళ్ళాలి!" అన్నాడు సత్యం.

"అన్ని ఏర్పాట్లూ అంటే!" అనడిగాను కుతూహలంగా.

"నా ప్రాణాలకు ప్రదీప్ ద్వారా ప్రమాదముందన్న విషయమూ, అందుకు కారణమూ — ముందుగా నీకు కాగితం రాసిచ్చి వెడతాను. నాకే ప్రమాదం జరిగినా నువ్వు పోలీసులకు చూపించవచ్చు—" అన్నాడు సత్యం.

"కొంపదీసి ప్రదీప్‌కు నా గురించి కూడా చెబుతావా? ఇలా ఉత్తరం రాసి నాకిచ్చినట్లు చెప్పావంటే ప్రదీప్ నా పని కూడా పూర్తిచేసేస్తాడు...." అన్నాను.

"నువ్వు పూర్తిగా నీ గురించే ఆలోచించుకుంటున్నావు. నీ గురించి నేను ప్రదీప్‌కెందుకు చెబుతాను?"

"ఆత్మరక్షణకు నువ్వేవో ఏర్పాట్లు చేసుకున్నట్లు ప్రదీప్‌కి చెప్పావంటే అతను నీ గురించి వాకబు చేసి చూస్తాడు. నీకంటూ ఎవరున్నారు? నా స్నేహం గురించి

తెలుస్తుంది. అంతే నా మీదకు తిరుగుతాడు...."

"నువ్వు సందేహ ప్రాణివి. ప్రదీప్ నామీద కత్తి ఎత్తినా కూడా నా ఆత్మ రక్షణకి ఏర్పాట్లు జరిగినట్లు చెప్పను. సరా?" అన్నాడు సత్యం.

హఠాత్తుగా నాకు నేను దుర్మార్గుడిననిపించసాగింది. నేను చేస్తున్న దేమిటి? ఓ అమాయకుణ్ని పులి నోట్లోకి తోస్తూ—ఆత్మ రక్షణకు ఎటువంటి ఏర్పాట్లూ చేసుకో రాదని రాసిస్తున్నాను. సామాన్యుడినైన నాకే ఇలా ఉన్నపుడు—డబ్బున్న ప్రదీప్ దుర్మార్గుడైతే ఆశ్చర్య మేముంది?

"సారీ సత్యం! నాలో స్వార్థం పెచ్చుమీరి నిన్ను కోరకూడని కోరికే కోరాను. నన్ను మన్నించు. నువ్వీ నాటకం ఆడొద్దు. నాకు భయంగా వుంది—" అన్నాను.

"భయం నీ లక్షణం. సాహసం నా లక్షణం-" అన్నాడు సత్యం.

## 4

సత్యం నన్నూరికే భయపెట్టాడు కానీ అతడికి భయం లేదు.

అతను వివరాలన్నీ ఓ సీల్డు కవరులో రాసివుంచి కవర్ని తన లాకరులో పెట్టి—లాకరు తాళం నాకిచ్చి—"ప్రదీప్ నన్నేమీ చేస్తాడని నేననుకోవడం లేదు. ఊరికే ఎందుకైనా మంచిదని జాగ్రత్త తీసుకొం టున్నాను—" అన్నాడు.

మర్నాడే అతను ప్రదీప్‌ని కలుసుకొని వచ్చాడు. తిరిగి వచ్చాక అతను చాలా ఉత్సాహంగా వున్నాడు.

నన్ను తన గదికి పిలిచి—"నీ పంట పండింది. ప్రదీప్ చాలా మంచివాడు. అతను నాతో సాదరంగా

మాట్లాడేడు. అతడిలో అహంకారం, కోపం అన్నవి ఏ కోశానా లేవు. మనిషి చాలా సౌమ్యుడు. నేను ప్రేమ గురించి అడిగేవరకూ చాలా మామూలుగా వున్నాడు! అరుణను నేను ప్రేమించాననగానే మనిషి తడబడ్డాడు. అరుణ కూడా నన్ను ప్రేమించిందన్న విషయం విని దెబ్బతిన్నాడు కూడా! తను ప్రేమించినట్లు ఎలా తెలుసని చాలాసార్లడిగి విచారంగా అయిపోయాడు. నా వివరాలన్నీ అడిగాడు.

పేరూ అన్నీ చెప్పి—అరుణ నన్ను సత్యం అని కాక విశ్వం అని పిలుస్తుందని చెప్పాను. సత్యం అంటే ఆమెకు తెలియదనీ — నేనామెకు నా పేరు విశ్వమని చెప్పానని అన్నాను. అలా ఎందుకు చెప్పావని అడిగాడు. ఆమె అంతస్థు చూసి భయపడి నా అసలు పేరు చెప్ప డానికి భయపడ్డానూ, మా పరిచయం తాత్కాలికమే అవుతుందీ అని అనుకొన్నానూ, కానీ ఆమె గాఢంగా నన్ను ప్రేమిస్తోందని తెలిసేక ఆమెకు నా హృదయంలో ఉన్న స్థానం గురించి కూడా ఆలోచించానూ అని చెప్పాను. ఆమె ప్రదీప్‌కు భయపడుతున్నట్లు కూడా చెప్పాను. అంతా విని—"మీరు రేపు మళ్ళీ నన్నొకసారి కలవండి!" అన్నాడు ప్రదీప్. అలాగేనని బైటకు వచ్చేను. అతని ముఖం చూస్తూంటే ఓ నిర్ణయాని కొచ్చినట్లు కనబడుతుంది—" అన్నాడు.

"అతనే నిర్ణయానికి వచ్చాడో తెలియదుకదా!" అన్నాను.

"అనుమానించడం నీ జన్మహక్కు. కాదనను, కానీ ఎప్పుడూ చెడు ఊహించడం ఎందుకు? ఈ రాత్రి

హాయిగా నిద్రపో. కలలో అరుణతో డ్యూయెట్లు పాడు. ఆ తర్వాత నిజంగానే పాడుకోవచ్చు—"
సత్యం.

సత్యం మాటల్లో నమ్మకం కనపడింది. అరుణ నాకు ప్రదీప్ గురించి సరిగ్గా చెప్పలేదు. నేననుకొన్నట్లు ప్రదీప్ చెడ్డవాడు కాదు. అతను చాలా మంచివాడు. కానీ తను ప్రేమిస్తున్న అరుణ మరో యువకుణ్ని ప్రేమిస్తున్నదంటే ప్రదీప్ నిమ్మకు నీరెత్తినట్లు ఎలా వుండగలిగాడు? అసలతను అరుణను ప్రేమించాడా లేక ఏదైనా పథకంలో వున్నాడా?

రాత్రి నిద్రపోయాను. అరుణతో డ్యూయెట్లు పాడాలనుకొన్నాను కానీ కలలోకి అరుణ రాలేదు. ప్రదీప్ వచ్చాడు. అతనెలా వుంటాడో నాకు తెలియదు. అందువల్లనేమో ప్రేమ్ చోప్రాలాగా, కాసేపు మోహన్ బాబులాగా కనిపించాడు. ఎంతసేపూ వీళ్ళిద్దరే తప్ప అరుణ కలలో తన ముఖం చూపించలేదు.

నిజం చెప్పాలంటే రాత్రి సరిగ్గా నిద్రపట్టలేదు. కలత నిద్రపోవడంతో తెల్లవారు ఝామున మంచి నిద్ర పట్టింది. లేచేసరికి ఆలస్యమైపోయింది. కాస్తోకూస్తో కాదు. ఆఫీసుకి వెళ్ళడానికింక గంటమాత్రమే టయిముంది. నన్ను లేపనందుకు చెల్లెల్ని, తమ్ముణ్ని తిట్టాను. వాళ్ళు బిక్కమొహాలేసుకొని నిలబడితే—"నువ్వేకదూ-ఓసారి లేపినందుకు—నేనెప్పుడు లేవాలో నాకు తెలుసు. మంచి నిద్రలో వున్నప్పుడు డిస్టర్బ్ చేయకండి—అని వాళ్ళని తిట్టావు. ఇప్పు డిలాగంటావేం?" అంటూ అమ్మ నన్ను నిలదీసింది.

అమ్మ తర్వాత ఇంట్లో నేనే పెద్దవాణ్ని. దానికి

తోడు సంపాదనపరుణ్ని. డబ్బు, అధికారం—రెండూ కలిసి అప్పుడప్పుడు నాచేత జులుం ప్రదర్శించేలా చేస్తాయి. జులుంకు తర్కం వుండదు. బలవంతుడిదే రాజ్యమక్కడ! అమ్మ లేకపోతే తమ్ముడు, చెల్లి నా కారణంగా చాలా అవస్థలుపడి వుండేవారు. నా తప్పుల నెత్తి చూపించడానికి అమ్మ వుంది. అప్పుడు నేను మామూలు మనిషిని అయిపోయి తప్పు గ్రహిస్తూంటాను. అప్పుడు నాకు సత్యం గుర్తుకు వచ్చాడు. పాపం అతడికి అమ్మలేదు!

"ఏదో చిరాకు వచ్చి అలాగన్నానమ్మా నాకు వాళ్ళ మీద పగా—ఏమన్నానా?" అంటూండగా మా పని మనిషి ఆదరాబాదరాగా ఇంట్లో అడుగుపెట్టి—"బాబూ ఈ ఘోరం విన్నారా?" అంది.

"ఏం జరిగిందే?" అంది అమ్మ.

"సత్యంబాబు తన గదిలో చచ్చిపడున్నాడు—" అంది పని మనిషి.

నెత్తిమీద పిడుగుపడ్డట్లయింది నాకు-"ఏమన్నావ్?" అన్నాను.

"సత్యం బాబును ఎవరో చంపేశారు—" అంది పని మనిషి ఈసారి.

సత్యాన్ని ఎవరో చంపేశారు!....ఒక్కసారి నా వెన్నుపూసలోంచి చలి, వణుకు పుట్టుకొచ్చాయి. సత్యం నా మృత్యువును తను వరించాడన్న విషయం హఠాత్తుగా నాకు స్ఫురించింది.

పనిమనిషి తనేం చూసిందో చెబుతోంది.

అది రోజూ మా యింట్లో పనయ్యాక సత్యం గదికి వెళ్ళి ఊడ్చి వస్తుంది. దాన్ని మేమే అతనికి కుదిర్చి

పెట్టాం. ఈ రోజుది ఎంత తలుపు తట్టినా సత్యం తలుపు తీయలేదట. అప్పు డది పక్కనున్న కిటికీ తలుపు తోసి చూసిందిట. లోపల మంచంమీద సత్యం బోర్లా పడివున్నాడట. వీపులోకి కత్తి దిగి వున్నదట. మంచంనిండా రక్తం చిమ్మి వున్నదట. అది పెద్దగా హడావుడిచేసి కేకలు పెట్టి నలుగుర్ని పిలిచిందిట. ముందుగా సత్యానికి గది అద్దెకిచ్చిన ఓనరు వచ్చాట్ట. అంతా తలుపులు తీయడానికి నానా హడావుడీ పడుతున్నారు. కొంతమంది పోలీస్ స్టేషన్‌కు పరుగెత్తారు. పనిమనిషే మా విషయం మాకు చెప్పడానికని హడావుడిగా పరుగున వచ్చింది.

సంగతి తెలుసుకోవడానికని నేనూ, తమ్ముడూ వెళ్ళాం. అప్పటికి పోలీసులు కూడా వచ్చారు. గది చుట్టూ ప్రదక్షిణాలు చేయడంలో వారికి హంతకుడెలా పారిపోయాడో తెలిసిపోయింది. గది నానుకునే బాత్రూముంది. బాత్రూం కిటికీ అద్దాలు బద్దలుకొట్టి వెళ్ళి అందులోంచి వెళ్ళిపోయాడు హంతకుడు. అందులోంచే ఇప్పుడు పోలీసులు దూరారు. గది తలుపులు తెరిచారు.

అప్పుడందరూ శవాన్ని స్పష్టంగా చూశారు.

నిస్సందేహంగా ఇది హత్య!

పోలీసులు గదంతా గాలిస్తున్నారు. నేను కాస్త ముందుకు వెళ్ళి—"సత్యం!" అని గట్టిగా అరిచాను. అప్పుడు పోలీసుల దృష్టి నావైపు మళ్ళింది.

నాకు నిజంగా ఏడుపు వచ్చేస్తోంది. సత్యం హత్య కావించబడ్డాడు. కానీ ఈ హత్యకు నేనే కారకుణ్ని. నిన్న రాత్రి సజీవంగా, సచేతనంగా వున్న అతడి శరీరం ఇప్పుడు ఎందుకూ కొరగానిది. జీవితంలో

అడ్వెంచర్సు, థ్రిల్సు కోసం అతడి మనసేమయిందో నాకు తెలియదు. అతడి ఆత్మ ఇప్పుడేం చేస్తూంటుందో, నన్ను గురించి ఏమనుకుంటుందో నేనూహించలేదు.

పోలీసులు నానుంచి సత్యం గురించి కొన్ని వివరాలు రాబట్టారు. అతడు నా స్నేహితుడు. ఫలానాచోట ఉద్యోగం. నా అన్నవాళ్ళు. ఇవీ నేను చెప్పిన వివరాలు.

సత్యం చేతికి వాచీ, రెండుంగరాలు ఉండాలి. అవి లేవు. అతడి జేబులో పర్సులేదు. గదిలోని రేడియో మాయమైంది. ఎవడో దొంగతనానికి వచ్చి ఈ హత్య చేసివుండాలని పోలీసులు అభిప్రాయపడ్డారు. వేలి ముద్రల నిపుణులు పలుచోట్లనుంచి వేలిముద్రలు రాబట్టడానికి ప్రయత్నించారు.

అయితే ఈ హత్య ఎవడో దొంగ చేసింది కాదనీ, ప్రదీప్ అని నాకు తెలుసు. పోలీసుల ఆలోచనల్ని తప్పుదారి పట్టించడం కోసమని ప్రదీప్ డబ్బు, రేడియో, ఉంగరాలు తీసుకొని వెళ్ళాడు. వాటిని అతనెక్కడో పారేసి వుంటాడు. ఓ మూల సత్యం పోయినందుకు దుఃఖం, మరో మూల ప్రదీప్ మీద పగ!

పోలీసులక్కణ్నించి వెళ్ళిపోయారు. నేనింక ఆఫీసుకు వెళ్ళలేకపోయాను. తమ్ముడిచేత సెలవు చీటీ పంపించాను. తల పట్టుకొని యింట్లో కూర్చున్నాను.

ఎంత దారుణం! సత్యం చేసిన తప్పేమిటి? తను అరుణను ప్రేమించానని చెప్పాడు. గొప్పింటి పిల్లను ప్రేమించడం అంత పెద్ద తప్పా? హెచ్చరిక లేకుండా చంపేయడమేనా?

కానీ హెచ్చరిక లేదని ఎందుకు అనుకోవాలి?

ఇందులో ప్రాణ ప్రమాదముందని తెలిసే తను సత్యాన్ని ఇరికించాడు. అరుణ తన్ను హెచ్చరించింది. చిన్నతనం నుంచీ ఎరిగున్న బావ ఏం చేస్తాడో ఆమెకు తెలుసు. అందుకే అంత కచ్చితంగా తన్ను మరిచిపొమ్మని చెప్పింది.

ఇప్పుడర్థమవుతోంది—అరుణ నన్నెంత ప్రేమించిందో!

# 5

జీవితంలో థ్రిల్స్ గురించి నేను పెద్దగా పట్టించుకోక పోవచ్చును. కానీ సత్యం నా మిత్రుడు. అతనిప్పుడు లేడు. లేకపోవడానికి కారణం నేను! అతణ్ని హత్య చేసిన వాడిని నేనంత సులభంగా వదలకూడదు. వదిలితే వాడు పెచ్చుమీరి పోతాడు. ఏమైనా సరే, ఎంత ప్రమాద మున్నా సరే నేను ప్రదీప్‌ని కలుసుకొనితీరాలని నిర్ణయించుకున్నాను. అయితే ప్రదీప్‌ని ఎలా కలుసుకోవాలి? ఈ విషయంలో అరుణను సంప్రదించాలా?

చాలాసేపు ఆలోచించి అరుణనిందులోకి లాగ కూడదనే నిర్ణయించుకున్నాను. ఆ తర్వాత ప్రదీప్‌ని కలుసుకోవడం పెద్ద కష్టం కాలేదు. ఓ సాయంత్రం అరుణా వాళ్ళింటిముందు కాసి — ప్రదీప్ ఒక్కడూ కార్లో బైటకు వస్తోంటే దార్లో కారాపి నేనూ అందులో ఎక్కాను.

ప్రదీప్ నాకు తెలుసు గానీ మరీ యింత దగ్గర్నుంచి చూడలేదు నేను. అతను చాలా బాగున్నాడు. డబ్బు అతడిలోని అణువణువుకీ అందాన్నీ, హుందాతనాన్నీ యిచ్చింది. అతని ముందు నేను చాలా తీసి కట్టుగా ఉన్నాను. అతణ్ని కాదని అరుణ నన్ను ప్రేమించడం ఆశ్చర్యమే కాదు, గర్వకారణం కూడా!

"మీ రెవరో నేను తెలుసుకోవచ్చా?" ఎంతో నమ్రతగా అడిగాడు ప్రదీప్.

"సత్యం స్నేహితుణ్ని!" అన్నాను.

"సత్యం ఎవరు?" అన్నాడతను ఆశ్చర్యంగా.

"సత్యం మిమ్మల్ని రెండ్రోజుల క్రితం కలుసుకున్నాడు—" అన్నాను.

ప్రదీప్ నా వంక వినయంగానే చూసి — "నన్ను రోజూ ఎంతోమంది కలుసుకుంటూంటారు. వివరంగా చెబితేగానీ ఎవరెవరో గుర్తుండదు. ఇలా అంటున్నానని అన్యథా భావించకండి—" అన్నాడు.

"సత్యం అనగానే మీకు గుర్తు వస్తుందనుకున్నాను. వివరంగా కావాలంటే అలాగే చెబుతాను. అతడు మీ మరదలు అరుణను ప్రేమించిన విషయం మీకు చెప్పడానికి వచ్చాడు—" అన్నాను.

కారుకు సడన్ బ్రేకు పడింది — "ఏమన్నారూ?" అన్నాడతను.

"సత్యం మీ మరదలు అరుణను ప్రేమించాడు. ఆ విషయం మీతో చెప్పడానికి వచ్చాడు—" రెట్టించాను.

"అసంభవం—" అన్నాడు ప్రదీప్.

"ఏమిటి అసంభవం?" అన్నాడు కాస్త కటువుగా.

"ఏమీ లేదు. అరుణ కూడా అతన్ని ప్రేమించిందా?"

"ప్రేమించింది—"

"ఇదింకా అసంభవం!" అన్నాడు ప్రదీప్.

"ఈ రెండూ సంభవాలే కాని వాళ్ళ పెళ్ళి మాత్రం అసంభవం!" అన్నాను.

"అఫ్కోర్స్!" అన్నాడు ప్రదీప్.

"ఏం — అఫ్‌కోర్స్ అని అంత తేలికగా తీసి పారేశారు. అన్నీ మీకు తెలుసా?" అన్నాను.

"నాకేమీ తెలియదు. తెలిసిందల్లా మరో రెండు నెలల్లో నాకూ, అరుణకూ పెళ్ళి జరుగుతుందని!"

"అసంభవం!" అన్నాను.

ప్రదీప్ ముఖం ఎర్రబడింది — "ఎందువల్ల?"

"సత్యం హత్య గురించి మీరు సంజాయిషీ ఇచ్చుకోవలసి ఉంటుంది—" అన్నాను.

అతను సీట్లోంచి ఎగిరిపడ్డాడు — "సత్యం హత్య కావించబడ్డాడా?"

"అవును. అదీ మీతో మాట్లాడివచ్చిన రోజు రాత్రే!"

"అతనెవరో నాకు తెలియదు. అతనెప్పుడూ నన్ను కలుసుకోలేదు...."

"బుకాయించి ప్రయోజనం లేదు. విషయం పోలీసులదాకా వెడితే అప్పుడు మీరే అన్నీ చెబుతారు. ముందుగా హెచ్చరించుదామనే వచ్చాను—"

ప్రదీప్ నావంక అదోలా చూస్తూండిపోయాడు.

"ఇలా జరుగుతుందని మీరూహించి వుండరు. సత్యం ప్రమాదాన్ని శంకించి ముందుగానే అన్ని జాగ్రత్తలూ తీసుకున్నాడు. తను గనుక చంపబడితే అందుకు మీరే కారణమవుతారని ఓ కాగితం రాసిచ్చాడు. అది నా వద్ద భద్రంగా వుంది!"

"నాకు తెలియని మనిషిని నేనెందుకు చంపుతాను?"

"నేనూ మీకు తెలియని మనిషినే! ఇప్పుడు మీకు నన్ను కూడా చంపాలనిపించవచ్చు. కానీ నన్ను చంపడానికి ప్రయత్నించకండి. నన్ను చంపితే పోలీసులకు

మీరు రెడ్ హేండెడ్‌గా దొరికిపోతారు—" అని కారు డోర్ తెరుచుకొని బైటకు వచ్చేశాను.

## 6

తర్వాత నేను అరుణను కలుసుకొన్నాను.

"మా బావ ప్రమాదకరమైన మనిషి. మనమిలా కలుసుకోవడం అస్సలే మంచిదికాదు—" అంది అరుణ.

"అవునా? మరి నేనిప్పుడు మీ బావను ప్రమాదంలో ఇరికించాను—" అన్నాను.

"ఎలా?" అంది అరుణ ఆశ్చర్యంగా.

నేను సత్యంతో కలిసి ఆడిన నాటకం చెప్పాను. అరుణ ఆశ్చర్యపడింది.

"అంతా నీ కోసమే చేశాను. కానీ ఈ నాటకం నిజంగానే సత్యాన్ని బలి కోరుతుందని తెలియదు—"

అరుణ అదిరిపడింది — "ఏమన్నావ్? సత్యానికేమయింది?"

"సత్యం చచ్చిపోయాడు!"

"ఎలా?"

"ఎవరో అతన్ని హత్య చేశారు. అతనెవరో నీకు తెలుసు—" అన్నాను.

అరుణ ముఖం పాలిపోయింది — "బావ ఆ హత్య చేశాడని నీ అనుమానమా?"

"అనుమానం కాదు. ఆధారాలున్నాయి. అతనిప్పుడు ప్రమాదంలో వున్నాడు. సత్యం రాసి ఇచ్చిన చీటీ కనుక పోలీసుల చేతిలో పడితే నీ బావ కటకటాల వెనక్కి వెళ్ళడం ఖాయం—" అన్నాను.

"అంత పని చేయొద్దు. బావ హత్యలు చేసేటంత కర్కోటకుడు కాదు—" అంది అరుణ.

"అలా ప్లేటు మార్చకు. ఎంత లేదన్నా అతడు నీకు బావ. అందువల్ల అతణ్ని వెనకేసుకొస్తావు. కానీ ఒక నిండు ప్రాణాన్ని తీసే హక్కు ఎవరికీ లేదని తెలుసుకో. అందువల్ల చేసిన పాపానికి శిక్ష అనుభవించక తప్పదు—" అన్నాను.

"వద్దు. బావకు నోటి దురుసుతనముంది కానీ చేతల్లో పసిపిల్లవాడి కన్నా ఘోరం. చూస్తూ చూస్తూ చీమను కూడా చంపలేడు. అలాంటివాడు హత్యలెలా చేస్తాడు?" అంది అరుణ.

"అయితే నువ్వు నన్నెందుకు హెచ్చరించావ్? నీ హెచ్చరిక నిజమెలాగయింది!" అన్నాను.

అరుణ ఏదో చెప్పబోయి ఆగిపోయింది—"నువ్వీ సమాచారం పోలీసులకు చెప్పావంటే మన పెళ్ళి జరుగదు. నా బావ అమాయకుడని నాకు తెలుసు. చూస్తూ చూస్తూ అతణ్ని పోలీసుల కప్పగించినవాణ్ని భర్తగా స్వీకరించలేను—"

"పోనీ— నేను గప్ చిప్ గా ఊరుకొంటాను. అప్పుడు నువ్వు వెంటనే నన్ను పెళ్ళి చేసుకుంటావా?"— అన్నాను.

"విశ్వం—ఇలా బ్లాక్ మెయిల్ చేసి నన్ను పెళ్ళాడుదామనుకొంటున్నావా? నీ గురించి నేనెంతో వున్నతంగా వూహించాను. ఇప్పుడిలా మారిపోతే నువ్వంటే అసహ్యం వేరుకొంటుంది—"

"చూడరుణా! నీ బావ ఎలాంటివాడో నాకు నా సత్యం అలాంటివాడు. మన ప్రేమకోసమే సత్యం బలైపోయాడు. నువ్వు నీ బావను రక్షించుకోవడం అవివేకం. అతడొక దారుణ హంతకుడు. అలాంటివాడు సమా

జంలో వుంటే ఎంత ప్రమాదమో తెల్సుకొని నేను వణికి పోతున్నాను. ఏదో ఓ రోజున అతను నన్నూ హత్య చేయగలడు—" అన్నాను.

అరుణ నా వైపు అదోలా చూసింది. ఆ చూపుల్లో నిస్సహాయతను నేను చదవగలిగాను.

"మైడియర్ అరుణా! బాగా ఆలోచించుకో! సత్యం కోసం నేను చేయగలిగింది చేస్తాను. నువ్వు ప్రదీప్ కోసం నువ్వు చేయగలిగింది చేయి. న్యాయాన్యాయాలు విచారించడానికి కోర్టులున్నాయి. ఆ పైన భగవంతుడున్నాడు—" అన్నాను.

## 7

ప్రదీప్, అరుణ కలిసి మా ఇంటికొస్తారని నేనూహించలేదు. కారు మా యింటి ముందే ఆగింది. ఇద్దరూ సరాసరి లోపలికి వచ్చారు. నన్ను చూడగానే కూడా రమ్మనమని రిక్వెస్టు చేశారు. ఇంట్లో చెప్పి వాళ్ళతో నేనూ కారెక్కాను. కార్లో ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు. అంతా మౌనంగా ఉన్నాం.

కారు బీచి దగ్గర ఆగింది.

"ఇక్కడా పేరా?" అన్నాను ఆశ్చర్యంగా.

"ఏం—ఏదైనా నిర్మానుష్యమైన స్థలానికి తీసుకువెడతామనుకొన్నావా?" అని నవ్వింది అరుణ.

ఆ నవ్వు అందంగా, మనోహరంగా లేదు. విషాదంగా వుంది.

"అలా అనుకొంటే మీతో బయల్దేరి ఎందుకు వస్తాను?"—అన్నాను.

"మనం కాస్త సీరియస్‌గానే చర్చించవలసిన విషయమిది—" అంది అరుణ.

ముగ్గురం బీచి దగ్గర కూర్చున్నాం. ఎవరూ కాసేపు మాట్లాడలేదు. నిశ్శబ్దాన్ని అరుణే ఛేదిస్తూ అంది—
"ప్రదీప్ ఈ విషయంలో అమాయకుడు. నువ్వు అనవసరంగా అతన్ని కేసులో ఇరికించవద్దు—"

"ప్రదీప్‌గారు అమాయకులు కావచ్చుగానీ—అసహాయులని నే ననుకోను. నేను నాకు తెలిసిన నిజాలు పోలీసులకు చెప్పకతప్పదు. అమాయకులపై లేనిపోని నేరాలు మోపడం నా హాబీ కాదు. అలాగని నా మిత్రుణ్ని బలిగొన్నవాణ్ని వదిలిపెట్టలేను. ఆ కేసులో నా దగ్గరున్న ఆధారాలన్నీ పోలీసులకు అప్పగించి తీరాలి!" అన్నాను.

ప్రదీప్ నావంక దీనంగా చూసి—"విశ్వంగారూ! తిరుపతి వేంకటేశ్వరుడే డబ్బు తీసుకొని మోసగాళ్ళకు సాయపడుతున్నాడు. ఈ ప్రపంచంలో దేవుడితో సహా అందరికీ డబ్బే ప్రధానం. నేను తప్పుచేశానని అనుకోండి. నన్ను మీరు రక్షించడానికి వెల పెట్టండి. మీ రేంకోరినా నేనిచ్చుకుంటాను—" అన్నాడు.

ప్రదీప్ డబ్బు గురించి చెప్పిన మాటలు నిజంకాదు. అన్ని వేళలా మనిషి డబ్బుకు ప్రాధాన్యత ఇవ్వడు. బహుశా, నేనడిగితే ప్రదీప్ ఎన్ని వేలైనా ఇస్తానంటాడేమో. కానీ నా గుండె మండిపోతోంది. సత్యం కేవలం నా కోసం చచ్చిపోయాడు. అరుణను ప్రేమిస్తున్నానని అన్న చిన్న కారణానికి సత్యం ప్రాణాలు తీశాడు ప్రదీప్. ఇంతటి దుర్మార్గుడికి పాఠం చెప్పకుండా వదిలితే ఈ హత్యలకు అంతం వుండదు.

"దేవుడు హంతకులకు సాయపడవచ్చునేమోగానీ—నేను సాయపడలేను—" అన్నాను.

"నేను హంతకుణ్ని కాను. కానీ మీరు నన్ను హంతకుణ్ణి చేయగలరు. ఒకసారి లోకం దృష్టిలో హంతకుడనిపించుకున్నానంటే నా జీవితం దుర్భరమవుతుంది-" అన్నాడు ప్రదీప్.

"మీరు హంతకుడు కాదని నమ్మమంటారా?" అనిఅన్నాను. అరుణ నాకేం చెప్పిందో చెప్పాను. అప్పుడు నేను వేసిన పథకం చెప్పాను. సత్యం నాటకమాడడం గురించి చెప్పాను. తర్వాత సత్యం చచ్చిపోయాడు.

"అంతా కాకతాళీయం—బావ నిజంగా హత్యలు చేసేంతటివాడు కాడు—" అంది అరుణ.

"అన్నీ పోలీసులు చూసుకొంటారు...." అన్నాను.

"మీరు కోరిన డబ్బు ఇస్తాను...." మళ్ళీ అన్నాడు ప్రదీప్.

"నాకు డబ్బు వద్దు. నా కోసం ప్రాణ త్యాగం చేసిన సత్యం ఆత్మకు శాంతి కావాలి!" అన్నాను.

ప్రదీప్ దీనంగా అన్నాడు—"సత్యం నన్ను కలుసుకొన్నమాట నిజం. అతడితో నే నెంతో సౌమ్యంగా మాట్లాడేను. అంత చిన్న కారణానికి హత్యలు చేసేటంత మూర్ఖుణ్ని కాను నేను—"

"సరే — అసలు మొదట కలుసుకొని మాట్లాడలేదనే అన్నారు. ఇప్పుడు మాట్లాడేను కానీ హత్య చేయలేదంటున్నారు. నేరస్థుడు నేరాల్ని ఒప్పుకొనడానికి స్టెప్సుంటాయి. ఇంకా ఎన్ని స్టెప్పు అవసరమవుతాయో నాకు తెలియదు. అయినా అది నాకు అనవసరం. పోలీసులు చూసుకొంటారు—" అన్నాను.

"పాతిక వేలిస్తాను...." అన్నాడు ప్రదీప్.

"పాతిక వేలా?" ఆశ్చర్యంగా అన్నాను.

"అవును. మొదట అయిదనీ తర్వాత పదనీ అలా పెంచుకొంటూ పోవడం ఇష్టంలేదు నాకు. బాగా ఆలోచించుకోండి. పాతిక వేలు. అంతా క్యాషు...." అన్నాడు ప్రదీప్.

"ఆ పాతికవేలూ నేను మీకే ఇచ్చేస్తాను. నా సత్యాన్ని నాకు తిరిగిచ్చేస్తారా?" అన్నాను.

ప్రదీప్ తెల్లమొఖం వేసుకొని నా వైపు చూశాడు. నేను లేచి నిలబడి — "ఇంక మీతో మాట్లాడేదేమీ లేదు. మీరు అమాయకులైతే మీకే ప్రమాదమూ వుండదు. నేను కత్తి గట్టింది మీమీద కాదు. సత్యాన్ని హత్య చేసిన వాడిమీద—అంతే!" అన్నాను.

# 8

ఇంట్లో కూర్చుని ఆలోచిస్తున్నాను.

పాతికవేలంటే మాటలు కాదు. జీవితంలో అలాంటి అవకాశం నాకు రాదు. పోయిన సత్యం ఎలాగూ తిరిగి రాడు. బేరం మొదలేటే పాతికవేలతో అయింది. అది అలా అలా పెరిగి-యాభై నుంచి లక్షదాకా పాకేదేమో!

ఆవేశంలో మంచి అవకాశం వదులుకొన్నానేమో.

ఆవేశం నాచేత ఆ నిర్ణయం చేయించినా అందులో వివేకం కూడా వుంది.

అరుణను ప్రేమించానన్న చిన్న మాటకు సత్యాన్ని హత్యచేసినవాడు నన్ను మాత్రం వదుల్తాడా? నా దగ్గరున్న ఆధారం లాగేశాక నన్ను చంపేయగలడు. అదలాగుంచితే—సత్యాన్ని నేను స్నేహితుడని చెబుతున్నాను. నా కోసం ప్రాణాలు కూడా త్యాగంచేయ గలిగాడన్నాను. అలాంటి స్నేహితుణ్ని హత్యచేసినవాడి ఆచూకీని నా దగ్గరుంచుకొని డబ్బుకు బేరంపెడితే

అరుణముందు నా శీలం దెబ్బతినదూ? పైగా ప్రదీప్ హంతకుడిగా నిరూపించబడితే అరుణ నా కెలాగూ దక్కుతుందా? అప్పుడు న్యాయబద్ధంగానే నాకు కనీసం లక్షరూపాయలైనా వస్తాయి. ఈ అన్యాయపు కూడుకు ఆశించి జీవితాంతం మనస్సాక్షితో బాధపడడ మెందుకు?

కాబట్టి డబ్బు తీసుకోకపోవడం మంచి నిర్ణయమే!

మనసు తేలిక పడే సమయానికి సోమసుందరం వచ్చాడు. అతను నా స్నేహితుడు. వివాహమై ఏడా దయింది. అతడికీ భార్యకూ క్షణం పడదు. దెబ్బలాట తీవ్రతరమైతే భార్య పుట్టింటికి వెళ్ళిపోతుంది. సోమ సుందరం ఏ స్నేహితుడింటికో వెడతాడు. సాధా రణంగా మా యింటికి వస్తూంటాడు. మర్నాడుదయానికి కోపాలు సర్దుకొంటాయి. మళ్ళీ కలిసిపోతారు. ఈ ఏడాది కాలంలోనూ సోమసుందరం మా ఇంటికి మూడు సార్లు వచ్చాడు. అతగాడి అత్తగారు — ఈ ఊళ్ళోనే వుండడం తన దురదృష్టమని అతను వాపోతాడు.

"దురదృష్టంకాదు. అదృష్టం— లేకపోతే కోపానికి దారిఖర్చులు జతపడేవి. ఇప్పుడే నయం — ఓ పూట భోజనం కలిసొస్తోంది—" అనేవాడు సత్యం. పాపం సత్యం ఇప్పుడు లేడు.

వాటం చూస్తూంటే సోమసుందరం పెళ్ళాంతో దెబ్బలాడే వచ్చినట్లున్నాడు. ముఖం చూస్తే తెలిసి పోతుంది. అతన్నా విషయం అడక్కుండా ఆ కబురూ ఈ కబురూ చెప్పి రాత్రి భోజనానికి వుంచేశాను. ఇద్దరం ఓ గదిలోనే రెండు మడత మంచాలు వేసుకొని పడుకొన్నాం.

సోమసుందరానికి భోజనం పెట్టినందుకు మేము విచా

రించనవసరంలేదు. అతడు మమ్మల్ని సకుటుంబంగా భోజనానికి పిల్చి బాకీ తీర్చుకుంటాడు. అతడి భార్య వంటలు చాలా బాగా చేస్తుంది.

సోమసుందరం, నేను ఎక్కువగా సత్యం గురించే కబుర్లు చెప్పుకొని నిద్రపోయాం.

ఓ రాత్రివేళ గదిలో ఏదో చప్పుడైనట్లు అనిపించి మెలుకువ వచ్చింది. చటుక్కున లేచి గదిలో దీపం వేశాను. గదిలో ఓ మూల నల్లని భయంకరాకారం కనబడింది. వాడు మనిషే కానీ—మనుషుల్ని తినేసేలాంటి రూపం వుంది. వాడి చేతిలో కత్తి కూడా వుంది.

వాడు కత్తిని చూపి బెదిరిస్తూ అరవద్దని సైగచేసి తనకు దగ్గరగా రమ్మన్నాడు. అరిస్తే వాడు నన్ను చంపేస్తాడు. నేను నెమ్మదిగా వాణ్ని సమీపించాను.

"గొడవ చేయకుండా నీ దగ్గరున్న లాకర్ తాళం ఇవ్వు—" అన్నాడు వాడు.

ఓహో—వీణ్ని ప్రదీప్ పంపాడన్నమాట. నా దగ్గర సమాచారం లాకర్లో భద్రంగా వున్నదన్న విషయం అరుణకు చెప్పాను. అరుణ ప్రదీప్‌కి చెప్పివుంటుంది.

"ఏ లాకర్ తాళం?" అన్నాను ఏమీ ఎరగనట్లు.

"అన్నీ నీకు తెలుసు. నా కత్తికి పని చెప్పనివ్వకుండా త్వరగా ఆ తాళం నాకు ఇవ్వు. తప్పు తాళం ఇచ్చావో-నీ పని అయిపోతుంది—" అన్నాడు భయంకరుడు.

నాకేం చేయాలో తోచలేదు. పాతిక వేలకు లొంగలేదని ప్రదీప్ తెగించాడన్న మాట! అయితే నేను చేయగలిగిందేముంది? నెమ్మదిగా అల్మారా దగ్గరకు నడిచాను. లాకరు తాళం అందులో వుంది. వాణ్ని మోసం చేయడానికి లేదు. వాడు పరమ భయంకరంగా

వేస్తున్నాడు. వాడి చేతుల్లో చావడం నాకిష్టంలేదు. బహుశా ప్రదీప్ సత్యాన్ని చంపడానికి వీణ్ణే నియోగించాడేమో!

నేను అల్మారాను సమీపిస్తే వాడు నన్ననుసరించాడు. నేను అల్మారా తలుపులు తీస్తూండగా చిన్న కేక వినిపించింది. అది భయంకరుడి కంఠంలా లేదు. సన్నగా వుంది. అప్రయత్నంగా వెనక్కు తిరిగాను.

భయంకరుడు నేలమీద పడి వున్నాడు. పక్కన సోమసుందరం నిలబడి వున్నాడు. అప్పుడు నాకు గుర్తొచ్చింది. ఇందాకా నేను విన్న చిన్న కేక—సోమసుందరం కరాటే అరుపు. అతడు కరాటే నేర్చుకున్నాడు. అతడి భార్యకూ కరాటే వచ్చును. అసలు కరాటే స్కూల్లోనే వారు ఒకరినొకరు ప్రేమించుకున్నారని అంటారు.

"ఎవడు వీడు? దొంగతనానికి వచ్చాడా? ఈ సోమసుందరం వుండగానే రావడానికి ఎంత ధైర్యం?" అన్నాడతను.

భయంకరుడు సోమసుందరంముందు పిల్లిలా అయిపోయాడు. తన పొరపాటును మన్నించమన్నాడు. తన్ను ప్రదీప్ పంపించాడనీ, మరెప్పుడూ ఇటువంటి ప్రయత్నం చేయననీ అన్నాడు వాడు. అప్పటికప్పుడు వాడిచేత ఓ వాఙ్మూలం తయారు చేయించి సంతకం పెట్టించుకొని పంపించేశాం.

"ఏమిటిదంతా?" అన్నాడు సోమసుందరం.

నేను నా ప్రేమ కథ చెప్పాను. సత్యం ఎలా బలైపోయాడో వివరించాను.

"హార్నీ—వీళ్ళ పొగరు మండిపోనూ—ఓ అమ్మాయిని ప్రేమించానని అంటే చంపేస్తారా? మనుషుల ప్రాణా లంటే మరీ అంత చవగ్గా వున్నాయా వీళ్ళకి! ఇన్నాళ్ళ బట్టి ఆధారాలుంచుకొని నువ్వేం చేస్తున్నావ్? వెంటనే పోలీసులకు చెప్పొద్దూ—ఇప్పుడు పోలీసులు ఆలస్యానికి కారణాలడిగితే ఏం చెబుతావ్?" అన్నాడు సోమ సుందరం.

"సత్యం హత్య సంగతిని విని నేను షాక్ తిన్నాను. ఏమీ పాలుపోలేదు నాకు. అందువల్ల వెంటనే నా మతి పనిచేయలేదు. పనిచేసేసరికి ఓసారి ప్రదీప్‌ని బెదిరించా లనిపించింది—" అన్నాను.

"వీళ్ళు చాలా దారుణమైన మనుషులు. వీళ్ళ బెది రింపు కారణంగానే ఆధారాలందించడం ఆలస్యమైందని చెప్పు. రేపే పోలీసులకు లాకర్ తాళం చెవి అందజేయి" అన్నాడు సోమసుందరం.

అదే నాకు తక్షణ కర్తవ్యమనిపించింది. ఉత్సా హంగా సోమసుందరంవంక చూసి—"నువ్వూ నీ భార్యా ఇలాగే నిత్యం పోట్లాడుకుంటూ వుండాలి. నీ రాకవల్లనే ఈ రోజు నేను రక్షించబడ్డాను—" అన్నాను.

సోమసుందరం నవ్వి—"భలే ప్రేమ నీది! ఓ మిత్రుణ్ణి చంపింది. మరో మిత్రుడి భార్య వియోగాన్ని కోరు తోంది. అయితే నీవనుకొన్నట్లు నేను నా భార్యతో దెబ్బలాడి రాలేదు—" అన్నాడు.

"మరి!" అన్నాను ఆశ్చర్యంగా.

"నేను మా అత్తారింట్లో ఉన్నాను. మామగారితో దెబ్బలాట వచ్చింది—" అన్నాడు సోమసుందరం.

# 9

మర్నాడుదయం నేను లేచేసరికి అరుణ మా యింట్లో వుంది.

"ప్రదీప్ — తప్పులమీద తప్పులు చేసుకొంటూ పోతున్నాడు. అతను హంతకుడు కాడు. నేను చెబుతున్నాను. నన్ను నమ్ము. తన అమాయకత్వం నిరూపించుకోవాలని అతను ప్రయత్నిస్తూంటే నీ అనుమానం పెరిగి పోతోంది—" అంది అరుణ.

"అదేం కాదు. అతడి అంచనా తారుమారయింది. నేనా మనిషిని మన్నుకరిపించగలనని అతననుకోలేదు. అనుకొనివుంటే మరో విధంగా ప్రవర్తించి వుండేవాడు" అన్నాను.

"ఆ లాకర్ తాళం చెవి నాకివ్వకపోతే నేను మళ్ళీ నీతో మాట్లాడను—" అంది అరుణ.

నేను నవ్వి ఊరుకొన్నాను.

"నవ్వులాటకాదు. సీరియస్‌గా చెబుతున్నాను. ఆ తాళం నువ్వియ్యకపోతే ఇదే మనం ఆఖరిసారి కలుసుకోవడం. బాగా ఆలోచించుకో!" అంది అరుణ.

"అరుణా పాతిక వేలకు లొంగని మనిషి నీ మాటలకు లొంగతాడనుకున్నావా? సత్యాన్ని హత్యచేసిన వాణ్ని కటకటాల వెనక్కి పంపించడం కోసం నేను ఏం వదులుకోవడానికైనా సిద్ధపడతాను. ఆఖరికి నిన్ను కూడా!" అన్నాను.

"ప్రదీప్ అమాయకుడని నేను చెబుతున్నాను...."

"నువ్వు రెండు నాల్కల మనిషివి. ప్రదీప్ ఎంతో ప్రమాదకరమైనవాడనీ, నిన్ను ప్రేమించానంటే చాలు హత్యచేస్తాడన్నదీ నువ్వే! అతడమాయకుడంటున్నదీ

నువ్వే! నా ప్రేమను మరిచిపొమ్మన్నదీ నువ్వే! నా కోసం ఏమైనా చేయగలనన్నదీ నువ్వే! ఈ రోజు ప్రదీప్ కోసం నన్ను వదులుకొంటానంటున్నదీ నువ్వే! ప్రదీప్ కోసం నువ్వు నన్ను వదులుకొంటే—సత్యం కోసం నేను నిన్ను వదులుకోలేనా? అయినా ఇప్పుడు నాకు అనుమానం కూడా కలుగుతోంది — అసలు నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా, ప్రదీప్‌ని ప్రేమిస్తున్నావా అని!" అన్నాను.

అరుణ తెల్లబోయినట్లు నా వంక చూసింది—"సరే! నేను రెండు నాల్కల మనిషిని. ఒప్పుకొంటాను. కానీ ప్రదీప్. అతను జీవితంలో ఇంతవరకూ ఏ నేరం చేసి ఎరుగడు. కావాలంటే అతణ్ని గురించి ఎక్కడైనా విచారించు. దురదృష్టవశాత్తూ అతడు పరిస్థితులకు బానిసై ఈ విష వలయంలో ఇరుక్కున్నాడు. ఇంక సత్యం సంగతంటావా? అతని ప్రవర్తన సరైనది కాదనడానికి నా దగ్గర ఎన్నో సాక్ష్యాలున్నాయి. ఆధారాలైతే లేవుగానీ అతన్ని హత్య చేయడానికి చాలామందికి కారణాలున్నాయి. చెప్పమంటావా?" అంది.

"సరే—ఇంక నీ రెండు నాల్కల్ని సత్యం గురించి ఉపయోగిస్తావా?" అన్నాను.

అరుణ కళ్ళు చెమ్మగిల్లాయి—"నువ్వేమైనా అను. సత్యం గురించి నా దగ్గర ఋజువులున్నాయి. అతను నీ స్నేహితుడే. కానీ అతడి జీవితం నీవంటిదికాదు—"

"ప్లీజ్ నీ మాటలు నేను నమ్మను. అవసరాన్నిబట్టి ఎటువంటి అబద్ధాలైనా చెప్పగలవు నువ్వు...."

అరుణ నా వంక దీనంగా చూసి—"ప్రదీప్ గురించి నీకు నేను గతంలో చెప్పింది అబద్ధం. అతను చాలా

మంచివాడు. బిజినెస్‌కు పనికిరాడని ఇంట్లో వ్యథ చెందుతూంటారు. తొందరగా కరిగిపోయే మన సత్యం అతడిది. సత్యం తన్ను కలుసుకోగానే నా దగ్గర కొచ్చాడు నిజానిజాలు తేల్చుకుందుకు. అతను నన్ను బలవంతంగా పెళ్ళి చేసుకొందుకు సిద్ధపడిలేడు. నేనెవర్ని ప్రేమిస్తే వాళ్ళతోనే నా పెళ్ళి జరుగుతుంది—" అంది.

"అయితే?"

"నువ్వు సత్యంతో ఆడినట్లే నేనూ ఒక నాటకం ఆడాను. నిజానికి నేను నిన్ను ప్రేమించలేదు—"

ఉలిక్కిపడి — "నాతో నువ్వు నాటకమాడేవా?" అన్నాను.

"అవును. నువ్వు నా కోసం ఏమైనా చేయాలనుకొనే పక్షంలో నాకా అర్హత లేదు. చిన్నప్పట్నించీ ప్రదీపూ నేనూ కలిసి మెలిసి వున్నాం. ఒకరిని విడిచి ఒకరం వుండలేం. ప్రదీప్‌ని కాక మరొకర్ని పెళ్ళిచేసుకోవడం కూడా ఊహించుకోలేను నేను.

అయితే మా నాన్నగారి తాలూకు ముఖ్యమైన పని ఒకటి మీ ఆఫీసులో జరగవలసివుంది. ఆయన ఇంట్లో అంటూండేవారు. కూడా ఆడవాళ్ళను తీసుకొని వెడితే పనులై పోతాయని. అలాగనడంలో ఆయన ఉద్దేశ్యం వేరు. కానీ నేను సరదాగా చిన్న ప్రయోగం చేశాను. ఆ సీట్లో కూర్చున్న నీతో ప్రేమనటిస్తే నాన్నగారి పనులౌతాయా అవవా అని నాకై నేను నాన్నగారికి చెప్పకుండా పరీక్షించాలనుకున్నాను. ఒక విధంగా ఇది నా అందానికీ, ఆకర్షణకూ కూడా పరీక్ష.

నీతో ప్రేమ నాటకం ప్రారంభించాను. నా మీద ఆకర్షణతో మీ ఆఫీసులో నాన్నగారికి జరగవలసిన

పనులన్నీ అయిపోతూండేవి. నాకెంతో ఆనందంగా, గర్వంగా వుంటూండేది. అయితే నాటకం శృతిమించి రాగాన పడుతున్నదని నాకు తోచగానే బాబును రంగం లోకి తీసుకువచ్చాను.

పాపం, అతను చాలా మంచివాడు. ఏమీ తెలియదు. అతడి గురించి నేను కల్పించి ఏవేవో చెప్పి నిన్ను బెదిరించాలనుకొన్నాను. అయితే కథ అడ్డం తిరిగింది. నువ్వు బెదిరిపోయి ఊరుకొంటావని నే నాశిస్తే—నువ్వు నామీద ప్రేమతో మరో నాటకం ఆరంభించావు. సత్యాన్ని రంగంలోకి దింపావు. అతనిలా రంగంలోకి దిగగానే చచ్చిపోయాడు. ఎవరో నీకూ నాకూ తెలిసినవారే రెండు నాటకాల్నీ చక్కగా ఉపయోగించుకొన్నారు. ఇదీ నిజం!

నీకు నామీద కోపం వుండొచ్చు. అందుగురించి ఏ పాపం ఎరుగని ప్రదీప్‌ని శిక్షించకు. ప్రదీప్‌కు శిక్ష పడితే మన వివాహం జరుగుతుందని ఆశపడకు. అది కలలో మాట! ప్రదీప్‌ని అన్యాయంగా జైలుపాలు చేసినవాడితో నేను కాపురం చేయలేను. ప్రదీప్ ఇచ్చే పాతికవేలూ తీసుకొని అతన్ని వదిలిపెట్టు—" అంది అరుణ.

శరీరంలో రక్తం మరగడమంటే ఏమిటో అంతకాలం నిజంగా నాకు తెలియదు. ఈ అరుణ ఎంత నాటక మాడింది? ఇప్పుడంతా ఎంత తాపీగా బయటపెడు తోంది. నేను మనిషి ననుకొందా — ఆట బొమ్మ ననుకొందా?

"ఈ సమయంలో నీ రంగు బయట పెట్టావు. చాలా సంతోషం. అయితే నీ రంగు బయటపడినాక ఖాడ్గా

నేను నీ మాట వింటానని ఎలాగనుకున్నావ్? నేనిప్పుడు ప్రదీప్‌తో బాటు నిన్ను కూడా అసహ్యించుకుంటున్నాను—" అన్నాను.

"నన్నసహ్యించుకో. ఈ నిజాన్ని నీకు చెప్పాలనుకో లేదు. కానీ గత్యంతరం లేకపోయింది. ప్రదీప్ అమాయకత్వం ఋజువు చేయాలంటే ఇది చెప్పక తప్పలేదు. నేనాడిన ఓ చిన్న అబద్ధం—నాకు ప్రియమైన బావ మీద ఇలాంటి ప్రభావం చూపిస్తుందని నేను కలలో కూడా అనుకోలేదు—" అంది అరుణ.

అప్పుడు నాకో అనుమానం వచ్చింది. అరుణ నన్ను ప్రేమించింది అబద్ధం కాదు. కానీ ఆమె తన బావను కూడా ప్రేమించింది. ఆ ప్రేమ అభిమానంతో కూడుకున్నది. నా మీద ప్రేమ ఆకర్షణతో కూడుకున్నది. బావను చూస్తూ చూస్తూ జైలుకు పోనివ్వలేక ఆమె మా ప్రేమ నాటకమంటున్నది. ఆ విధంగా అయినా ప్రదీప్‌ని రక్షించాలనుకుంటున్నది.

"అరుణా! నీ బావ యిచ్చే పాతికవేలూ పోలీసులకివ్వమను. ఉపయోగిస్తుంది. నువ్వు నా ప్రేమను భగ్నం చేసే మాటలు చెప్పావు. నేనూ నీ ప్రేమను భగ్నం చేస్తాను. అదీకాక సత్యాన్నింకెవరూ చంపే అవకాశం లేదు. అతనికీ నాకూ తప్ప మా నాటకం గురించి మూడో కంటివాడికి తెలియదు—...." అన్నాను.

అరుణ చటుక్కున వంగి నా పాదాలు స్పృశించింది. "నీ పాదాలంటి అర్థిస్తున్నాను. ప్రదీప్‌ని రక్షించు. అతను అమాయకుడు. నువ్వేం కోరినా యిస్తాను. డబ్బు నేను కూడా తీసుకువచ్చాను. అది తీసుకో. అది నీకు ప్రతిఫలంగా ఇవ్వడంలేదు. మా పాప పరిహారంగా

ఇస్తున్నాననుకో—" అంది.

నేను తెల్లబోయి—"అరుణా! ఏమిటిది?" అన్నాను.

అరుణ ఏడుస్తోంది. నేనా దృశ్యం చూడలేక పోయాను. నేను నాదనుకొన్న అరుణ నిజంగా నాతో నాటకమాడిందో లేదో తెలియదు. కానీ ఈ క్షణంలో కాళ్ళు పట్టుకొని ఆరిస్తోంది. నా మనసిది భరించలేక పోయింది. నాలో ఆమెపట్ల వున్న పగ, కోపం, ద్వేషం అన్నీ పోయాయి. మనసు ప్రశాంతంగా అయిపోయింది. ఆమెను చటుక్కున భుజాలు పట్టుకొని లేవనెత్తాను. శాంతంగా ఆమె కళ్ళలోకి చూసి—"నేను దుర్మార్గుణ్ని కాదు. ప్రదీప్‌కి ఏమీ జరగదు. మీ వివాహానికి నేను తప్పక వస్తాను—" అన్నాను.

"థాంక్స్—విశ్వం-" అని అరుణ కళ్ళు తుడుచుకొని వెళ్ళిపోయింది.

అప్పుడు చూశాను నేను. బల్లమీద చిన్న సంచీ వుంది. ఆ సంచిలో పాతికవేల రూపాయలున్నాయి. "సత్యం—నిన్ను నా ప్రేమ పేరు చెప్పి బలి తీసుకున్నాను. ఇప్పుడు నీ ఆత్మకు శాంతి లేకుండా చేస్తున్నాను—" అనుకొన్నాను.

## 10

నేను సరిగ్గా ఆఫీసుకు బయల్దేరబోతూండగా ఎవరో యింటి తలుపు తట్టారు. నేనే తలుపు తీసి ఆశ్చర్య పోయాను.

ఎదురుగా పోలీస్ ఇన్‌స్పెక్టర్ వున్నాడు. ఆయన నాకు తెలుసు. సత్యం కేసు పరిశోధిస్తున్నాడు. నన్ను చూస్తూనే ఆయన చెయ్యి జాపి — "మిస్టర్ విశ్వం! నేను తాళంకోసం వచ్చాను—" అన్నాడు.

ఉలిక్కిపడ్డాను—"ఏమన్నారు?"

"నీకింక భయంలేదు. నేనే స్వయంగా వచ్చాను. నీకు అవసరమైన పోలీసు రక్షణ ఏర్పాటు చేశాను. జరిగిందంతా మీ మిత్రుడు సోమసుందరం చెప్పాడు—" అన్నాడాయన.

సోమసుందరం ఉదయం నాకంటే ముందు లేచివెళ్ళిపోయి చేసిన పని ఇదన్నమాట! ఇప్పుడు నేనేం చేయాలి? ఏ ఆధారం కోసం అరుణ నా కాళ్ళమీద పడిందో ఆ ఆధారాన్నిప్పుడు పోలీసులకిచ్చేయాలా? ఇవ్వకపోతే నేనిప్పుడు చిక్కులో పడతాను. అరుణకు ఇచ్చినమాట తప్పాలి.

అరుణ మాత్రం నాతో ఎన్ని అబద్ధాలు చెప్పలేదు? అవసరమైతే ఆ పాతికవేలూ వెనక్కి ఇచ్చేస్తాను.... ఇలా నిర్ణయించుకొని లాకర్ తాళం తెచ్చి ఇన్స్పెక్టర్‌కి ఇచ్చాను.

"మీరు కూడా నాతో రావలసివుంది—" అన్నాడు ఇన్స్పెక్టర్.

"ఎందుకు?"

"మీ వద్ద మొత్తం జరిగిందంతా వాఙ్మూలం తీసుకోవాలి—" అన్నాడు ఇన్స్పెక్టర్.

ఇప్పుడు నాకంత సంతోషంగాలేదు. ఇన్స్పెక్టర్‌తో బయల్దేరాను.

ఇద్దరం బ్యాంకుకు వెళ్ళాం. ఇన్స్పెక్టర్ వివరంగా బ్యాంకు ఏజంట్‌కు చెప్పాడు. ఆయన లాకర్ తీయడానికి వెడుతూంటే—"ప్రదీప్! నీ పని అయిపోయింది" అనుకొన్నాను.

అయిదు నిముషాల్లో ఇన్‌స్పెక్టర్ వెనక్కి వచ్చాడు.

ఆయన చేతిలో ఓ సీల్డు కవరు వుంది. నా ముందే ఆయన దాన్ని ఓపెన్ చేశాడు. అందులోంచి ఓ కాగితం తీసి చదివి నాకు అందించాడు. చదివి ఆశ్చర్యపడ్డాను.

వివిధ బ్యాంకుల్లో తనకున్న అకౌంట్స్‌లోని డబ్బంతా నాకు చెందాలని రాశాడు సత్యం. అది చదివి నేను తెల్ల బోయాను. సత్యానికి బ్యాంకు అకౌంట్లేమిటి? ఆ డబ్బు నాకివ్వడమేమిటి?

ఈలోగా ఇన్స్‌పెక్టర్ కవర్లోంచి ఇంకో కాగితంతీసి చదివాడు. ఆయన కళ్ళు ఆశ్చర్యంతో కాబోలు చాలా పెద్దవయ్యాయి. అది చదివి ఆయన నా కిచ్చాడు.

"నాకు జీవితంలో థ్రిల్స్ అంటే యిష్టం. ఈ అభిలాష ఎంత తీవ్రమైనదంటే నన్ను ఈ కోరికే ఓ స్మగ్లర్ చేతుల్లో ఇరికించింది. మొదట థ్రిల్లింగ్‌గా ఫీలయినా తర్వాత అందులో దేశద్రోహమున్నదని నాకు తోచింది. ఎప్పుడైతే నేనిది గ్రహించానో మరి భరించ లేకపోయాను. అయితే ఓసారి తలదూర్చాక ఇలాంటి వ్యవహారాల్లోంచి బయటపడడం చాలా కష్టం.

ఆ స్మగ్లర్ ముఠాను పట్టించి దేశానికి సేవచేయడం కూడా మరో థ్రిల్లింగ్ అనుభవమవుతుందని భావించి వెళ్ళినపుడల్లా వివరాలన్నీ నోట్ చేసుకొంటూ వచ్చాను. అయితే ఈలోగా నేను పూర్తిగా స్మగ్లర్ గుప్పిట్లోకి వెళ్ళిపోయాను. ఓసారి నేను చెప్పేశాను. ఇంకమీదట నేనిందులో కొనసాగలేనని. అందుకు బాస్ ఒప్పుకో లేదు. నా సామర్థ్యం తనకు వినియోగపడి తీరాలన్నాడు. తనమాట విననిపక్షంలో నాకు మరణం తప్పదన్నాడు.

నేను ఇంకా ఆలోచనల్లో వుండగానే విశ్వం నా దగ్గరకు వచ్చి తన ప్రేమ కథ చెప్పాడు. వెంటనే

ఆ అవకాశం వుపయోగించుకోవా లనుకొన్నాను. బాస్‌ను ఎదురు తిరగాలనుకొన్నాను. నేను నా గురించి ఎవరికీ అనుమానం కలగని విధంగా ప్రాణాలను తెగించ వచ్చు. బాస్ వివరాలన్నీ రాసి ఈ సీల్డు కవర్లో పెడు తున్నాను.

నేను బాస్‌కి ఎదురుతిరిగి బ్రతకగలిగానా—బాధ లేదు. లేదా ఓ భయంకర స్మగ్లర్‌ని దేశానికి పట్టి చ్చానన్న తృప్తితో చచ్చిపోతాను. విశ్వం చెప్పిన ప్రేమ నాటకం నన్నిందుకు ప్రోద్బలపరుస్తోంది. స్మగ్లర్ నించి బైటపడే వుపాయమిదే! చచ్చినా బ్రతికినా ఓ ప్రయోజనం సాధించినవాణ్నవుతాను. ఎట్టి పరిస్థితుల్లోనూ నా గత చరిత్ర నేను బ్రతికుండగా బయటపడదు-...."

ఆ ఉత్తరంలో బాస్ వివరాలున్నాయి. ఊళ్ళో పెద్ద మనిషిగా చెలామణి అవుతున్నాడాయన. ఆయనకున్న రహస్య స్థావరాలు, కార్యకలాపాలు—మొత్తం అన్నీ వివరంగా రాయబడ్డాయక్కడ. ఇన్స్‌పెక్టర్ నా చేతులు పట్టుకొని ఊపేస్తూ—"మిస్టర్ విశ్వం! ఇలాంటి బంగారు అవకాశం ఏ ఇన్స్‌పెక్టర్‌కో కానీ రాదు. ఈ కేసులో నేను సాధించిన విజయం నా కీర్తిని తారా మండలానికి పంపిస్తుంది. నా కెంత సంతోషంగా వుందో చెప్పలేను...." అంటున్నాడు.

నే నాయన దగ్గర సెలవుతీసుకొన్నాను.

సత్యం ఎవరు? అతను నాకేమవుతాడు?

అతను పాప పంకిలంలో ఇరుక్కుపోయాడు. నా ప్రేమ నాటకం అతడికందులోంచి బైటపడే అవకాశ మిచ్చింది. బహుశా నేను చెప్పిన రాత్రే అతను బాస్‌ను కలుసుకొని వుంటాడు. తానీ పాపపంకిలలోంచి బయట

పడాలనుకొని కచ్చితంగా చెప్పివుంటాడు. బాస్ అతడి చావుకు వెంటనే ముహూర్తం పెట్టివుంటాడు. థ్రిల్స్ కావాలనుకొన్న అతని జీవితం థ్రిల్లింగ్‌గానే ముగిసింది.

అంతేకాదు. అతడు నన్నూ థ్రిల్ చేశాడు. సత్యం ఆస్తి తక్కువదేమీ కాదు. వివిధ బ్యాంకుల్లో అతడి పేరున వున్న రొక్కం మొత్తం అయిదు లక్షలు దాటింది. ఈ థ్రిల్ నాకు కలిగించాల్సినంత ఆనందం కలిగించలేదు.

మొత్తం స్మగ్లర్స్ ముఠాను రౌండ్ చేసేవరకూ విషయం రహస్యంగా ఉంచాలని ఇన్స్‌పెక్టర్ చెప్పాడు. అందుకని నేను అసలు కథ ఎవ్వరికీ ఇంకా చెప్పలేదు. అయితే అరుణని కలుసుకొని—"ఈ హత్యకూ ప్రదీప్‌కీ ఏ విధమైన సంబంధమూ లేదని ధృవపడింది. నా దగ్గరున్న ఆధారాలు ప్రదీప్‌ని నేరస్థుణ్ని చేయవు. నువ్వు నిశ్చింతగా వుండవచ్చు. నిజానికి నీవిచ్చిన పాతిక వేలూ నేను అన్యాయంగా తీసుకొన్నట్లే అవుతుంది—" అన్నాను.

"అయితే తిరిగి ఇచ్చేస్తావా?"

"ఇవ్వను. ఆడపిల్లలు ప్రేమనాటకాలాడితే పెళ్ళికాక పోయినా కట్నాలిచ్చుకోవలసి వస్తుందని గుర్తుంచుకో!" అన్నాను.

అరుణ నావైపు ఆశ్చర్యంగా చూస్తూంటే నేనక్కణ్నించి వచ్చేశాను.

—:ఐ పో యిం ది:—

# నగల దోపిడి

## ఇమంది రామారావు

"వందే శంభు ఉమాపతిం.

సురగురుం దేవం. వందే జగత్కారణం .... పార్వతీ! పార్వతీ కాఫీ అయిందా!" నమశ్శివాయ పంతులుగారు మళ్ళీ శ్లోకం పూర్తి చేయసాగాడు.

"పన్నగ భూషణం ముకుందం ప్రియం...." అంతే. పార్వతి మొహంలోకి చూశాక మరిక పెదవి కదల్లేదు. పార్వతి కళ్ళల్లో నీరు గిర్రున తిరిగింది. రివ్వుమంటూ వంట గదిలోకి పారిపోయింది పార్వతి.

నమశ్శివాయ పంతులుగారు ఆ ఊరికి దేవుడితో సమానం. శివాలయం కట్టినప్పటినుండీ అర్చన చేయడం. కేవలం ఆ పరమశివుని ఆరాధన కోసమే తాను పుట్టినట్టు భావించి, ఆ శివుని సేవలోనే తాదాత్మ్యం చెందాలన్న విశ్వాసం నమశ్శివాయది.

నమశ్శివాయకు అయిదుగురు పిల్లలు. నలుగురు ఆడ, ఒక మగ. నలుగురూ పెద్దవాళ్ళే. పెద్ద పిల్లలు యిద్దరు

శైలజ, రూపజ పెళ్ళీడుకొచ్చారు. మూడో పిల్ల ఈశ్వరి పుష్పవతి కావడానికి సిద్ధంగా వుంది. నాలుగోది భ్రమరాంబ అయిదో క్లాసు చదువుతోంది. చంటాడు శివయ్య.

పెద్దపిల్లలు ముగ్గురూ మంచం మీదనుండి యింకా లేవలేదు. మొండికేసి కాదు, ఒంట్లో శక్తిలేక. లేస్తే తూలిపడిపోతారేమో భయంచేత—అన్నం తిని నాలు గయిదు రోజులవుతోంది. శివయ్యకైనా అటుకుల ప్రసాదం పెట్టి యిది రెండో రోజు. నమశ్శివాయకి అన్నం లేకపోయినా పరవాలేదు. కాఫీ ఉదయం తాగితే సాయంత్రంవరకూ గడిపేయగలడు.

అదేమిటో మరి 'శివాలయం' కళ్ళచూస్తే నమశ్శివాయ పంతులుగారు వయసు మరిచిపోయి 'ఓం నమశ్శివాయః' శబ్దంచేస్తూ వెయ్యి మెట్లూ యిట్టే ఎక్కిపోతాడు. గర్భ గుడిలో ప్రవేశించాక భక్తుల్ని చూసిన ఆనందంతో ఈ భౌతిక ప్రపంచాన్ని మరిచిపోతాడు. అలాగే గడుపు కొస్తున్నాడు యిన్నాళ్ళూ.

"పార్వతీ!" తలుపు చాటున సిగ్గుపడుతూ నిలబడ్డాడు శివయ్య.

"ఏవండీ. ఈ రోజు మీరు భత్యం తీసుకురాకపోతే పిల్లలు బలవంతంగా చచ్చిపోతారు. చంటాడికి మీరు అటుకులు పెట్టి ఎన్నాళ్ళయింది. వాడు మీరున్నారని, తిడతారని భయంతో ఊపిరి బిగపెట్టి బిక్కుబిక్కు మంటున్నాడుగాని, మీరిలా గుమ్మం దాటాక చూడండి వాడి ప్రతాపం. నా మీద విరుచుకుపడతాడు. పాలవాడు నిర్మోహమాటంగా చెప్పేశాడు — చచ్చి గింజుకున్నా మరిక పాత బాకీలన్నీ చెల్లించేవరకూ పాలుపోసేది

లేదుట. ఈ సంసారంలో ఎలా చచ్చేది చెప్పండి" అను కోకుండా కోపాన్ని తమాయించుకోలేకపోయింది.

"పార్వతీ! యివన్నీ ఆ పరమశివుడికి తెలియదనా.... హూం....ఎందుకో పరీక్షలు పెడుతున్నాడు. పెట్టనీ! నాకు అరవై దగ్గర పడుతుంది. యింతకాలం సిగ్గుకు రాలేదూ .... అయినా భక్తులకు పరీక్షలు తప్పవు పార్వతీ!" ఆప్యాయంగా ఊరడిస్తూ ఆమె మొహంలోకి చూశాడు.

పార్వతి తల దించుకుంది.

ఎక్కువసేపు ఆమె మొహం చూడలేకపోయాడు. "నమశ్శివాయ" అంటూ శఠగోపురం, పళ్లెం, తీర్థం, పూలసజ్జ పట్టుకొని శివాలయానికి బయలుదేరాడు.

పార్వతి భర్త కేసి ఆట్టే చూడలేకపోయింది. కళ్ళ నిండా దుఃఖం పులుముకుంది. కాళ్ళల్లో తలదాచుకొని భోరున ఏడ్చింది.

## 2

కుగివలస చిన్న పల్లెటూరు.

ఉదయం తొమ్మిది గంటలవుతుంది.

ఆలయ ప్రాంగణంలోనే చిన్న కుటీరంలాంటిది ఊరి పెద్దలంతా నిర్మించారు. అందులో యోగానందస్వామీజీ వుంటున్నారు. నలభై సంవత్సరాలుగా కఠిన బ్రహ్మ చర్యం పాటిస్తూ భక్తులకు జ్ఞానబోధనతో కాలం గడుపుతున్న యోగి—తను మాత్రం తెల్లవారుజామున నాలుగ్గంటలకే లేచి శుచిగా స్నానపానాదులు ముగించి శివనామస్మరణతో కాలక్షేపం చేస్తూంటారు.

ఊళ్ళో చిన్నపిల్లలందరూ ప్రసాదం కోసం ఎనిమిది గంటలకు గుమిగూడుతారు. స్వామీజీ అటుకుల ప్రసాదం

పంచుతున్నారు.

నమశ్శివాయ పంతులుగారు స్వామీజీని చూడగానే "ఓం నమశ్శివాయ" అని పలుకరించాడు. స్వామీజీ చిరునవ్వుతో ప్రతి నమస్కారం చేశాడు.

నమశ్శివాయ పంతులు శివునికి అభిషేకం ప్రారంభించి సహస్ర నామాలతో పూజచేయడంలో నిమగ్నమయి పోయాడు. కొంచెం తులసి తీర్థం తీసుకొని నేసరికి ఎక్కడ లేని శక్తి వచ్చింది. పార్వతిదేవి గుడి ప్రక్కనేవుంది. తాళాలు తీసుకొని వెళ్ళాడు.

పార్వతిదేవి గర్భగుడిలోకి ప్రవేశించినపుడు నమశ్శివాయ పంతులుకి భయమేస్తుంది. అమ్మవారికి తాళిబొట్టు, కళ్ళు, మెడలో కట్టలకాసుల పేరు, వడ్డాణం, కాళ్ళకు బంగారపు మట్టెలు, సుమారు నాలు గయిదు లక్షలు విలువచేసే నగలు విజయనగరం మహా రాజావారు సమర్పించినవి గత యాభై సంవత్సరాలుగా కాపాడుకొంటూ వస్తున్నాడు.

పార్వతీదేవిని చూడగానే కళ్ళు జిగ్గుమన్నై. తొందరగా పూజ ముగించాడు. తలుపులు మూసి తాళం వేయబోతుండగా యోగానంద స్వామీజీ వచ్చేశాడు.

"నమశ్శివాయగారూ! ఒక్కక్షణం. నేను ఇక్కడికి వచ్చిన రెండు సంవత్సలనుండి గమనిస్తున్నాను. మీరు శివాలయంలో గడిపినంత ప్రశాంతంగా పార్వతీదేవి ఆలయంలో గడపలేరు ఎందుకని. ఆమెను చూస్తే మీకు భయమా? ఆ జగన్మాత అందం తనివితీరా చూడండి. జిగేల్‌మంటూ మెరిసే ఆ కళ్ళు, రవ్వల కెంపుల ముక్కు పుడక, నత్తు, బేసరీ, చెవులకు జుంకీలు, మెడలో చంద్ర హారం, కట్టలకాసుల పేరు, నడుంకి వడ్డాణం, కాళ్ళకు

బంగారపు మట్టెలు నిజంగా చూడ్డానికి రెండు కళ్ళు చాలడం లేదనుకోండి!" అంటూ నమస్కరించాడు.

నమశ్శివాయ పంతులు అందరిలాగే స్వామీజీని కూడా ఆశీర్వదించి, తీర్థం యిచ్చి తలుపులు మూశాడు.

## 3

పంతులుగారు "శివా!" అంటూ అరిచి....స్పృహ తప్పి పడిపోయాడు, పార్వతీదేవి గర్భగుడిలో.

పార్వతీదేవి నగలు మాయమయ్యాయి. ఒంటిమీద పట్టుచీరతో సైతం దోచుకుపోయారు ఎవరో—

భక్తులు పంతులుగారిని లేవనెత్తి మొహంమీద నీళ్ళు చల్లారు.

"నా తల్లి ... నగలు ... వడ్డాణం, కట్టలకాసుల పేరు, చంద్రహారం, జుంకీలు, మట్టెలు, నత్తు, బేసరి, అన్నీ మాయమైపోయాయి. పరమశివా! ఏవిటయ్యా ఈ పరీక్ష!" నెత్తిబాదుకొని భోరున ఏడవసాగాడు.

"ఏమయ్యింది పంతులుగారూ!"అంటూ హడావుడిగా వచ్చాడు యోగానంద స్వామిజీ. పార్వతీదేవి నగలు పోవడం చూసి క్షణం రెప్పార్చలేకపోయాడు. గర్భగుడిలోకి ప్రవేశించి అంతా గాలించాడు. ఒక 'పాడి' కూడా రాలకుండా జాగ్రత్తపడ్డారు దొంగలు.

"పంతులుగారూ! ఎలా సంభవించింది?" అని అడిగాడు.

"అంతా ఆ పరమేశ్వరుడికే తెలియాలి! పరమశివా! నీ అర్చనలో కొన్ని లక్షల పరీక్షలు పెట్టావు. నెగ్గుతాననే ఆత్మవిశ్వాసంతో అన్నిటినీ ఎదిరించాను. కాని ఈ ఒక్క పరీక్షనీ తట్టుకోలేనయ్యా!" అంటూ సింహ

ద్వారానికేసి తలబాదుకోసాగాడు. స్వామీజీ ఊర డించాడు.

క్షణాల్లో ఈ వార్త ఊరంతా గుప్పుమంది. దూర ప్రాంతాలనుండి జనం రాసాగారు. వేలకొద్దీ జనంతో— ఊరి ప్రముఖులతో—ధర్మకర్తతో శివాలయం కిటకిట లాడిపోయింది.

"అన్యాయం! ఘోరం! గుడికట్టి యాభయ్ సంవత్స రాలవుతుంది. యింతవరకూ యిలాంటి సంఘటన ఒక్కటీ జరగలేదు సరికదా కనీసం ఆలయ ప్రాంగణంలో పూలు కూడా దొంగిలించిన పాపాన ఏ ఒక్కరూ పోలేదు! ఈ ఊరికేదో మూడింది. అరిష్టం పట్టింది!" అన్నాడు ఆది నారాయణ.

ఆదినారాయణ, గున్నారావులు ఆ ఊరికి పెద్ద మనుషులు. ఇద్దరూ ఉత్తర దక్షిణ ధృవాలు. ఏ సమస్య పరిష్కరించాలన్నా వారికే వదిలేస్తారు.

ఆదినారాయణకి వయసు డబ్బయి సంవత్సరాలు దగ్గర పడుతున్నై. గున్నారావు మంచి వయసులో వున్నాడు. ఊరందరికంటె తెలివయినవాడు. యోగ్యుడు. ప్రపంచ జ్ఞానం తెలిసినవాడు. కనుక గున్నారావునీ, తల పండిన ముసలి తలకాయి కదా ఆదినారాయణని పెద్దమనుషులుగా నిర్ణయించారు. వేలాది జనం గున్నారావు ఈ సమస్యను ఎలా పరిష్కరిస్తాడోనని ఎంతో ఉత్సాహంతో ఎదురు చూడసాగారు.

"ఏమంటారు గున్నారావుగారూ!" అనడిగాడు సుబ్బయ్యశెట్టి.

"ఈ శివాలయం తాలూకూ తాళం చెవులు ఎవరి దగ్గర వున్నాయి!" గున్నారావు అడిగాడు.

"నా దగ్గరేవున్నాయండీ. అయితే .... యిందులో కొంచెం లిటిగేషనుంది. అదినుండీ రెండు తాళంచెవులు సెట్లులు మా యిద్దరి దగ్గరా వుండేవి. ఒకటి నా దగ్గరా ఒకటి మన నమశ్శివాయ పంతులుగారి దగ్గర వుండేవి. అయితే ఓ పది సంవత్సరాలు పోయిం తర్వాత పంతులు గారి తాళంచెవులు వాడటం మానేశారు. ఏమండీ ఎందుకు వాడలేదు అనడిగితే పోయాయండీ మీ తాళం చెవులు ఇవ్వండీ అన్నాడు — మనిషి నమ్మకస్తుడు. భక్తుడు. నమ్మాలనిపించింది. తాళం చెవులు ఇచ్చాను. సాయంత్రం ప్రతిరోజూ నాకే ఒప్పగించమని చెప్పేను. నేను చెప్పినట్లే గత నలభయ్ సంవత్సరాలుగా ఉదయం నా కిరాణా దుకాణానికి వచ్చి తాళం చెవులు తీసుకు వెళ్ళడం, సాయంత్రం ఇంటికి వెళ్ళేముందు ఒప్పగించడం చేసేవాడు. ఈ రోజు ఈ అఘాయిత్యం జరిగింది!" అంటూ గుండె బాదుకున్నాడు ధర్మకర్త.

"ఇదంతా బాగానే వుందయ్యా! నిన్న సాయంత్రం నమశ్శివాయ పంతులు ఇంటికి వెళ్ళేముందు తాళంచెవులు మీకిచ్చాడా లేదా?" నిలదీసి అడిగి చుట్ట వెలిగించాడు ఆదినారాయణ.

"ఇచ్చాడండి" సుబ్బయ్యశెట్టి అయోమయంగా చూశాడు.

"అంటే నిన్న సాయంత్రం తాళంచెవులు యిచ్చి ఈ రోజు ఉదయం మళ్ళీ మీ దగ్గర్నుండి తీసుకు వెళ్ళారు నమశ్శివాయ పంతులుగారు. గుడిలో పార్వతీ దేవి నగలు కనిపించలేదు. అంతేకదా — యిందులో పంతులుగారు నిర్దోషి. తాళంచెవులు ఎవరి దగ్గర వున్నాయో వారి గురించే ఆలోచించాలి" అన్నాడు

గున్నారావు.

సుబ్బయ్యశెట్టికి విషయం అర్థమయింది. గున్నారావు తనని అనుమానిస్తున్నాడు. ఆయన అనుమానించడం మొదలుపెడితే యిక యింతే సంగతులు అని తీర్మానించుకొన్నాడు.

"గున్నారావుగారు! మా అమ్మ తోడు. మా బాబు తోడు. మా తాత తోడు. మా యిలవేలుపు కన్యకా పరమేశ్వరి తోడు. మీ తోడు. నాకీ నగలు మాయమవ్వటం గురించి తెలీదు బాబోయ్!" అంటూ గొంతు చించుకొని ఏడ్చాడు.

గున్నారావుకి ఆదినారాయణకి ఒకరికొకరికి పడదు. ఒకరు ఫలానావార్ని సపోర్టు చేస్తున్నారని తెలిశాక మరొకరు రెండోపార్టీ కేసి తిరిగిపోతారు. వాదించుకుంటారు. బలాబలాలు తేల్చుకుంటారు. గున్నారావు సమశ్శివాయ పంతుల్ని సపోర్టు చేస్తున్నట్లు తెలిసిపోయింది ఆదినారాయణకి—

ఆదినారాయణ సుబ్బయ్యశెట్టి మొహంలోకి చూశాడు. అతి భయంకరంగా, దీనాదిదీనంగా వుంది. ఈ గండం గడిచి గట్టెక్కితే, ఈ వాదు తనమీద లేకుండా చేస్తే జీవితాంతం ఋణపడతాను. మీరేమడిగితే అది యిస్తాను — అన్నట్లు వున్నాయి శెట్టి చూపులు.

"అయ్యా! నువ్వడిగిన పోయింటు బాగానే వుంది. మరయితే కోవిల కట్టిన ఆ గదిలో రెండు సెట్లుల తాళంచెవులు మన పెదగాడు నర్సింహులు దగ్గర చేయించడం నాకు తెలుసును—అందులో వొకటి మన సుబ్బయ్యశెట్టికి యిచ్చాం. మరొకటి పంతులుగారికిచ్చాం. సుబ్బయ్యశెట్టి

దగ్గరున్న తాళంచెవి భద్రంగా వుంది. పంతులుగారి దగ్గర వుంచింది పోయింది అని ఆయన చెప్పినట్టు శెట్టిగారు చెప్తున్నారు. అంతేనా శెట్టిగారూ!" ధర్మకర్త మొహం చూశాడు.

"సత్య ప్రమాణంగా అంతే బాబూ!" అంటూ లెంపలు వేసుకొని ఏవో మంత్రాలు చదవసాగాడు. పెదవులు వేగంగా కదలసాగాయి.

"అయ్యా! గున్నారావు. మరి నువ్వంటే చిన్నోడివి. నీకొన్ని విషయాలు తెలుసు. మరికొన్ని తెలీవు. యాభయ్ సంవత్సరాలుగా పంతులుగార్ని నాకు తెలుసు. యెప్పుడూ మరి ఇలాంటి తప్పుడుపని చేయలేదు. 'వినాశకాలానికి విపరీత బుద్ధి' అంటారు. ఏమో. పంతులుగారిని అనుమానించడంలేదు. ఆయన దగ్గరున్న తాళం చెవులు పోయినట్టు గ్యారంటీ ఏవిటండీ" అందరి మొహాల్లోకి చూశాడు ఆదినారాయణ.

అందరూ డైలమాలో పడ్డారు. నమశ్శివాయ మొహంలోకి పరీక్షగా చూడసాగారు.

"అవునండోయ్. యిదీ పాయింటే!" అన్నాడు మరొక పెద్ద.

"మామూలు పాయింటు కాదండీ. చాలా గొప్ప పాయింటు. శెట్టిగారు నాకు తెలుసు. నాలుగయిదు లక్షలు విలువచేసే బంగారాన్ని ఆయన దగ్గర చాలా కాలం వుంచాను. రవ్వంత మోసం చేయలేదు. నా వరకూ ఆయన మీద ఎలాంటి అనుమానంలేదు. యిక నగలు ఎలా పోయాయన్నది నిర్ణయించవల్సింది వుంది. అయ్యా! గున్నారావూ....ఏం చేద్దాం!" అని అడిగాడు.

"పంతులుగారు. మీ దగ్గర తాళంచెవులు పోయి

ఎన్ని సంవత్సరాలు అవుతుంది?" గున్నారావు తాపీగానే అడిగాడు.

"నలభయ్ సంవత్సరాల క్రిందటిమాట!"

"అదే అపుడు ఎలా పోయాయి. దార్లోపోయాయా? ఎవరయినా దొంగిలించుకుపోయారా? తాళంచెవులు పోయినట్లు ఎప్పుడు తెలుసుకున్నారు?"

"అదీ! నాకు పెళ్ళయిన కొత్తలో బాబూ! వంట్లో అనారోగ్యంగా వుంది. ఆ రోజు శనివారం. కార్తిక సోమవారాలు నాలుగు వారాలూ గడిచిపోయాయి. కోవెలకి రద్దీ తగ్గింది. యింటికి వచ్చినప్పుడే ఒళ్ళు సలసల కాలిపోతుంది. తాళంచెవులు పార్వతికి ఇచ్చాను. తను అలవాటు ప్రకారం పూజగదిలో పెట్టింది. అంతవరకే నాకు తెలుసు. తర్వాత కన్ను తెరవకుండా వారం రోజులు మంచానపడ్డాను. మళ్ళీ శనివారం వచ్చింది. వంట్లో ఓపిక తెచ్చుకొని శివాలయానికి తయారయ్యి తాళంచెవులు కోసం పూజగదిలోకి వెళ్ళాను. గుండె జల్లుమంది. లేవు.

ఈ విషయం సవివరంగా ధర్మకర్తగారికి మనవి చేశాను. ఆ రోజు తిరిగి కోవెల్లో ప్రవేశించినపుడు ధర్మకర్తగారి స్వహస్తాల్తో తాళం తీశారు. నగలు భద్రంగా వున్నాయి.

అప్పటినుండీ ప్రతిసాయంత్రం వారికే ఒప్పగించి వెళు తున్నాను....యింతవరకూ 'పూచిక పుల్ల' కూడా దొంగి లించబడలేదు. ఈ పాపం నేను చేయలేదు అని మాత్రం చెప్పగలను! నిజానిజాలు ఆ సర్వేశ్వరుడికే తెలియాలి!" అన్నాడు గుండెమీద చేయివేసుకొని కను రెప్పలు మూస్తూ.

"చాలా విచిత్రంగా వుందే. శెట్టిగారి దగ్గర తాళం చెవులుండటం, ఉదయం పంతులుగారు వచ్చేసరికి తాళాలు వేసినవి వేసినట్లే వుండటం, గర్భగుడిలో చూసే నగలు మాయమవడం నిజంగా ఈశ్వరేచ్ఛ!" అన్నాడు స్వామీజీ.

భక్తులంతా తలలూపేరు అయోమయంగా.

"అవును స్వామిజీగారు. మీరు ఎంత కాలంగా వుంటున్నారు?" అనడిగాడు గున్నారావు.

"ఏది రెండు సంవత్సరాలుగా వుంటున్నాను ఈ కుటీరంలో."

"మిమ్మల్ని ఎవరు తీసుకొచ్చారు స్వామీ!"

"శెట్టిగారి ధర్మపత్ని!"

"అవును గున్నారావుగారు. నా భార్య కన్యకాపరమేశ్వరి గుడికి వెళితే స్వామిజీ 'మోక్ష మార్గం' గురించి అనర్గళంగా గంటసేపు ఉపన్యసించటం, భక్తులు మంత్రముగ్ధులయి వినడం చూసి భక్తి విశ్వాసంతో తీసుకొచ్చింది. స్వామివారి రాక మాకూ కూడా శుభసూచకమయింది. ఆలయానికి వొచ్చే జనానికి మంచి కాలక్షేపం అని అందరూ అంటున్నారు. అసలు వారి ఉపన్యాసం మీరు వినలేదా?" అనడిగాడు.

"స్వామిజీవారి వుపన్యాసం వినే వారి 'విశ్వరూపం' చూసే అదృష్టం నాకింతవరకూ కలగలేదు. చూడండి స్వామిగారూ! అమ్మవారి నగలు మీరు చూడటం తటస్థించిందా?" అనుమానంగా స్వామిజీ కళ్ళల్లోకి చూశాడు.

స్వామిజీ శెట్టిగారికేసి చూశాడు. శెట్టిగారు 'అపరాధం మన్నించండి' అన్నట్లు చూశాడు.

"చూశాను బాబూ! కాని, నాకు ఆ కుటీరంతో తప్ప మరో ప్రపంచంతో సంబంధంలేదు. యిది సత్యం!" అని

గట్టిగా చెప్పేడు.

"సరే లక్ష మాటలెందుకు! రాత్రి గుళ్ళో దోపిడీ జరుగుతుండగా, మీకు ఏవిధమైన శబ్దం వినిపించలేదా?" గున్నారావు గంభీరంగా అడిగాడు.

"లేదు. ముందే చెప్పేనుకదా. నాకీ ప్రపంచంతో సంబంధంలేదని-నేనా జగన్మాత ధ్యానంలో కూర్చుంటే నాకీ బాహ్య ప్రపంచం వినిపించదు" అన్నాడు కళ్ళు మూసుకొని.

"సరే—మీరు దైవ స్వరూపులు కావచ్చు—అయినా మీ కుటీరం సోదా చేయించాలి. అలాగే నమశ్శివాయ పంతులుగారి యిల్లుకూడా సోదాచేయించాలి. ధర్మకర్త గారింటికి మేమే స్వయంగా వెళ్ళి చూస్తాం. పూర్వాపరాలు బాగా ఆలోచించిగాని ఒక నిర్ణయానికి రాలేను. యిందులో మొదటి ముద్దాయి మీరే....మీరెంత ధ్యాన ముద్రలో వున్నా కోవెల్లో జరిగే యింత దోపిడీ మీకు తెలియదంటే నేను నమ్మను. నిజం చెప్పాలి. మీరు చెప్పకపోయినా తెలుసుకోగలను! ఇకపోతే రెండవ అనుమానితుడు శెట్టిగారు. తాళంచెవులు ప్రస్తుతానికి ఆయన దగ్గరే వున్నై. యిది యీనాటిది కాదు నలభై ఏళ్ళుగా వున్నమాట. నిజమని మీరంతా ఒప్పుకున్నారు. రాత్రికి రాత్రి నగలు మాయం చేయవలసిన అవసరం ఎవరికుంటుంది? శెట్టిగారు ఆశపడి ఈ ప్రయత్నం చేయొచ్చు—మూడవ ముద్దాయి నమశ్శివాయ పంతులు. ఆయన దగ్గర తాళంచెవులు పోయాయన్నది నిజంకాదని ఆదినారాయణగారు,తదితరులు ఆరోపించడంవలన. ఏమో ఇది కూడా నిజం కావచ్చు, నిజం కాకపోవచ్చు. ముందు ఈ కేసు పరిశోధన జరగాలిగా! నాలుగయిదు లక్షల

రూపాయల విలువైన నగలు పోయాయంటే ఊరికే అరిష్టం! దీన్ని పరిష్కరించి తీరాలి. మీరంతా సహకరించాలి!" అని అందరికేసి చూశాడు.

అందరూ ఏకగ్రీవంగా ఒప్పుకున్నారు.

చీకటిపడింది. అందరూ అక్కడ్నుంచి కదిలారు.

## 4

"ఇదీ జరిగిన కథ" అంటూ సవివరంగా కంప్లయింట్ ఇచ్చాడు గున్నారావు.

ఇన్స్పెక్టర్ మోహన్ రిపోర్టు ఒకసారి చూసుకున్నాడు. గున్నారావు చెప్పిన వివరాలన్నీ నోట్ చేసుకున్నాడు. మోహన్ గున్నారావు మంచి ఫ్రెండ్స్.

మోహన్ కింగ్ సైజు గోల్డ్‌ఫ్లాక్ గున్నారావుకి ఆఫర్ చేశాడు. ఇద్దరూ వెలిగించారు. ఆలోచనల్లో పడ్డారు.

"మోహన్‌గారూ! ఈ కేసులో మీరు ఎవర్ని అనుమానిస్తున్నారు?" ఆసక్తిగా అడిగాడు గున్నారావు రింగులు వదులుతూ.

"మీరెవర్ని అనుమానిస్తున్నారో ముందు చెప్పండి!" ఎదురు ప్రశ్న వేశాడు మోహన్.

"నాకెందుకో ఆ యోగానంద స్వామిజీ మీద అనుమానముందండీ!"

"ఆయన దగ్గర తాళాలు లేవుగా!"

"లేవు. కాని స్వామిజీ ఆ ముందు రోజే అమ్మవారి నగల్ని పట్టిపట్టి చూసినట్లు పంతులుగారు చెప్పేరు. ఏదయినా మారు తాళాలతో తీయొచ్చుగా!"

"నో నో....అంత తేలిగ్గా వచ్చేవికావు. అయినా ఆ తాళం గురించి నాకు తెలుసు. మొన్న సింహాచలంలో

నగల దోపిడీ జరిగిన తరువాత డి.ఐ.జి.గారు అన్ని టెంపిల్స్‌నీ చెక్ చేయిస్తున్నారు. ఆ సందర్భంగా సంగివలస గుడినీ చెక్ చేశాం. చాలా గట్టి తాళంకప్ప లుండీ అవి. బద్దలుకొట్టడానికైనా ఒకరోజు టైము పడుతుంది. అందులోనూ ఒరిజినల్ తాళపుచెవులు వుంటేనే గాని నగలు తీయడం అసాధ్యం!" అన్నాడు మోహన్ ఆలోచిస్తూ.

అయిదు నిముషాలు యిద్దరిమధ్య నిశ్శబ్దం రాజ్యం చేసింది.

"ఒన్ థింగ్ గున్నారావుగారూ! నగలదోపిడీ గురించి మనం అట్టే పట్టించుకోనట్టు నటిద్దాం. నేను ధర్మకర్త గారిని, మీరు స్వామిజీని వెంటాడుదాం. ఇద్దరిలో ఎవరో ఒకరు తప్పకుండా ముద్దాయిలౌతారని నా నమ్మకం. మనం ఒత్తిడి తీసుకొచ్చినట్లయితే సుబ్బయ్య శెట్టిగాని, స్వామిజీగాని మరిన్ని పథకాలువేసి, అసలు నగలు మనకు దొరికే అవకాశం లేకుండా శాశ్వతంగా భూస్థాపితం చేయించొచ్చు."

"వారిని వెంటాడడం ఎలా?" గున్నారావు అనుమానం.

"అవసరంలేదు గున్నారావుగారూ! మీరు తటస్థంగా వుండండి. వారే మన దగ్గరికి వస్తారు. వచ్చినపుడు జాగ్రత్తగా టేకిల్ చేద్దాం. బట్ ఒన్ థింగ్ స్వామీజీ మీదగాని, శెట్టిగారిమీదగాని అనుమానం వున్నట్లు మనం బయటపడకూడదు" అన్నాడు మోహాన్.

"ఓహ్....ష్యూర్ ష్యూర్!" అంటూ హుందాగా స్టేషన్‌లోనుండి బయటికి నడిచాడు గున్నారావు.

"ఓ, ఆంజనేయస్వామి!"

"ఓ, ఆంజనేయస్వామీ!"

"పార్వతీదేవి నగలు పోయాయి!"

"పార్వతీదేవి నగలు పోయాయి!"

"అవి చూపించు తండ్రీ—ఎవరు తీశారో. ఇందులో నాకు కనిపించేలా చేయ్ తండ్రీ. నీకు కొబ్బరికాయ పెడతాను!" అంటూ చెప్పేడు భూతవైద్యుడు.

చుట్టూ ఆదినారాయణ, సుబ్బయ్యశెట్టి, స్వామిజీ, పంతులుగారు, మరికొద్ది మిత్రులూ వున్నారు. చిన్న అబ్బాయి మాత్రం భూతవైద్యుడి అరచేతిని పట్టిపట్టి చూడసాగాడు. అరచేతిలో నల్లటి కాటుక వుంది. అందులో నీడలా కనిపిస్తుంది.

"ఆ చూడు బాబూ! ఏం కనిపిస్తుంది ఇందులో...." అనడిగాడు భూతవైద్యుడు. అతడి దేహం చాలా విచిత్రంగా వుంది. వొంటినిండా విభూతి పులుముకున్నాడు. కళ్ళు చింతనిప్పుల్లా వెలిగిపోతున్నాయి. గారపళ్ళు.... గుండు గీయించుకుని, మొహంమీదకి జిడ్డుకారేలా నూనె రాసుకున్నాడు. చూడ్డానికి చాలా అసహ్యంగా వున్నాడు.

"ఏం కనిపించడంలేదు!"అని పెదవ్విరిచాడు కుర్రాడు.

"ఆ ఏం కనిపించడంలేదూ—సరిగ్గా చూడు పంతులుగారు కనిపిస్తున్నారా .... నేను కనిపిస్తున్నానా?" అనడిగాడు సుబ్బయ్యశెట్టి.

"పోనీ నేను కనిపిస్తున్నానా చెప్పు బాబూ!" సౌమ్యంగా అడిగాడు స్వామిజీ.

"ముగ్గురూ కనిపిస్తున్నారు!" అన్నాడు కుర్రాడు.

భూతవైద్యుడు కళ్ళు మూసుకున్నాడు. మంత్రాలు తనకే అర్థంకాని శబ్దంతో చదివేడు. గుప్పెడు విభూతి తీసి ఆ కుర్రాడి మొహంమీద ఊదాడు. ఆ కుర్రాడి కళ్ళు మండుతున్నాయి. కళ్ళనిండా విభూతి.

"సరిగ్గా చూసి చెప్పరా .... పంతులుగారు కనిపిస్తున్నారా?" అనడిగాడు ఆదినారాయణ.

"ఆ....ఆ....కనిపిస్తున్నారు!" అన్నాడు కుర్రాడు కళ్ళు తుడుచుకుని ప్రయత్నంమీద చూస్తూ.

"ఏం చేస్తున్నాడు?" శెట్టిగారు అడిగాడు.

"గుళ్ళోకి వచ్చారు .... పార్వతీదేవి గుడిలోకి వెళుతున్నారు....నగలున్నాయి....పెద్ద వస్తువుని తీశాడు. ఒక్కొక్కటి తీస్తున్నాడు. మొత్తం తీశాడు. పంచెలో పెట్టుకున్నాడు!" అంటూ కనిపించిందాన్ని చెబుతున్నాడు. అందరూ పంతులుగారి మొహంలోకి చూడసాగారు.

పంతులుగారిలో చలనంలేదు. నిర్లిప్తంగా నవ్వాడు. కుర్రాడు కూడా పంతులుగారికేసి చూశాడు. ఒళ్లు జలదరించింది.

"ఇంకా ఏం కనిపిస్తుంది!" భూతవైద్యుడు అడిగాడు.

"మరేం కనిపించడంలేదు!" అన్నాడు కుర్రాడు లేచి నిలబడి.

"అయ్యా! ఇందులో కనిపించవలిసిందేంలేదు. పంతులుగారు తీసినట్టు అద్దంలో కనిపించినట్టు కనిపించింది. ఏందయ్యా" అంటూ కుర్రాడి మొహంలోకి చూశాడు. అవునన్నట్లు తలూపేడు కుర్రాడు.

"ఇళ్ళకు పోదాం. ఈభోగట్టా గున్నారావుకి తదితర పెద్దలకీ చెబుదాం. పోలీసు కంప్లయింట్ ఇద్దాం. నిజా

నిజాలు బయట పడతాయి" అంటూ లేచాడు ఆది నారాయణ.

భూతవైద్యుడికి వందరూపాయిల కాగితం చదివించాడు శెట్టి.

అంజనంకి అయిదు రూపాయిలు బదులుగా వంద రూపాయిలు వచ్చినందుకు తన అదృష్టానికి మురిసి పోయాడు. పంతులుగారు ప్రయత్నంమీద లేచి, అందరితోబాటు తనూ భారంగా అడుగు వేశాడు.

## 6

"మీవారు ఎక్కడికెళ్ళారు ధనం?"

"విశాఖపట్నం వెళ్ళారు!"

"ఎందుకట!"

"ఎవరో డి.యస్.పి.గారో డి.ఐ.జి.గారో వారితో మాట్లాడాలని. ఆదినారాయణగారు రమ్మన్నారు. ఇద్దరూ వెళ్ళారు."

ధనలక్ష్మి స్వామిజీ కౌగిట్లో నలిగిపోతుంది. ధనలక్ష్మి పాలమీగడలాంటి శరీరంలో మెరిసిపోతుంది. ఆ అందాన్ని తనివితీరా జుర్రుకుంటున్నాడు స్వామిజీ.

"పంతులుగారు ఇంతకి తెగిస్తారనుకోలేదు!"

"అతి వినయం ధూర్త లక్షణం వినలేదూ. అసలు మిమ్మల్ని ఇక్కడికి తీసుకొచ్చింది ఇందుకే. దేవాలయానికి సంబంధించిన కొంతమంది పెద్దలు ఒప్పుకో లేదుట, మావారు సంప్రదిస్తే—పోనీలెండి పీడా విరగడైంది. నిజం చెప్పాలంటే ఆ పంతులుగారి మొహం చూస్తేనే నాకు ఎలర్జీ స్వామిజీ" అంది స్వామిజీ ఛాతీ మీద ఉంగరాలు తిరిగిన వెంట్రుకల్ని నూతారంగా మీటుతూ.

"పోనీలే వేదపంతులు!" అన్నాడు జాలిగా.

"స్వామీజీ మనం ఎక్కడికయినా వెళ్ళిపోదామా!" అంది ఆశగా.

"ఎందుకూ?" తృళ్ళిపడ్డాడు స్వామిజీ.

"ఆయనతో కాపురం చేయడం ఎంత నరకంగా వుందో తెలుసా? చింతపండు బస్తా అంత పొట్ట. రెండు వందల కిలోల బరువూ. ఛీ ఛీ! అబ్బబ్బ మా అన్నయ్యాని తిట్టాలి డబ్బుకి ఆశపడి రెండో పెళ్ళి చేసినందుకు!" అంది అసహ్యంగా మొహం పెట్టి.

"శెట్టిగారికి ఇంతకుముందు పెళ్ళయిందా?"

"పెళ్ళి .... పిల్లలు అంతా అయింది. ఈయనగారి ప్రతాపం, వయసూ అంతా మొదటి పెళ్ళాంతోనే పోయింది. నేను వచ్చేసరికి పెద్ద పొట్టమాత్రం మిగిలింది నన్ను చంపుకు తినడానికి" అంది. అప్రయత్నంగా ఆమె కళ్ళలో నీరు తిరిగింది.

"ధనం! మనం ఊరు విడిచిపెట్టి వెళితే 'నగలు' దొంగిలించామన్న అపవాదు తప్పకుండా మనమీదకే వస్తుంది. మరో సంవత్సరం ఆగుదాం. నీకు ఇప్పుడేం తక్కువని. అవసరమయినపుడు ఆయన్ని విజయనగరమో, విశాఖపట్టణమో పంపిస్తున్నావు లేదా మనమే వెళుతున్నాం. ఆయనకీ అనుమానం రాదు. మనకీ ప్రమాదం వుండదు. ఇపుడు బయటపడితే ఊరంతా తరిమి కొడతారు ముందు నన్ను" అని బోధపరిచాడు స్వామిజీ.

"స్వామిజీ!" అంటూ తలుపులు దబదబ బాదిన చప్పుడు. టైమ్ చూశాడు. రాత్రి తొమ్మిది నలభయ్ నిముషాలయింది.

"ఈ సమయంలో ఎవరొస్తారు చెప్మా!" అన్నాడు

స్వామిజీ కళ్ళు మూసుకొని ఆలోచించి.

"దివ్యదృష్టితో చూడండి!" అంది ప్రేమగా ఆయన కళ్ళల్లోకి చూస్తూ. స్వామిజీ కళ్ళు మూశాడు.

"హూం ఈ మధ్య నా ఉపన్యాసం విన్న వాళ్ళకి సందేహాలు ఎక్కువ కలుగుతున్నాయి. మొన్న కూడా యిలాగే అర్ధరాత్రి చప్పుడయింది. నువ్వే వచ్చావను కున్నాను. తలుపులు ఎంతో ఆశపడి తీసి నీరుగారి పోయాను. భక్తుడు. ధర్మసందేహం వచ్చిందట అడగ డానికి వచ్చాడు. కాదనలేకపోయాను. తెల్లవార్లూ ప్రశ్నమీద ప్రశ్న వేసి నన్ను చంపుకు తినేశాడనుకో" అంటూండగా మళ్ళీ తలుపు చప్పుడు వినిపించింది.

ధనలక్ష్మి చీర చుట్టుకొని, రవిక తొడుక్కొని, చెదిరి పోయిన జుత్తు సర్దుకొని, వెళ్ళి తలుపు తీసింది. స్వామి యోగముద్రలోకి వెళ్ళిపోయారు—ఎదురుగా గున్నారావు. షాక్ కొట్టినట్లు వెనక్కి వచ్చి పడింది.

"స్వామిజీ .... గున్నారావుగారు!" అంది తడ బడుతూ.

గున్నారావు వాళ్ళిద్దరి పరిస్థితినీ గమనించాడు. స్వామిజీ ఛాతిమీద కుంకుమ వుంది. ధనలక్ష్మి జుట్టు చెదిరిపోయివుంది. స్వామిజీ పట్టు పీతాంబరం వదులుగా వుంది. మెళ్ళో రుద్రాక్షమాలలు లేవు. చేతికి తాయెత్తులూ లేవు.

"నమస్కారం స్వామిజీ!" అన్నాడు గున్నారావు.

"ఈశ్వరార్పణం. నమస్కారం గున్నారావుగారూ! ఏమిటిలా దయచేశారు. కబురుపెడితే మేమే వచ్చే వారిమిగా!" అన్నాడు తన తడబాటుని సర్దుకొంటూ.

"మీకంత శ్రమ ఇవ్వడం నాకు ఇష్టంలేదండీ. మీరు

జ్ఞానమార్గాన్ని అత్యుత్తమంగా బోధిస్తునట్లు దివిటీలా వెలిగిపోతున్న మీ మొహం చెబుతుంది. మిమ్మల్ని అనుమానించాను. ఆలయంలో దురుసుగా ప్రవర్తించాను. ఫలితంగా నాకు ఈ రోజు పాతిక వేలనష్టం వచ్చినట్లు తెలిసింది. నా బిజినెస్ ప్రారంభించి పదిహేను సంవత్సరాలయింది. ఇదే ఫస్టు టైమ్. పైసా కూడా అమ్మకపోవడం. జంక్షన్ లోవుంటూ అసలు బిజినెస్ లేకపోవడం చాలా విచిత్రంగా వుంది. ఆలోచిస్తే ఇతంతా దైవస్వరూపులు మీ మహాత్యమేనని తోచింది. మా ఆవిడ మిమ్మల్ని కలవమంది. క్షమార్పణలు చెప్పుకోమంది. మీరు క్షమించానని ఒక్కమాట చెప్పండి చాలు! వెళ్ళిపోతాను!" అన్నాడు బాధగా.

"దీనిలో ఇంత బాధపడవలసిందేముంది నాయనా! మీరంటే నాకు చాలా ఇష్టం. నిజాన్ని నిర్భయంగా అడుగుతారు. ముక్కుకు సూటిగా మాట్లాడతారు. కడుపులో ఒకటి బయటికి ఒకటీ మాట్లాడరు. పైగా జరిగిందానికి పశ్చాత్తాప పడుతున్నారు. పశ్చాత్తాపం కంటే మించిన ప్రాయశ్చిత్తం ఏముంటుంది చెప్పండి" అన్నాడు. స్వామిజీ మొహం గర్వంగా వెలుగుతోంది.

"ధన్యుణ్ని స్వామి. మీ పూజ భంగం కలిగించినందుకు మన్నించండి" అంటూ వెనుతిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు గున్నారావు.

ఇదంతా తన కళ్ళను తాను నమ్మలేకపోయింది ధనలక్ష్మి.

"ఏమిటి స్వామిజీ ఇదింతకూ? నిజమా? గున్నారావు గారు ఇక్కడికి రావడమా? మనకి ఏదో ముప్పు తప్పదు" అంది భయంగా.

"లేదు. ఆయనలో పరివర్తన వచ్చింది. రాకపోతే ఊరుకుంటానా. దేవి ధ్యానంచేస్తే వాడు నిముషాల్లో నాశనమైపోతాడు. తెలివయినవాడు. ముందే తెలుసుకున్నాడు. క్షమార్పణలు చెప్పుకున్నాడు. నువ్వేం భయపడవలసిన అవసరంలేదు!" అంటూ ధనలక్ష్మిని గుండెకేసి హత్తుకున్నాడు.

తలుపులు గడియపడ్డాయ్ మళ్ళీ.

## 7

అదొక యల్లారమ్మ మెట్ట—

నగరప్పాలెం వెళ్ళేదారిలో వుంది. క్రింద అందమయిన సరుగుడు తోట—ఇంకా అందమయిన గోస్తనీనది సజీవంగా ప్రవహిస్తోంది.. తోట శబ్దం రివ్వుమంటూ నది శబ్దం హోరుతో వింతగా కలుస్తోంది.

"మన ముగ్గురం ఇక్కడ కలిసినట్టు మూడో కంటికి తెలియకూడదు!" అన్నాడు ఆదినారాయణ.

"అవును. చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి!" వంతపాడాడు స్వామిజీ.

"మూడో కంటికే కాదండీ బాబూ .... నాలుగో కంటికి తెలీకూడదు" అన్నాడు సుబ్బయ్యశెట్టి. ఆదినారాయణ నగల ప్రస్తావన తీసుకొచ్చాడు.

"శెట్టీ! ఈ నగలు నువ్వే తీశావని నాకు అనుమానమయ్యా! ఎందుకంటే తాళంచెవులు ఆ పంతులు దగ్గర పోయి నలభయ్ సంవత్సరాలవుతుంది. ఇప్పుడు అతగాడ్ని అనుమానించడం మంచిది కాదు కదా!" అన్నాడు. శెట్టిగారి గుండాగిపోయింది.

స్వామిజీ, ఆదినారాయణ మొహంలోకి వింతగా

చూశాడు.

"అవును స్వామిజీగారూ!" అని నిర్ధారణగా తలూపేడు ఆదినారాయణ.—

"అదేవిటి భూతవైద్యుడి అరచేతిలో పంతులుగారు భూతద్దంలో చూసినట్టు కనిపించారు కదా—" నొచ్చుకున్నాడు శెట్టి.

"దానికేముంది శెట్టిగారూ! ఎవడిమీద అనుమానం వుంటే వాడే కనిపిస్తాడు. మళ్ళీ వెళితే మీరు కనిపించాలనుకుంటే మీరే కనిపిస్తారు. ఇదంతా మాయ. ఆ నగలు కనీసం నాలుగయిదు లక్షలు వుంటాయి. ఇందులో మా భాగం ఎంత? ఇది గుట్టుచప్పుడుకాకుండా తొక్కిపెడతాను. అవసరమయితే మినిష్టర్ లెవెల్లో మాట్లాడి కామవ్ చేస్తాను. నాకో లక్ష నగదు పారెయ్. అలాగే ఆ చేత్తో స్వామిజీకి ఎంతిచ్చుకుంటావో మరి ఆయన ఎంత డిమాండ్ చేయాలనుకుంటున్నాడో మీరు మీరూ తేల్చుకోండి!" అన్నాడు తాపీగా.

సుబయ్యశెట్టికి భూమి ఆకాశం కలిసి తిరుగుతున్నట్టనిపించింది.

"ఇది అన్యాయం ఆదినారాయణగారూ! నా పిల్లల సాక్షి. నా ఇద్దరి పెళ్ళాల సాక్షి. ఆ నగలు నాకు తెలీదు. దొంగ వ్యాపారం చేశానంటే ఒప్పుకుంటాను. బియ్యంలో మట్టిగడ్డలు కలిపేశానంటే ఓ.కే. అంటాను. పాలడబ్బాలో మైదా కలిపేనంటే సరే. 'నగలు' దోపిడీ ఎలా జరిగిందో నాకు తెలీదు! తెలీదంటే తెలీదు బాబోయ్. అదిగో ఆ అమ్మోరు సాక్షి!" అన్నాడు అమ్మోరివంక ఏడుస్తూ చూసి.

"శెట్టిగారూ తాతకి దగ్గులు నేర్పకండి. ఆ రాత్రి

మీ రే వెళ్ళి నగలు తీసివుంటారు. స్వామిజీగారు చూసి వుంటారు. ఎందుకనో స్వామిజీగారు మౌనం వహిస్తున్నారు. నగలు గురించి మీకు తెలీదా! దైవస్వరూపులు!" అని వ్యంగ్యంగా అన్నాడు. స్వామిజీ ఉలిక్కిపడ్డాడు.

"నిజం ఆదినారాయణగారూ నాకు తెలీదు" అన్నాడు స్వామిజీ.

"అయితే ఆ తాళంచెవులు ఆ రాత్రి ఎవరికయినా ఇవ్వడం జరిగిందా!" ఆదినారాయణ 'క్లూ' లాగడానికి ప్రయత్నించాడు.

"ఎవరికిస్తాను. మా 'ధనం'కిస్తాను. ధనం ఇనప్పెట్టెలో భద్రంగా పెడుతుంది. ఈ విషయం మూడో కంటికి తెలీదు!"

"మీ భార్య ఈ నగల దోపిడీ చేసిందని ఎందుకనుకో కూడదు!"

స్వామిజీ షాక్ తిన్నాడు.

శెట్టిగారు ఆలోచనలో పడ్డాడు. క్షణంలో తేరుకుని "రామ రామ! ధనం అలాంటిది కాదు. ఇన్ని లక్షలు బిజినెస్ దాని పేరిట టర్నోవర్ అవుతుండగా అమ్మవారి నగలమీద ఆశపడుతుందా! అయినా దానికి అలాంటి పాపిష్టి ఆలోచనలు రావు. వచ్చినా దోపిడీ చేయడానికి ధైర్యం చాలదు. అది నాకంటే పిరికి సన్నాసి! లేదు ఆదినారాయణగారూ! మీరు తప్పుడు అంచనాలు వేసి మమ్మల్ని వీధిలోకి లాగాలని చూస్తున్నారు. మీరు రహస్యంగా సమావేశం అవుదామన్నారంటే మా మంచికోరి నాలుగు మాటలు చెప్తారనుకున్నాను గాని, హార్టు ఎటాక్ తెప్పిస్తారనుకోలేదు!" అన్నాడు బాధపడుతూ.

"శెట్టిగారూ! మీరు బాధపడ్డం దేనికి. ఇంట్లో రేపు సోదా చేస్తానని గున్నారావుగారు చెప్పేరుకదా—అపుడు తెలిసిపోతాయికదా నిజానిజాలు" అని ఓదార్చాడు స్వామిజీ.

"చాల్లెండి. నగలు దొంగతనం చేసినోళ్ళు ఇంట్లో దాచుకుంటారా....ఏ బావిలోనో ఏ పాడుబడిన కొంప లోనో దాచుకుంటారు. సరే మీ ఇష్టం. ఇందులో నేను చేయగలిగింది ఏం వుండదు. ఆ గున్నారావు మీ అంతు చూస్తాడు. అపుడు మూడు లక్షలు కాదు—నాలుగు లక్షలు నగదూ ఆయనకే ఇస్తానన్నా ఒప్పుకోడు. ఆలోచించుకోండి! నాతో రాజీపడాలనుకుంటే రేపు ఉదయం తొలిజాము అంటే నాలుగ్గంటలముందే మా ఇంటికి రండి!" అంటూ విసురుగా లేచాడు ఆదినారాయణ.

పరిస్థితి అయోమయంగా కనిపించింది. శెట్టిగారు మౌనంగా అనుసరించాడు.

"ఓం నమశ్శివాయ" అంటూ లేచాడు యోగానంద స్వామిజీ.

# 8

నమశ్శివాయ పంతులుగారి ఇల్లంతా సోదా చేశారు. ఒక్క పైసా దొరకలేదు. గున్నారావు, ఆదినారాయణ, తదితర పెద్దలు, శెట్టిగారు ఒకరి మొహాలు ఒకరు చూసు కున్నారు.

"పదండి వెళదాం. పంతులుగారూ .... అనుమానం వున్నప్పుడు ఇలా సోదా చేయడం సర్వసామాన్యమయిన విషయం. మీరు బాధపడకండి!" అంటూ లేచాడు గున్నారావు.

పంతులుగారి చంటాడు శివయ్య చేతిలో ఏదో

ధగధగా మెరుస్తోంది. కళ్ళు ఇంతలేసి పెట్టి చూశాడు శెట్టిగారు.

"అదిగో అమ్మవారి కాళ్ళ మట్టెలు. బంగారు మట్టెలు. ఆ దొంగనా కొడుకు దగ్గరున్నై" అన్నాడు ఆత్రుతగా.

నమశ్శివాయ పంతులుకి గుండాగినంత పనయింది. నిజమే! శివయ్య చేతిలో బంగారు మట్టెలు. సాక్షాత్తూ పార్వతీదేవి మట్టెలున్నాయి.

"బాబూ! ఇది నీకెవరిచ్చారు?" అనడిగాడు పంతులు.

భ్రమరాంబకేసి చూపించాడు.

"భ్రమరాంబా.... ఇలారా!" ఇల్లంతా నిశ్శబ్దం ఆవహించింది.

"ఈ బంగారు మట్టెలు ఎక్కడివి?"

"మన అరటిచెట్టు క్రింద దొరికాయి నాన్నా!" అంది భయపడుతూ.

నమశ్శివాయ అరటిచెట్టు దగ్గరికెళ్ళి మొదలు తవ్వాడు. అమ్మవారి నత్తు, బేసరి దొరికాయి.

గున్నారావు తన కళ్ళను తనే నమ్మలేకపోయాడు.

"అయ్యా గున్నారావుగారూ! ఇదేదో మాయ. నా ఇంటిలో పార్వతీదేవి నగలు వుండటం వింతగా వుంది!" అని నెత్తిబాదుకున్నాడు.

"అవునయ్యా! వింతగానే వుంటుంది మరి— మొత్తం నగలు ఎక్కడ దాచావో చెప్పేంతవరకూ ఆ శివాలయంలోనే నిన్ను విరిచిగడితే అవే ఒక్కొక్కటి కనిపిస్తాయి!" సుబ్బయ్యశెట్టి మండిపడ్డాడు.

"ఏది ఏమయినా పంతులుగారూ! దొంగతనం మీరే చేశారనడానికి ఆధారాలు చాలవూ?" ఆదినారాయణ అడిగాడు.

పంతులుగారి బావి దగ్గర 'తాళం' కనిపించింది.

"అదిగో గున్నారావుగారూ! అమ్మవారి గర్భగుడికి సంబంధించిన తాళం—ఇంతవరకూ తాళాలు పోయాయని నాటకమాడాడు. ఇది అమ్మవారి గర్భగుడి తాళమేనా?" అని నమశ్శివాయ పంతుల్ని నిలదీశాడు శెట్టిగారు. అవు నన్నట్లు తలూపేడు నమశ్శివాయ పంతులు.

"ఇప్పుడు ఏం చేయాలి?" శెట్టి మండిపడ్డాడు.

"చెప్పేరుగా కోవిల్లో విరిచికట్టండి!" అన్నాడు.

"గున్నారావుగారూ చూశారా! అనవసరంగా నన్ను అనుమానించారు. పంతులుగారి నిజ స్వరూపం ఇప్పటి కయినా తెలిసిందా! ఇతడు మేకవన్నె పులిలాంటి వాడండీ. ఒకరోజు ఆలయంలో వుంచండి. మరుసటి రోజుకి నగలు పుట్టుకరాకపోతే నన్నడగండి!" అంటూ పంతులుగారిని తీసుకుని శివాలయంకేసి నడిచారు.

గున్నారావుకి అంతా అయోమయంగా వుంది. దొరికిన వస్తువుల్ని భద్రంగా వుంచాడు. ఇంకా ఏమయినా దొరుకుతాయేమో వెదకమని కొంతమంది మనుషుల్ని నియమించాడు.

శివాలయం దగ్గరికి పంతులుగారు చేరేసరికి స్వామిజీ ఎదురు చూస్తున్నాడు. తదితర పెద్దలందర్నీ చూసి కంగారుపడ్డాడు.

"అయ్యా! అపరాధం జరిగిపోయింది" అంటూ శెట్టిగార్కీ, గున్నారావుగార్కీ ఎదురు వచ్చాడు.

"ఏం జరిగింది?" అనడిగాడు.

"అమ్మవారి వడ్డాణం నా పూజగదిలో వుంది. ఎలా వచ్చిందో తెలీదు. ఇది సత్యం? ఆ జగన్మాత సాక్షిగా చెబుతున్నాను!" అంటూ వడ్డాణం గున్నారావు చేతికి

అందించాడు.

అంతా ఒకరి మొహాలు ఒకరు చూశారు.

"పంతులుగారూ! అమ్మవారి వడ్డాణం ఇదేనా!"

"సాక్షాత్తూ ఇదే బాబూ!" అన్నాడు నమశ్శివాయ పంతులు.

"ఇంకేం వున్నాయో చూడండి! స్వాములవారయి వుండి తమరిలా కక్కుర్తి పడతారనుకోలేదు. ఇంకా ఏయే నగలు తమరివద్ద వున్నాయో సెలవిస్తే మంచిది!" అన్నాడు గున్నారావు.

ఆదినారాయణకి ఇదంతా అగమ్యగోచరంగా వుంది. తన డబ్బయి సంవత్సరాల సర్వీసులో ఇలాంటి సంఘటన ఒక్కటీ జరగలేదు. పంతులుగారింట్లో బంగారపు మట్టెలు, తాళంచెవి దొరికింది. ఇక్కడ అమ్మవారి వడ్డాణం దొరికింది. అసలు దొంగ ఎవరయివుంటారు చెప్మా? ఆలోచనలో పడి తల గోక్కున్నాడు.

"శెట్టిగారూ! తమరు ప్రవేశపెట్టిన స్వామిజీ సన్నిధిలో అమ్మవారి వడ్డాణం దొరికింది. ఇపుడేమంటారు. ఎవరు దొంగనాకొడుకు?" అనడిగాడు గున్నారావు.

"అమ్మమ్మ .... అంతమాటనకండి. ఇందులో ఏదో మోసం జరిగి వుంటుంది. స్వామిజీమీద నాకు నమ్మకం వుంది" అన్నాడు శెట్టి.

"మీ నమ్మకాలు ఎవడిక్కావాలండీ. మీ భార్య మీద మీకు నమ్మకం వుండొచ్చు. మాకు వుండొద్దూ!" గుట్టు లాగడానికి ప్రయత్నించాడు.

"గున్నారావుగారు అసభ్యంగా మాట్లాడుతున్నారు."

"లేదండీ నిన్న మీరు విశాఖపట్నం వెళ్ళారుకదూ. అపుడు మీ భార్య అంటే సాక్షాత్తూ మీ సతీమణి—

తొమ్మిది గంటల ఇరవై నిముషాల ప్రాంతంలో స్వామిజీ పూజలో నిమగ్నమయిపోయి వుంది. జుత్తు చెదిరిపోయినా స్వామిజీ గుండెమీద ఆమె బొట్టు అంటుకున్నా గుడ్డ లూడిపోయినా మీరు నమ్ముతారు. మీ భార్య పతివ్రత. ఆయన సాక్షాత్తూ భగవంతుడు. కాని లోకం కళ్ళు మూయగలరా?" అనడి గాడు.

శెట్టి స్వామిజీ మొహంలోకి చూశాడు.

"ఇదంతా అబద్ధం. నాకేం తెలీదు. ఆమె పరమ పతివ్రత — నేను ఆ సమయంలో ఆమె వేదాంత రహస్యా లడుగుతుంటే చెబుతున్నాను. ఇంతకు మించి మాకే పాపం తెలీదు. ఈయన వచ్చినపుడే గ్రహించాను. మా మీద ఏదో కుట్ర పన్నుతాడని — మొదట్నుండీ నన్ను ఆడిపోసుకుంటున్నాడు. ఇప్పుడే అభాండం వేశాడు.... మాతా....ఇందుకు నువ్వే సాక్షి!" అన్నాడు మంత్రం జపిస్తూ.

"తాళంచెవి దొరికింది!" అంటూ ఒకడు తీసు కొచ్చాడు.

"ఆ తాళంచెవి అమ్మవారి నగలపెట్టె తాలూకు తాళంచెవి" అన్నాడు శెట్టి.

"ఇక్కడికెలా వచ్చిందీ. అయ్యా....అంతా గందర గోళంగా వుంది" అన్నాడు ఆదినారాయణ.

"శెట్టిగారూ! ఇపుడేమంటారు?" మింగేసేలా చూశాడు గున్నారావు.

"ఈ స్వామిగాడ్ని కూడా ఈ శివాలయంలో విరిచి గట్టండి. ఇద్దరు భక్తులు కలిసి ఆడిన నాటకం ఇది. తెల్లారేవరకూ వుంటే వాళ్ళే నిజం చెబుతారు" అన్నాడు సుబ్బయ్య శెట్టి.

"లక్ష్మీ!"

"ఊ!" మత్తుగా పలికింది. ధనలక్ష్మి, రాజు ఒడిలో పడుకుంది. విశాఖపట్నం బీచ్‌లో పలుచగా మనుషులున్నారు. ఓరగా కూర్చున్నారు ధనలక్ష్మి, రాజు ఇద్దరూ. రాజు మహా అందగాడు. మగాళ్ళకే ముద్దొచ్చేంత అందగాడు. ధనలక్ష్మికి తను అపర సత్యభామనన్న గర్వం చిన్నప్పటినుండీ వుంది.

"రాజూ....మనం ఇలా వారానికి మూడుసార్లు కలుసుకోవడం ఏం బాగులేదు—మా ఆయన చీటికిమాటికి విశాఖపట్నం ఎందుకు? ఎంత బంధువులయితే మాత్రం అపార్థం చేసుకోరూ? అని ఒకటే ఒకే గోల—దీనికి మనం ఏదో ఆలోచించాలి!" అంది రాజు క్రాపింగ్‌లో చూపుడు వేలు పోనిచ్చి సుతారంగా మీటుతూ.

"లక్ష్మీ! నిన్ను పువ్వుల్లో పెట్టి పూజించాలనివుంది. కాని ఏం చేయను. నేను నిరుద్యోగిని. ఈ దేశం నిరుద్యోగుల కల్పవల్లి. నువ్వా — చిన్నప్పటినుండీ, నేతి ముద్దలతో తిని, ఎంతో గారాబంగా పెరిగావు. నువ్వు ఇపుడు అర్థాంతరంగా వస్తే నిన్ను పోషించుకోలేని దుస్థితి నాది. ఏం చేయమంటావు చెప్పు!" బాధగా మొహం దాచుకున్నాడు.

"నువ్వలా బాధపడకు రాజూ .... నా బాధ అర్థం చేసుకుంటావని చెప్పేను. మా ఆయనొక జడపదార్థం. ఆయనకు డబ్బు సంపాదించడంతప్ప ఓ అచ్చటా ముచ్చటా తెలీదు. భోంచేయగానే గుర్రుపెట్టి నిద్రపోతాడు. నేనూ ఉప్పూ కారం తినే ఆడదాన్ని. చేసిన తప్పు ఫ్రాంక్‌గా చెబుతున్నాను. మీరు అపార్థం చేసుకోకండి. మా

ఆయన అసమర్థతవలననే స్వామిజీని మరిగేను. ఆయన బ్రహ్మచారి. బలంగా వుంటాడు. నాకు శారీరకంగా సుఖాన్నిస్తున్నాడేగాని మానసికంగా ఏ విధమైన తృప్తిని ఇవ్వలేదు. పైగా ఈ మధ్య ఆలయంలో ఏవో నగల కేసులో ఇరుక్కున్నాడు. నిజం ఏమిటో నాకు తెలీదు. అలాంటి వాళ్ళతో సంబంధం మంచిదిగాదు. పైగా మా ఊరికి నిప్పులాంటి మనిషి గున్నారావు. ఆయన మా ఇద్దర్ని కలగలిపి చూశాడు. మా సంగతి ఏ క్షణంలో నయినా బయట పెట్టొచ్చు—అసలు ఆయన నా విషయం కదిపేలోగా మనం ఎక్కడికయినా దూరంగా పారి పోదాం!" అంది.

రాజు, లక్ష్మి మొహంలోకి అలాగే చూస్తూండి పోయాడు.

"అబ్బా....ఏంటండీ అలా మింగేసేలా చూస్తారు?"

"నువ్వు ఎంత అమాయకురాలివా అని—నేను ఫలానా మగాడితో తిరిగానూ అని ఇంత నిర్భయంగా చెబుతున్నందుకు నీ నిజాయితీకి జోహార్లు. లక్ష్మి! తప్పులు అందరూ చేస్తారు. నేను మాత్రం వయసులో ఎన్ని తప్పులు చేయలేదు!"

ధనలక్ష్మి, రాజు నోరు మూసేసింది—

"వొద్దండీ మీ గురించి చెప్పద్దు. మీరు ఎంతమందితో తిరిగారో ఎలా తిరిగారో నాకనవసరం! నేను మీ జీవితంలో ప్రవేశించాలి. మీరు నాకే సొంతం కావాలి! మిమ్మల్ని మరొకరు పంచుకుంటే నేను బ్రతకలేను. మీరు మరొకరి సొందు కోరిన తక్షణం నా శవం మీకు కనిపిస్తుంది!" అంది ధనలక్ష్మి. కళ్ళల్లో గిర్రున నీరు తిరిగింది.

"డోంట్ వర్రీ లక్ష్మి! ఇదిగో స్టీల్ ప్లాంట్—

త్వరలో తయారవుతుంది. అందులో ఇంజనియర్ గా నన్ను వేసుకుంటానని మేనేజింగ్ బోర్డులో ఓ పెద్ద మనిషి మాటిచ్చాడు. ఈలోగా వర్క్ షాపు పెట్టాలని సెల్ఫ్ ఎంప్లాయిమెంట్ స్కీమ్ క్రింద గవర్న మెంట్ దగ్గర లోన్ కోసం ఎప్లయ్ చేశాను. నెల రెండు నెలల్లో వస్తోంది. మన సమస్యలన్నీ గట్టెక్కి పోతాయి!" లక్ష్మి తల నిమురుతూ చెప్పాడు.

"రాజూ! అంతవరకూ వుండేలా లేదు నా పరిస్థితి. ఎందుకో క్షణం క్షణం భయంగా వుంది. మనశ్శాంతి కరువౌతుంది. బహుశా భర్తను మోసంచేసి తిరుగుతున్న ప్రతి ఆడదానికీ ఈ చిత్రహింస తప్పదనుకుంటాను. మా వారిని చూసినపుడల్లా గిల్టీగా ఫీలవుతాను— రాజూ నీతో నే వుంటాను. వుంటే తింటాను. లేకపోతే పస్తులుంటాను.

నేను నువ్వనుకున్నట్లు నేతిముద్దలు తిని పెరగలేదు. కలో, గంజో తాగి, లేకపోతే పస్తులుండి పెరిగాను. ఆయనకు మొదటి భార్య చనిపోయిం తరువాత రెండు మూడు సంవత్సరాలు పెళ్ళికాలేదు. పెళ్ళీడు వచ్చిన పిల్లలు ముగ్గురు, చంటిపిల్లలు ముగ్గురూ వున్నారు. మనిషి అప్పటికే మదపుటేనుగులాగా వుండేవాడు. అయితే మా అన్నయ్య, వదినలని డబ్బుతో లొంగదీసుకున్నారు. పేద ఇంట్లో పుట్టడంవలన డబ్బుతో మగవాడ్ని కట్నం ఇచ్చి కొనలేని స్తోమత లేనందున కట్టబెట్టేశారు. నా గొంతుకు ఉరితాడు బిగించాడు. నేను నీతో గంజి తాగయినా.. పస్తులుండయినా స్వేచ్ఛగా బ్రతికాలను కుంటున్నాను రాజూ!"అంటూ కాళ్ళమీద పడి ఏడ్చింది.

"నిజమే లక్ష్మీ! మరోసారి ఆలోచించు! కనీసం

వర్క్ షాపు పెట్టాలంటే అయిదారు లక్షలుండాలి. రేపు మా ఇంటికి వెడతాను. మావారితో అప్పివంపకాలు చేయమంటాను ... నా వాటాకి అయిదు లక్షలు వస్తుంది. అది తీసుకొచ్చేంతవరకూ ఆగు! నన్ను విజయవాడ వెళ్ళిరానీ. అంతవరకూ ప్రశాంతంగా వుండు. నీకేం భయంలేదు!" అని ధైర్యం చెప్పాడు.

# 10

ఉదయం శివాలయంలోకి గ్రామ పెద్దలు, శెట్టిగారు అడుగుపెట్టేసరికి స్వామిజీ శవం కనిపించింది. నమ శ్శివాయ స్పృహతప్పి పడివున్నాడు.

గున్నారావు, పంతులుగారి మొహంమీద నీళ్ళు చల్లాడు.

నమశ్శివాయ పంతులు భారంగా కళ్ళు తెరిచి చూసే సరికి ఎదురుగా స్వామిజీ శవం. 'పరమశివా' అని గట్టిగా అరిచాడు.

"కాదు పచ్చి మోసం. గున్నారావుగారు ఇదంతా నాటకం. ఈ పంతులే స్వామిజీని హత్యచేసివుంటాడు!" అని అరిచాడు శెట్టి.

స్వామిజీ కడుపులో పొడిచారు. ప్రేగులు బయటికి వచ్చాయి. కత్తితో పొడిచినట్లు స్పష్టంగా కనపడు తుంది.

నమశ్శివాయ చేతులకు రక్తం వుంది.

"అదిగో! పంతులుగారి చేయి చూడండి. రక్తం! ఇది దారుణం. ఇంతవరకు గజదొంగ అనుకున్నాను. ఇపుడు హంతకుడు కూడానా. వీడే స్వామిజీని కత్తితో పొడిచివుంటాడు. కత్తి కనిపించకుండా భద్రంగా దాచి పెట్టివుంటాడు. లాభంలేదు. ఇలాంటివాణ్ని మనం

పంచాయితీలు జరిపించి విచారించి ప్రయోజనం లేదు. సెంట్రల్ జైలుకి పంపించవలసిందే!" అన్నాడు శెట్టి గారు.

"పంతులుగారూ ఏవిటండీ ఇదంతా!" గున్నారావుకి మళ్ళీ పజిలింగ్ ప్రారంభమయింది. స్వామిజీకి దోపిడీకి సంబంధంవుందా? వుంటే స్వామిజీని ఎవరు చంపుతారు? పంతులుగారు చంపరు? చంపరని తన మనసు ఎందుకో గట్టిగా చెబుతుంది. ఈ నగల దోపిడీతో సంబంధంవున్న వ్యక్తి మరొకరెవరో చంపాలి? లేదా? అది శెట్టిగారే ఎందుకు కాకూడదు.

"శెట్టిగారూ! తమరు ఆవేశపడకండి! ఆకలిమంటలతో నిండా భారంతో సగం చచ్చిన పంతులుగారు ఈ హత్య చేశారంటే నేను నమ్మను. ఈ నగల దోపిడికి మీకూ ఎక్కువ సంబంధం కనబడుతుంది. ఇందులో ఏదో 'మాస్టర్ ప్లాన్' వుంది. మీరే స్వామిజీని చంపొచ్చుగా!" అన్నాడు.

"నేనా .... హత్యా .... నే నెవరనుకొని మాట్లాడుతున్నారండీ!"

"ఏం—గుడిలో నగలు దోపిడీ చేయగాలేంది హత్య చేస్తే తప్పా! మీరే మీ భార్యనీ ఇతన్నీ అనుమానించి ఆమెను చెరచిన కారణంగా ఓర్చలేక హత్య చేయొచ్చుగా!" ధైర్యంగా ప్రశ్నించాడు గున్నారావు.

"అవున్రా అయ్యా. ఇదీ పాయింటే!" వంత పాడాడు ఆదినారాయణ. మిగతా జనం గుడ్లప్పగించి చూస్తున్నారు. శెట్టి మొహం చెమట్లు పట్టింది. నరాలు స్వాధీనం తప్పుతున్నాయి.

"గున్నారావుగారూ! ఇదన్యాయం. ఈ హత్య నేను

చేయలేను. ఈ నగల దోపిడీకి నాకు సంబంధంలేదు. కావాలంటే ఏ ప్రమాణం అయినా చేస్తాను. గుళ్ళో దీపం ఆర్పమంటే ఆర్పుతాను!" అన్నాడు సుబ్బయ్యశెట్టి.

"దీపాలు ఆర్పిన తరువాతనే గదా శెట్టిగారు దోపిడీ ప్రారంభమయ్యేది!"

"లేదు గున్నారావుగారు! ఈ హత్య నేను చేయలేదు. స్వామిజీకి మా ఆవిడకీ సంబంధం వుందని మీరు చెప్పక ముందే తెలును. నా వలన పొందలేని సుఖం అతనివలన పొందుతుంది. అందుకు నేను ఆయనమీద పగ, ద్వేషం, లాంటివి ఏవీ పెంచుకోలేదు. నాకే ఇది గుండె మంటయితే ఈ భాగవతం తెలిసిన మరుసటి క్షణాలో స్వామిజీని హత్యచేసి, శవాన్ని మాయంచేసి వుండేవాడ్ని! ఈ హత్య నేను చేయలేను బాబోయ్!" అంటూ భోరున ఏడ్చాడు.

"నముశ్శివాయగారూ! మీరేవన్నా ఈ హత్యా ప్రయత్నాన్ని చేశారా!" ఆదినారాయణ అడిగాడు.

"శివశివా! లేదండీ ఈ పాపాన్ని మూటగట్టుకో మంటూరా. నా ఇంటిలో అయిదుగురు పిల్లల్ని ప్రతి రోజూ జీవ హత్య చేస్తూనే వున్నాను—ఆకలిమంటలతో చంపుతూ. ఆ పాపం చాలదూ. ఏదో నా కాలం దగ్గర పడింది. పూర్వజన్మ పాపఫలితం ఇప్పుడు అనుభ విస్తున్నాను. రాత్రి ఏం జరిగిందో నాకు తెలీదు, మీరు నన్ను మేల్కొలిపేవరకూ నేనెక్కడున్నానో తెలీదు. ఆ పరమేశ్వరుని సాక్షిగా!" అన్నాడు నముశ్శివాయ పంతులు.

"అయితే ఈ హత్య ఎవరు చేశారు?" గున్నారావు ఆలోచనల్లో పడ్డాడు—"అయ్యా! మన ఊరికే ఏదో

ముసురుకుంది—చెడిపోయే కాలం వస్తే ఇలాగే దాపు రిస్తాయన్నీ. ఇంతవరకు 'నగల దోపిడీ' ఒకటే సమస్యను కుంటే, దాంతో బాటు స్వామీజీ హత్య మరో సమస్యయి మన నెత్తిమీద కూర్చుంది. గున్నారావూ! మనం చేయ గలిగినంతా చేశాం. పద! విశాఖపట్నం వెళ్ళి పెద్దోళ్ళకి రిపోర్టు సేస్తేగానీ ఇది అంత తేలిగ్గా తేలదు!" అన్నాడు చుట్ట వెలిగిస్తూ.

"సమ్‌థింగ్ ఈజ్ గోయింగ్ రాంగ్!" అంటూ ఆలోచనల్లో పడ్డాడు గున్నారావు. మిగతా కార్య క్రమాల కుపక్రమిస్తూ.

# 11

"అబ్బా .... ఎంత ప్రశాంతంగా వుంది లక్ష్మీ!" అన్నాడు చొక్కా విసిరి యుఫోమ్ డబుల్ బెడ్‌పై మేనువాలుస్తూ రాజు.

సుబ్బయ్యశెట్టి సానంలో రాజు చింతపండు సానంలో మేలిమి బంగారంలా మెరిసినట్లయింది. రెప్పార్పకుండా రాజుని అలాగే చూస్తూ వుండిపోయింది.

"పిల్లలంతా ఎక్కడికి వెళ్ళారు?" రాజు అడిగాడు.

"పాండ్రంకి వెళ్ళారు. వాళ్ళ తాతగారింటికి—మా ఆయన విశాఖపట్నం వెళ్ళారు—అమ్మవారి నగల కేసు విషయంలో. ఈలోగా మన వ్యవహారం పరిష్కారం కావాలి.... చెప్పు రాజూ .... ఏవిటి — మీ వాళ్ళింటి కెళ్ళావు కదా ఏమంటారు మీ వాళ్ళు—నీ చేత ఇంజ నీరింగ్ వర్క్ షాపు పెట్టిస్తారటా!" అనడిగింది.

"లక్ష్మీ! మా యింట్లో ఈ విషయం కదిపేను" అన్నాడు.

ఆకగా తృళ్ళిపడి లేచి ఏమన్నారు? అన్నట్లు

చూసింది. రాజు గుండెమీద తల ఆన్చి చెప్పేవరకుండా అతని కళ్ళలోకి చూస్తోంది.

"వాళ్ళు ఒప్పుకోలేదు. నా ఇంట్లో నాకంటే ముందు వాళ్ళు నా తరువాత వాళ్ళు వున్నారు. వారందరికీ చదువుసంధ్యలు పూర్తవ్వాలి. వారికి గవర్నమెంటు ఉద్యోగాలు దొరకాలి. ఎవరిమటుకు వారికి పెళ్ళిళ్ళవ్వాలి. అరడ్రులో నేను మూడవవాణ్ని. పెద్దవాడికి లక్ష అడుగుతున్నారు కట్నం. రెండవవాడికి ఒకటిన్నర, నామీద రెండు ఎక్స్‌పెక్ట్ చేస్తున్నానన్నారు — ఛీ-ఛీ కట్నాలు తీసుకుని పెళ్ళిచేయడానికి సిగ్గులేదూ. ఈ డబ్బంతా ఎవర్ని కప్పెట్టుకోడానికి అని ఎదురించాను. పెద్దన్నయ్య చాచి చెంప వాయించాడు. తిరగబడితే వాడిని పులుసులోకి దుమ్ము కూడా మిగలకుండా తన్న గలను. నాకు విద్యాబుద్ధులు చెప్పించాడు. చెప్పేడు అన్న గౌరవంకొద్దీ వూరుకున్నాను.

"ఒరేయ్ గాడిదా .... నేను మా నాన్నని ఆస్తి పంపకాలు వేయమని అడక్కుండా రెక్కలు ముక్కలు చేసుకుని స్వార్జితం అయిదు లక్షలు సంపాదించాను. ఆయన చనిపోయేముందు పదిలక్షలు నాకప్పగించారు. పట్టుకుపోయారు. మీకు నా పాతిక లక్షల ఆస్తి చిల్లిగవ్వకూడా ఇవ్వను. నేను చచ్చేంతవరకూ మీ తెలివి తేటలతో మీరు సంపాదించండి. ప్రయోజకులుకండి. నేను పోయాక ఈ ఆస్తిలో ఎవరెవరికి ఎంతెంత భాగం చెందుతుందో ధర్మబద్ధంగా వీలునామా రాసి మరీ పోతాను!" అన్నారు అంటూ చెప్పడం ఆపుచేశాడు రాజు.

రాజు యీ విషయం చెబుతున్నందుకు ఎంతగానో ఫీలయ్యాడు. తలదించుకున్నాడు.

"లక్ష్మీ! నీకు నేను తగను! ప్లీజ్ నన్ను మరిచిపో!" అన్నాడు.

ధనలక్ష్మి షాక్ ఫీలయ్యింది.

"ఏమిటి రాజూ జోక్ చేస్తున్నావా?" అంది నవ్వ డానికి ప్రయత్నించి నవ్వి.

"లేదు లక్ష్మీ. సీరియస్‌గానే చెబుతున్నాను. నీ అమాయకమయిన మొహం చూస్తూ అబద్ధం చెప్పలేను. నిన్ను మోసంచేయలేను. ప్రేమించాలంటే నాకు ఆస్తి, అంతస్థు, అర్హత వుండాలి!" అన్నాడు బాధపడుతూ.

రాజు మొహంలో రంగులు మారాయి. ధనలక్ష్మి కాసేపు ఆలోచనలోపడింది.

"సరే రాజూ! నువ్వు స్వయంగా ఇంజనీరింగ్ వర్క్‌-షాపు పెట్టాలంటే ఎంత పెట్టుబడి కావాలంటావ్?"

"అమ్మో—ఆడదానివి! భర్తచాటు భార్యవి! నీ దగ్గర నాలుగయిదు లక్షలు ఆశించడం ఎంత స్వార్థం. లోకం ఏమనుకుంటుంది?"

"లీవ్ ఇట్ రాజూ....లీవ్ దట్ బ్లడీ ప్రపంచం! ఈ ప్రపంచాన్ని మనం విడిచిపెట్టేద్దాం. దూరంగా వెళ్ళి మనకో ప్రపంచాన్ని సృష్టించుకుందాం. నీకవసర మైన అయిదు లక్షల రూపాయలు నా దగ్గరున్నై."

"అయిదులక్షలా. అంత నగదు నీ కెక్కడిది?"

"కావాలనుకుంటే ఎంతయినా వస్తుంది. మా ఇంట్లో మా తాతముత్తాతల స్వార్జితం నగలున్నాయి. ఇవి అమ్మితే కనీసం నాలుగున్నర లక్షలు వస్తాయి. నా

దగ్గర ఒక లక్ష వరకూ క్యాష్ వుంది!" అంటూ లేచి లోపలికి వెళ్ళింది. లోపల ఏం చేసిందో పదినిముషాలు పోయిన తరువాత నగలమూట చిన్న బ్రీఫ్‌కేసుతో క్యాష్ తీసుకొచ్చింది. రాజు కళ్ళు జిగేలుమన్నాయి. అంత బంగారం డబ్బు తనెప్పుడూ జీవితంలో చూడ లేదు.

"లక్ష్మీ! నాకెందుకో భయంగా వుంది!"

"డోంట్ వర్రీ. చాలా! మనం ఇక్కడున్నండే వెంటనే బైటికి వెళ్ళిపోవాలి. మరు క్షణం వుండటం మనకి మంచిది కాదు!" అంది. ఆమె పెదవులు వొణుకు తున్నాయి. మొహం సింధూరంలా తయారయ్యింది. కళ్ళు బండి చక్రాల్లా తిరుగుతున్నాయి.

"ఏవిటి లక్ష్మీ .... ఎందుకీ కంగారు ఇపుడు ఏం కొంపలు మునిగిపోతున్నాయని. ఉదయం వెడతాం. ఇంట్లో పిల్లలు ఎవరూ లేరుగా! భయపడటానికి!" అని దగ్గరకు లాక్కున్నాడు. లక్ష్మీ నగలమూట దగ్గరికి తీసుకుంది. సూట్‌కేసులో పెట్టింది. బ్రీఫ్‌కేసు తాళాలు వేసింది. రెండు తాళాలు జాకెట్ లోపల పడేసుకుంది.

"లక్ష్మీ—బి కూల్—నువ్వు తప్పు చేసినట్టుగా ఎందు కలా కంగారు పడతావ్-" పాదివి పట్టుకొని అడిగాడు.

"ఇద్దరికీ మంచికాలం కలిసి రావాలి కదా!" గున్నారావు గొంతు ఖంగుమంది. ధనలక్ష్మీ మంచంమీద అల్లంత దూరంలో ఎగిరిపడింది.

"ష్! నువ్వెలా వచ్చావు. రాత్రిళ్ళు ఇలా బరితెగించి గోడ దూకి మరీ వస్తావా! నువ్వసలు ఒక పెద్దమనిషేనా? ఇవి సంసారి కొంపలనుకుంటున్నావా? సానికొంపలను కుంటున్నావా?" తిరగబడింది.

లక్ష్మి చెంప చెళ్ మంది.

భూమి ఆకాశం కలిసి తిరుగుతున్నట్టుగా అనిపించింది.

"రాజూ! చంపెయ్. వీడ్ని ఇక్కడే పాతేద్దాం!" అంటూ కత్తి అందించింది. రాజు పొడవబోయాడు. త్రుటిలో గున్నారావు చేతిలోకి వచ్చింది.

"ఎంతమంది నే నీ పొట్టన పెట్టుకుందామను కుంటున్నావు నేను అంత తేలిగ్గా చావనే — నిన్ను స్వామిజీనీ కలిసి చూసినప్పుడే నీ గుట్టు బయటపడింది. నీ మొగుడు నాకు నగల సంగతి తెలియును మొర్రో అని నెత్తి బాదుకున్నపుడే నీ గుట్టు బయటపడింది, నువ్వు స్వామిజీని హత్య చేస్తావా? అది పంతులుగారిమీదకు తోస్తావా! ఛీ—నీకొక జన్మేనా—ఒక ధర్మకర్త పెళ్ళాంవి. ఊరందరికీ ధర్మమార్గంలో నడిపించవలసిం దానివి నువ్వే వక్రమార్గంలో నడిచి, హత్యలు, దోపిడీలు చేస్తే, రేపు ఈ ఊరుఊరంతా ఏమయిపోవాలి? నీ సాటి ఆడవాళ్ళు తలెత్తుకు తిరగ్గలరా?" నిలదీసి అడిగాడు.

"నో....నో.... నేను హత్యలు చేయలేదు. దోపిడీలు చేయలేదు. కావాలని నా మీద నిందవేస్తున్నారు.... ఏమండీ చూస్తారేమండీ ముందు వాడ్ని పంపించండి. కావలిస్తే కోర్టుకి రమ్మనండి. వాడు నా పాలిట యముడు లాగా వున్నాడండీ!" అంటూ బెదుర్తూ ప్రాధేయ పడింది.

అప్పటికే జనం క్రింద మూగారు.

ఊళ్ళో ఒక్కొక్కరు పరుగెత్తి ఎవరో దొంగ దొరికి పోయిన అనుభూతితో క్రిందనుండి చూడసాగారు.

గున్నారావు ధనలక్ష్మిని బరబరా ఈడ్చుకొచ్చాడు.

"ఊఁ ఆ సూట్ కేసులు బద్దలుకొట్టండి!" అన్నాడు.

జనం అంతా ఒక్కుమ్మడి మూగారు.

అందర్నీ దూరంగా వుండమన్నాడు ఆదినారాయణ. అందరూ ఆత్రతగా ఎదురుచూస్తున్నారు. ఆదినారాయణ సూట్ కేసు బద్దలు కొట్టాడు.

"పరమశివా!" అన్నాడు పంతులు.

ధగధగమంటూ పార్వతీదేవి నగలు మెరుస్తున్నాయి. ఊరుఊరంతా ఆ నగల్ని పట్టిపట్టి చూడసాగారు.

"పంతులుగారూ! నగలన్నీ సరిపోయాయా? మిగిలి వున్నాయా?" గున్నారావు అడిగాడు.

"అమ్మవారి కాలుమట్టెలు, నత్తు, బేసరి, నడుంకి వడ్డాణం కనిపించడంలేదండీ!" అన్నాడు తృప్తిగా గుటకలు వేస్తూ పంతులుగారు.

"ఆ నగలూ నా దగ్గరే వున్నాయి కదరా గున్నారావూ" అంటూ సంచిలోంచి వడ్డాణం, పొట్లం విప్పి నత్తు బేసిరి మట్టెలుతీసి అమ్మవారి నగల్లో కలిపేడు—జనం అందరూ పరమేశ్వరుని, పార్వతిదేవి మహాత్యాన్ని పొగిడారు.

"మరోసారి చూడండి పంతులుగారు సరిపోయాయా?" అని అడిగాడు ఆదినారాయణ.

"సరిపోయాయి బాబూ!" అన్నాడు నమశ్శివాయ పంతులు.

"మరీ బ్రీఫ్ కేసు?" అన్నాడు గున్నారావు.

"ఈ డబ్బు నాది. ఈయండి!" అంది కంగారుగా.

గున్నారావు పగలబడి నవ్వాడు.

రాజు కూడా శృతి కలిపేడు.

ఇద్దరూ కాసేపు తృప్తిగా నవ్వుకున్నారు.

"వెల్ డన్ మిస్టర్ మోహన్ రాజ్! బాధ్యతగల

పోలీసాక్షీసరువంటే నువ్వు. భగ్న ప్రేమికుడిగా ఎంత బాగా నటించావు?" అంటూ తన ఆప్తమిత్రుడు మోహన్ రాజ్ ని అభినందించాడు.

ధనలక్ష్మి గుండాగినంత పనయింది—ప్రయత్నంమీద తేరుకుంది.

"నటించడమేవిటి—రాజూ....ఏవిటిదంతా!"

"నీ డ్యూటీ నువు చేశావు. అదే 'నగల దోపిడీ'. నగలు నిన్ను ఆకర్షించాయి. దోపిడీ చేశావ్. నువ్వు ఒక పోలీసాక్షీసర్ని ఆకర్షించావు—నీ వెంటపడ్డాను. మరి బాధ్యతగల వ్యక్తిగా గున్నారావుగారు, బాధ్యతగల పోలీసాక్షీసరుగా నేను మేము ఇద్దరం మా డ్యూటీ మేం పెర్ఫెక్టుగా నిర్వర్తించినందుకు ఈ రోజు ఎంతో తృప్తిగా వుంది. తిరిగి అమ్మవారి నగలన్నీ ఒప్పగిస్తున్నందుకూ మాకెంతో గర్వంగా వుంది" అన్నాడు ఇన్స్పెక్టర్ మోహన్ రాజు.

"రాజూ .... !" అంటూ అరిచింది ఆకాశానికి వినిపించేలా. చేతులు చాచింది. సంకెళ్ళు పడ్డాయి. జీపు వచ్చింది. అర్ధరాత్రి పన్నెండు గంటల సమయం. జనం కిటకిటలాడిపోతున్నారు. ఛీకొడుతున్నారు. మొహాన ఉమ్ముతున్నారు. జీపు కదిలింది—

"గున్నారావుగారూ! మీరు....మీరు....బాబూ.... మంచితనం మాసిపోలేదు. ఇంకా వుంది—వుంది—కాబట్టే నా తల్లి నగలు తిరిగి వచ్చాయి. ఈ నగలన్నీ అలంకరించాలి. ఇపుడే అలంకరించాలి. అవి నేను చూడాలి. దయచేసి రండి. నా కోరిక మన్నించండి" అని ప్రాధేయపడి అడిగాడు.

ఆదినారాయణ తదితర పెద్దలు నగలు గుళ్ళో చేర్చ

డానికి బయలుదేరారు.

రాత్రి ఒంటిగంటయింది.

వేదోక్తంగా మంత్రాలు చదువుతున్నాడు నమశ్శివాయ పంతులు. ఊరంతా ప్రతిధ్వనిస్తున్నాయి మంత్రాలు. నగలన్నీ అమ్మవారికి నమశ్శివాయపంతులు అలంకరించారు.

"చూశారా! తల్లి ఎంత ఆనందంగా వుందో. నా మీద పడిన నింద తొలిగిపోయింది. నాకు తృప్తిగా వుంది!" అంటూ నుదుటినిండా కుంకుమ పూసుకుని నమశ్శివాయ పంతులు పార్వతీదేవి పాదాలమీదపడి కళ్ళు మూశాడు.

—:ఐ పో యి ం ది:—

# బ్రిడ్జి మీద శవాలు

## ఎమ్.వి.వి. సత్యనారాయణ

"చెప్పండి!" అన్నాడు డిటెక్టివ్ శిరీష్ కుర్చీలో ముందుకు వాలి.

"నా పేరు రాయుడు, రాయుడూ సేవింగ్ సిండికేట్ గురించి మీరు వినే వుంటారు. ఈ అమ్మాయి నా కూతురు శ్యామల" అన్నాడు రాయుడు.

నమస్కార ప్రతి నమస్కారాలయాయి.

"మీరు వచ్చిన పనేమిటి?" అడిగాడు శిరీష్.

"మా తమ్ముడు గంగరాజును వెతికిపెట్టాలి."

"అతడి వయసు?"

"నలభై సంవత్సరాలు!"

శిరీష్ విడ్డూరంగా చూశాడు.

"కావాలని దాక్కున్నవాడిని ఎలా వెతకడం?"

"ఇల్లు వొదిలిపెట్టి పది సంవత్సరాలయింది."

"అబ్సర్డ్! పదేళ్ళనాడు కావాలని ఇంట్లోంచి పారిపోయాడు. ముప్ఫయి సంవత్సరాల యువకుడు! ఈ

పదేళ్ళా ఏం చేశారు?"

"వస్తాడని ఎదురు చూశాను."

శిరీష్ కుర్చీలో వెనక్కి వాలాడు.

"మరి ఇపుడు ఎందుకు తొందరపడుతున్నారు?"

"వాడు కలలోకి వస్తున్నాడు!"

"ఎప్పటినుండి?"

శిరీష్‌కి చిరాకుగా వుంది. తనను బయటకుపోకుండా ఫోన్ చేసి ఆపాడు రాయుడు. తాను వివరాలడగకుండా అపాయింట్ మెంట్ ఇచ్చాడు.

తీరా చూస్తే పదేళ్ళనాటి యువకుడి ఆరాటీయడం!

ఫలితం దక్కే పరిశోధన కాదు.

"నాలుగు రోజులనుండి!"

"కల గురించి పూర్తిగా చెప్పండి!"

"నేను కారులో వెళ్తోంటాను. వాడు నాకు ఎక్కడో కనిపిస్తాడు."

"అన్నయ్యా!" అంటాడు గంగరాజు.

"నేను కారు ఆపుతాను. వాడు డోర్ ప్రక్కన ఆగుతాడు. అచ్చగా వాడు ఇంట్లోంచి వెళ్ళేటప్పుడు ఎలా వున్నాడో అలాగే వుంటాడు. అవే దుస్తులు!"

"నువ్వెక్కడ వున్నావు?" అడుగుతాను నేను.

"నీ టేబులు సొరుగులో...." వాడు పారిపోతాడు.

"మెలకువ వచ్చేటప్పటికి నేను మంచం మీద వుంటాను" ఆగాడు రాయుడు.

"చిత్రంగా వుంది కల!" అన్నాడు శిరీష్.

"అవునండి. మెలకువ రాగానే నేను టేబులువద్దకు వెళ్ళాను!" రాయుడు ఆగాడు.

ఉద్రేకంతో అతడి నరాలు అదురుతున్నాయి.

మనిషి మెల్లగా వణుకుతున్నాడు.

శిరీష్ కాలింగ్ బెల్ నొక్కాడు.

సునీత కాఫీలు తెచ్చింది.

"థాంక్స్!" అన్నాడు రాయుడు. కాఫీ తాగి నిట్టూర్చాడు. జేబులోంచి సిగరెట్ పాకెట్ తీశాడు. 555 సిగరెట్స్.

శిరీష్‌కి ఆఫర్ చేయబోయాడు.

శిరీష్ తల అడ్డంగా త్రిప్పాడు.

రాయుడు సిగరెట్ ముట్టించాడు. "టేబులు సొరుగులో ఫోటోలు వున్నాయి. ఇంటి నుండి వెళ్ళిపోయినప్పటి ఫోటోలో గంగరాజు ఉన్నాడు. తర్వాతి ఫోటోలలో క్రమంగా అతడి రూపం మారివుంది."

"అంటే ఇప్పుడు గంగరాజు తిరిగివస్తే మీరు గుర్తుపట్టగలరా?"

"అవును. అతడి రూపం చాల స్పష్టంగా చూశాను!"

"ఫోటోలు తెచ్చారా?"

"ఉదయం లేచి చూస్తే ఫోటోలు లేవు!"

శిరీష్ పెదిమలు బిగించి చూశాడు. రాయుడు కథనం మొత్తంమీద విచిత్రంగా వుంది. తమ్ముడిమీది భ్రాంతితో అతడి మతి చలించి వుండాలి!

"ఫోటో లేమవుతాయి?"

"వ్చ...."

"మీరు నిద్రలేవడమూ, సొరుగు లాగి ఫోటోలు చూడటమూ కూడా కలలోని భాగాలే అయివుంటాయి!"

రాయుడు తల అడ్డంగా త్రిప్పాడు.

"ఫోటోలు చూశాక నేను సిగరెట్ కాల్చాను. అది టేబులుమీద పీకగా పడివుంది!"

"ఆ రాత్రి కాల్చిన సిగరెట్టును ఫోటోలు చూశాక కాల్చినట్టు భ్రమపడి వుంటారు!"

చంటి పిల్లాడిని చూ చి న ట్టు శిరీష్‌ను చూశాడు రాయుడు.

"ఆల్ రైట్! ఇలా ఎన్ని రోజులు జరిగింది?"

"మొ త్తం నాలుగు రోజులుగా!"

శిరీష్ అతడిని పరీక్షగా చూశాడు. తెల్లటి చలువ కళ్ళద్దాలు పెట్టుకున్నాడు. రాయుడి చూపులు నిష్కల్మషంగా వున్నాయి. అతడికి యాభై సంవత్సరాలుంటాయి. నెరిసిన ముందు జుత్తూ, చెంపలూ, కళ్ళకి చలువ కళ్ళద్దాలూ, తెల్ల కమీజూ, గ్లాస్కో పంచె, మెడలో ఉత్తరీయం....రాయుడిగారిని పెద్దమనుషుల జాబితాలో నిలబెడతాయి.

శిరీష్ నిట్టూర్చాడు.

రాయుడులాంటి పెద్దమనిషికి తనతో పనిగట్టుకుని జోక్ చేయవలసిన పనిలేదు.

"ఆల్ రైట్! మీ అమ్మాయి ఈ విషయంలో ఏమైనా చెబుతోందా?" శిరీష్ తల త్రిప్పి శ్యామలను చూశాడు.

శ్యామల తల వొంచుకుంది. "మా నాన్నగారు చెప్పిన విషయాలు నాలుగు రోజులుగా వారి నోట వింటోన్న విషయాలే! అవి కేవలం భ్రమపడి చెప్పే విషయాలు మాత్రంగావు!"

"మీతోబాటు ఇంట్లో వుండేది ఇంకా ఎవరు?"

"చెల్లెలు భాగ్యలక్ష్మి!" రాయుడు కళ్ళు తుడుచుకున్నాడు "ఆమె బాల వి త ం తు వు. నా దగ్గరే వుంటోంది!"

"అంటే గంగరాజు తర్వాత పుట్టిన అమ్మాయా?"

"అవును. ఆమెకు 38 సంవత్సరాలుంటాయి."

"మీ తమ్ముడిని వెతికి మీకు ఒప్పగిస్తే ఏంచేస్తారు?"

"నాతో సమానంగా చూసుకుంటాను! ఆస్తి పంచుతాను?"

డిటెక్టివ్ శిరీష్ తల వంకించాడు.

రాయుడు తన కమీజు జేబులోంచి చెక్కు బుక్ తీశాడు.

"అంకె ఎంత వేయమంటారు?"

"పదివేలు!"

"థాంక్యూ" చెక్కు నింపబోయాడు రాయుడు.

"గంగరాజును వొప్పగించలేకపోతే.... ఖర్చులుపోను మిగతా సొమ్ము రిటర్న్ చేస్తాను."

"సొమ్ము రిటర్న్ చేయవద్దు. ఇంతకాలం ఆగి ఇప్పట్లోనే నాకు ఆ కల రావడంలో అర్థం ఏమిటి? సందేహం తీర్చడానికి ప్రయత్నించండి చాలును!"

శిరీష్ తండ్రీ కూతుళ్ళ మొహాల్లోకి చూడసాగాడు.

## 2

గిరిజా ఆటోమొబైల్ షాపు ముందు ఆగాడు డిటెక్టివ్ శిరీష్.

గంగరాజు బయటకు వెళ్ళిపోయేముందు ఈ షాపులో పనిచేసేవాడట.

అప్పట్లో రాయుడికి ఇంత పరపతీ, ఇంత ఆస్తీలేవు.

అన్నదమ్ములు ఎవరి సంపాదనను వాళ్ళు ఖర్చుపెట్టుకునేవారు.

భాగ్యలక్ష్మి అప్పటికే వితంతువుగా రాయుడివద్దకు చేరింది.

శ్యామలకు అప్పటికి పదేళ్ళు!

ఈ వివరాలు రాయుడు రాసిచ్చాడు.

శిరీష్ తల పంకించాడు. ఆటో మొబైల్ షాపులో ప్రవేశించాడు.

మేనేజర్ సగౌరవంగా ఆహ్వానించాడు.

పరిచయాలయ్యాయి.

"పది సంవత్సరాల క్రితం మీ షాపులో పని చేసిన వ్యక్తి గురించి వివరాలు కావాలి?" అన్నాడు శిరీష్.

మేనేజర్ తెల్లబోయాడు.

"ఎవరా వ్యక్తి."

"గంగరాజు."

"ఏం పని చేసేవాడు?"

"సేల్స్‌మాన్."

"సారీ సర్ గుర్తులేదు."

"రాయుడిగారి తమ్ముడు...."

మేనేజర్ ఆలోచనలోపడ్డాడు. స్టూలు ఎక్కి బీరువా మీది పాత కట్టలు దింపాడు.

వర్కర్ల జీతాల రిజిష్టరు!

నల్లగా మాసిబారిన రిజిష్టర్ తీశాడు మేనేజర్.

ఇరవై నిముషాలుగా దానితో కుస్తీపట్టాడు.

"ఎస్ గంగరాజు—వయసు 20. చేరిన అయిదేళ్ళ రెండు నెలలకు పని మానేశాడు.

"కారణం ఏం రాశారో తెలుస్తుందా?"

"స్వయం వుపాధి పథకం క్రింద కిళ్ళీకొట్టు పెట్టు కుంటానని మానేశాడు."

"ఎక్కడ పెట్టాడో...."

మేనేజర్ పెదివు విరిచాడు.

శిరీష్ వివరాలు నోట్ చేసుకున్నాడు. అతడికి కృతజ్ఞతలు చెప్పుకున్నాడు. షాపులోంచి బయటకు నడిచాడు.

రోడ్డు ప్రక్కనే వున్న పబ్లిక్ టెలిఫోన్ బూత్‌లో ప్రవేశించాడు.

రాయుడికి టెలఫోన్ చేశాడు.

"సారీ, నాకు తెలియదు. వాడు పదేళ్ళ క్రితంవరకూ అదే షాపులో పనిచేసినట్టు నా వూహ."

"అతడి వస్తువులు ఏమైనా ఇంట్లో వున్నాయా?"

"వున్నాయి. స్టోర్ రూంలో పెట్టినట్టు గురు."

"ఆల్ రైట్! ఇంటికి వస్తున్నాను!" శిరీష్ రిసీవర్ పెట్టేసి బయటకు నడిచాడు.

డాట్సన్ కారు బయలుదేరతీశాడు.

సాయంకాలంవరకూ శిరీష్ స్టోర్ రూంలో గడిపాడు.

గంగరాజు వివరాలు చాలా తెలిశాయి.

అతడు ఇంటినుండి వెళ్ళిపోయే సమయానికి నాలుగు వేల రూపాయలు ప్రోగుచేసుకున్నాడు. అతడి ట్రంకు పెట్టెలో మునిసిపాలిటీ రసీదులున్నాయి.

శిరీష్ వాటిని వరసపెట్టి పరిశీలించాడు.

నాలుగేళ్ళపాటు కిళ్ళీబడ్డీ నడిపాడు.

రాయుడికి తెలియకుండా అంతకాలం ఎలా నడిపాడో చివరకు కిళ్ళీకొట్టు అమ్మేశాడు.

అడ్రసు చూశాడు శిరీష్. కొత్తగా ఎవరో కొనుక్కున్నారు.

పావు గంటలో అతడిని కలిశాడు.

కిళ్ళీకొట్టును గంగరాజు వద్ద కొన్న వ్యక్తి ఏమీ చెప్పలేకపోయాడు.

"విజయవాడ వెళ్ళివుంటాడు సార్!" అన్నాడతను.

గంగరాజు చాలా రోజులుగా విజయవాడ వెళ్ళనున్నట్టు చెప్పేవాడట.

శిరీష్ వెనక్కి తిరిగివచ్చి రాయుడిని కలిశాడు.

## 3

టెలిఫోన్ గణగణలాడింది.

డిటెక్టివ్ శిరీష్ రిసీవర్ ఎత్తాడు.

అవతల రాయుడు!

"మీరొకసారి మా ఇంటికి రావాలి!" అన్నాడు రాయుడు.

"ఎందుకు?"

"మా తోటలో సిగరెట్ పీకలు కనిపించాయి."

"మీరు కాల్చినవా?"

"కాదు. నేను తోటలో తిరిగి చాల కాలమయింది. ఆ సిగరెట్ పీకలు తాజావి."

"అంటే మీరు కాల్చే 555 బ్రాండ్ సిగరెట్లన్న మాట!"

"అవును."

"మీరే ఏ నిద్రలోనో తోటలో సిగరెట్లు కాల్చి వుంటారు."

"అవి నేను కాల్చినవి కావు."

"ఎలా చెప్పగలరు?"

"నేను సిగరెట్ పీకను కిందపడవేసి కాలితో నలుపుతాను. తోటలో వున్న పీకలు నలిగిలేవు."

"ఆల్ రైట్....వస్తున్నాను!"

పావు గంటలో శిరీష్ అతడి ముందున్నాడు.

చెట్టు క్రింద సిగరెట్ పీకలు తాజావి. మొత్తం అయిదు పీకలు!

"ఎవరో చాలాసేపు వెయిట్ చేశారు!" అన్నాడు శిరీష్.

రాయుడు భయంగా చూశాడు. "అంతేకాదు శిరీష్ గారూ! నా గదిలో టేబులుమీద సిగరెట్టు మసి పడి వుంది. అంటే ఎవరో నా గదిలో తారట్లాడారు."

"రాత్రి కూడా ఫోటోలు కనిపించాయా?"

"ఆఁ! మామూలుగా. అది మాత్రం కలకాదు శిరీష్ గారూ!" చాల స్పష్టంగా తెలుసు.

శిరీష్ మేడమీది గదిలోకి నడిచాడు.

రాయుడు గది చక్కటి వెంటిలేషన్ సౌకర్యం వున్న గది!

గదిలో పాతకాలంనాటి పందిరి మంచం, డ్రెస్సింగ్ టేబులూ వున్నాయి. గదిలో ఒక ప్రక్క రాత బల్ల వుంది.

రాయుడు కదిలాడు. రాతబల్ల సొరుగు తెరిచాడు.

"ఈ సొరుగులోనే ఫోటోలు చూశాను" అంటూ బల్లమీద వ్రేలితో చూపించాడు.

సిగరెట్టు మసి!

శ్యామల కాఫీలతో వచ్చింది.

"నువ్వేం చెబుతావు శ్యామలా?" అడిగాడు శిరీష్.

"రాత్రి నాకు ఏ రెండు గంటలకో మెలుకువచ్చినట్టుంది. తోటలో ఎవరో కదులుతోన్నట్టూ, ఆకుల మీదా ఎండుపుల్లలమీద అడుగులు వేసినట్టూ చప్పుళ్ళు వచ్చాయి" అంది శ్యామల.

"లేచి తోటలోకి చూశావా?"

"లేను, భయంవేసింది!"

శిరీష్ ఆలోచనలో పడ్డాడు.

"రాయుడు గారూ! మీరు స్లీప్ వాకర్!"

రాయుడు విద్రూరంగా చూశాడు.

"రాత్రి మీరే సిగరెట్ పీల్చుతూ తోటలో తిరిగారు. మీ తమ్ముడు మీది భ్రాంతి మిమ్మల్ని మానసిక స్థిరత్వం తప్పినవాళ్ళుగా మార్చుతోంది."

శిరీష్ తన పాంటు జేబులోంచి చెక్కు బుక్ తీశాడు.

చకచక ఎనిమిదివేల రూపాయలకు చెక్కు రాశాడు.

"శిరీష్‌గారూ! ఏమిటిది?" అరిచినంత పని చేశాడు రాయుడు.

"నాకు ఖర్చులు మినహా మిగతా సొమ్ము రిటర్న్ చేస్తాను."

"ఏం?"

"మీ తమ్ముడు మనసుపడినప్పుడు ఆయనే యింటికి రాగలడు?"

"అయితే డబ్బు రిటర్న్ చేయడం దేనికి?"

తోటమాలి పరుగెత్తుకు వచ్చాడు.

"ఎవరో త్యాగరాజుగారట అయ్యగారూ! మీ కోసం వచ్చారు!" అన్నాడు తోటమాలి.

"గంగరాజు కాదు — త్యాగరాజు" శిరీష్ తలపంకించాడు.

"మీరు డబ్బు రిటర్న్ చేయవద్దు. ప్లీజ్...."

రాయుడు అతడి చేతులు పట్టుకున్నాడు.

డిటెక్టివ్ శిరీష్ అంగీకారంగా తలూపి చెక్కు జేబులో పెట్టుకున్నాడు.

రాయుడివద్ద సెలవు పుచ్చుకుని బయటకు నడిచాడు.

రాయుడు డ్రాయింగ్ రూంవైపు కదిలాడు.

సోఫాలో కూర్చున్న వ్యక్తి మందహాసం చేశాడు.

"రాయుడుగారూ! గంగరాజు కోసం మీరు గంగ వెర్రులెత్తినట్టు నాకు తెలుసు!" అన్నాడు అతడు.

రాయుడు విడ్డూరంగా చూశాడు.

అతడి మొహంలో వింత ఆకర్షణ.

ఆజ్ఞాపించే కళ్లు!

శరీరమంతా వింతగా అధికారం వున్న ధోరణి!

రాయుడు అతడి కళ్ళలోకి చూస్తూ ఉండిపోయాడు.

"డ్రాయింగ్ రూం తలుపులు మూయగలరు!"

రాయుడు నిద్రలో నడుస్తోన్నట్టు తలుపులవైపు కదిలాడు.

## 4

శ్యామల తన గదిలోంచి బయటకు నడిచింది. డ్రాయింగ్ రూం వైపు చూచింది.

తన తండ్రి కొత్త వ్యక్తితో మాట్లాడుతూ తలుపు మూశాడు.

అతదెవరు?

అతడికీ తన తండ్రికీ పరిచయం ఏమిటి?

వాళ్ళిద్దరికీ మధ్య అంత దాపరికాలు ఏమున్నాయి?

ఇద్దరూ గంటనుండి గుసగుసలాడుకుంటున్నారు.

నిముషాలు గడుస్తున్నాయి. అరగంట అయింది.

శ్యామల ఉత్సుకత ఆపుకోలేకపోయింది.

డ్రాయింగ్ రూంవైపు వెళ్ళింది.

అకస్మాత్తుగా తలుపులు తెరుచుకున్నాయి. తన తండ్రి.

ఆయన ఒక్కడే వున్నాడు గదిలో.

కొత్త వ్యక్తి ఏమయాడు?

ఆ దేమిటి? తన తండ్రి కళ్ళు అరమూశాడు.

ఎవరో నడిపిస్తోన్నట్టుగా నడుస్తున్నాడు. ఆయన చూపులు ఎటూ కేంద్రీకరించ లేవు.

పోర్టికో వైపు వెళుతున్నాడు తండ్రి. కారును సమీపించాడు. డోర్ తెరిచాడు. డ్రయివింగ్ సీటుముందు కూర్చున్నాడు.

శ్యామల వులిక్కిపడింది.

తన తండ్రి ఈ నిద్రా స్థితిలో కారు డ్రయివ్ చేస్తాడా!

ప్రమాదం!

శ్యామల ముందుకు పరుగెత్తింది.

రాయుడు క్లచ్ నొక్కాడు. సర్రున వీల్ త్రిప్పాడు. కారు పోర్టికోలోంచి వురికింది.

గేటు మూసివుంది.

రాయుడు కారు ఆపి హారన్ కొట్టాడు.

తోటమాలి పరిగెత్తుకు వచ్చి గేటు తెరిచాడు.

కారు రోడ్డుమీదకు వురికింది. మెయిన్ రోడ్డులోకి మళ్ళింది.

"అ త్తయ్యా!" గావుకేక పెట్టింది శ్యామల.

ప్రక్క గదిలోంచి భాగ్యలక్ష్మి పరుగెత్తుకు వచ్చింది.

"శ్యామూ....ఏమయింది?" అడిగింది భాగ్యలక్ష్మి.

"అ త్తయ్యా.... నాన్నగారు ....కళ్ళు మూసుకుని కారు నడుపుతున్నారు. ప్రమాదం!" అరుస్తోంది శ్యామల.

"ఆపలేకపోయావా శ్యామూ....?"

"ప్రయత్నించాను .... అప్పటికే నాన్నగారు కారు స్టారుచేశారు. తెలివి వున్నట్టు గేటు దగ్గర ఆపి హారన్ కొట్టారు."

"ఇందాక శిరీష్‌గారు స్లీప్ వాకింగ్ అన్నారు.... ఇదేనేమో...."

"ఏదో అయింది అత్తయ్యా! అన్నట్టు నాన్నగారి కోసం వచ్చిన వ్యక్తి ఎక్కడ?"

"అతడు చాలాసేపయింది వెళ్ళిపోయి!"

"అరె! నేను చూడలేదు!" శ్యామల టెలిఫోన్ వైపు పరిగెత్తింది. రిసీవర్ ఎత్తింది.

చకచక నంబర్ డయల్ చేసింది.

"డిటెక్టివ్ శిరీష్ హియర్!" అవతల వినిపించింది.

# 5

నగరం వెలుపలకు వచ్చింది కారు.

చుట్టూ పచ్చటి ప్రకృతి! కనుల పండుగ చేసే దృశ్యాలు! కారు అప్ ఎక్కుతోంది. రాయుడు కళ్ళు అరమూతలు పడివున్నాయి. స్టీరింగ్ వీల్ చకచక అతడి చేతులలో తిరుగుతోంది.

కారు బ్రిడ్జి ఎక్కింది. రోడ్డు ప్రక్కన పిట్టగోడ. మలుపులో ఆగింది.

విజయవాడ 300 కి.మీ.

రాయుడు కి.మీ. రాయివైపు దీక్షగా చూడసాగాడు.

కి.మీ. రాయి ప్రక్కగా ఎవరో నిలబడి వున్నారు. అతడికి డెభ్భై సంవత్సరాల పైబడిన వయసు వుంటుంది.

పాతకాలంనాటి దుస్తులు! అక్కడక్కడా చిరిగి వున్నాయి.

రిసీవర్ అందుకుంది.

"రవీ!" అంది శ్యామల.

"తయారవుతున్నావా?" అడిగాడు రవిశంకర్.

"సారీ, రవీ! రాలేను."

"ఏం?"

"వొంట్లో కాస్త నలతగా వుంది!"

"నలతగా వుందా? ఏం? డాక్టర్‌కి చూపించావా?"

"మామూలు నలతే! రాత్రి నిద్రపట్టలేదు!"

"అదే ఎందుకట? రాత్రి భోజనం చేసివుండవ్!"

"అదేం కాదు. సుష్ఠుగా తిన్నాను. నాకు ఇష్టమైన గుత్తివంకాయ కూర!"

"డాక్టర్ దగ్గరకు వెళ్దాం సిద్ధంగా వుండు."

"నీకు చెప్పడం పొరపాటయింది!"

"ఏం?"

"ఈ మాత్రానికి డాక్టర్ ఎందుకు?"

"ఏడిశావ్....నీకు తెలియదు....వస్తాను. అన్నట్టు ఇందాక ఫోన్‌లో మాట్లాడిందెవరు?"

"మా బాబాయి నిన్ననే వచ్చారు!"

"వెరీగుడ్! కలుస్తాను కదా! పరిచయంలేదు."

"అలాగే...."

"అయిదు నిమిషాలలో వస్తాను" అవతల క్లిక్‌మంది. శ్యామల రిసీవర్ క్రెడిల్ చేసింది.

"ఎవరమ్మా రవిశంకర్?" అడిగాడు గంగరాజు.

శ్యామల బుగ్గలు ఎర్రబడ్డాయి.

"అర్థమయింది తల్లీ! నాన్నకి తెలుసా?"

"తెలుసు బాబాయ్! వచ్చే శ్రావణంలో పెళ్ళి చేయాలని అనేవారు!"

గంగరాజు కళ్ళు మెరిశాయి.

"చాల సంతోషం తల్లీ!"

"రా బాబాయ్....భోజనం చేద్దాం!"

గంగరాజు తలూపి లేచి నిలబడ్డాడు. ఇద్దరూ

వంటింట్లోకి నడిచారు.

టేబులుమీద మూడు కంచాలు సర్దింది భాగ్యలక్ష్మి.

"మరో కంచం పెట్టు అత్తయ్యా! రవి వస్తున్నాడు" అంది శ్యామల. వడ్డన పూర్తయ్యేసరికి రవిశంకర్ వచ్చాడు.

అతడిని గంగరాజుకు పరిచయం చేసింది శ్యామల.

భోజనాల మీదక శ్యామల అతడితో బయలుదేరింది.

రవిశంకర్ కారు డ్రయివ్ చేశాడు.

"నిద్రపట్టక పోవడానికి ఏమిటి కారణం—విరహం కాదు గదా!" నవ్వాడు శంకర్.

అతడి చేతిని గిల్లింది శ్యామల.

"డాక్టర్ శివరాం దగ్గరకు వెళ్దామా? కృష్ణయ్య దగ్గరకు వెళ్దామా?" అడిగాడు రవిశంకర్.

"శివరాం దగ్గిరికే?"

"అదేమిటి? మా ఫామిలీ డాక్టర్ దగ్గరికా? నువు ఎప్పుడూ రానంటావ్?"

"మా ఫామిలీ డాక్టర్ దగ్గరయితే బ్రిడ్డి వాటాలి. అటు వెళ్ళలేను."

"కాలగతిలో ఎన్నో సంఘటనలు జరుగుతాయి. హితవు కాని సంఘటనలు మరచిపోవాలి!"

"ఎలా మర్చిపోగలను?"

కారు మెయిన్ రోడ్డులో పరుగెత్తుతోంది.

డాబా యింటిముందు ఆగింది.

డాక్టర్ ఖాళీగానే దొరికాడు.

శ్యామలను పరీక్ష చేశాడు.

"ఆరోగ్యంలో లోపం లేదు శ్యామలా! మనసులో దిగులు పెట్టుకోవద్దు" అన్నాడు డా॥ శివరాం.

"రాత్రంతా నిద్రలేదు డాక్టర్ గారూ! పాడి కళ్లు పడ్డాయి!"

డాక్టర్ శివరాం తలపంకించాడు.

"ఆకలి బాగా వుందా?"

"వుంది."

"అయితే నాలుగు రోజులపాటు నిద్ర మాత్రలు యిస్తాను!"

"అమ్మో.... అలవాటయితే...."

"కాంపోజ్ మాత్రలు ఇస్తాను. నిద్రవేళకి ఒకటి వేసుకో. ఈ మాత్రలు అలవాటు కావు. సహజ నిద్రను పాడు చేయవు."

శ్యామల తలూపింది.

తిరుగు ప్రయాణంలో ఆమె నిట్టూర్చింది.

"ఇంతా చూస్తే కాంపోజ్ మాత్రలు నాలుగు ఇచ్చారు!" అంది.

రవిశంకర్ నవ్వాడు. "అంటే పని వున్నా లేక పోయినా ఇంజక్షన్ చేయవలసిందన్నమాట!"

శ్యామల కూడా నవ్వి వూరుకుంది.

రవిశంకర్ రోడ్డుమీదకు చూశాడు.

డాట్సన్ కారులోంచి ఎవరో చెయ్యి వూపు తున్నారు.

రవిశంకర్ కారు ఆపాడు. డాట్సన్‌లోంచి శిరీష్ దిగాడు.

శిరీష్ కారును సమీపించాడు.

"మీరా?" ఆశ్చర్యంగా అడిగాడు రవిశంకర్.

"ఇంతకాలమయింది. నా కారునే గుర్తుపట్టలేవా?" నవ్వాడు శిరీష్.

శ్యామల కారు దిగి విష్ చేసింది.

"త్యాగరాజు ఆచూకీ తెలియలేదు!" అన్నాడు శరీఫ్.

# 8

చీకటి పడుతోంది.

గంగరాజు ఇంట్లోంచి బయటపడ్డాడు. కనుచీకటిగా వుండే ప్రాంతాల్లో నడవసాగాడు. తనని ఎవరూ అనుసరించడంలేదని నమ్మకం కలిగింది.

సెంటర్లో ఆగాడు.

సైకిల్ రిక్షా బేరమాడుకున్నాడు. రిక్షా మార్కెట్ వైపు కదిలింది.

రిక్షాను కొంత దూరంలో సైకిల్ వెంటాడుతోంది. డిటెక్టివ్ శరీఫ్ సైకిల్ తొక్కుతున్నాడు.

రిక్షాలో వున్న గంగరాజుకు అనుమానం రాకుండా సైకిలు వెంటాడుతోంది.

శరీఫ్‌ను ఎవరూ డిటెక్టివ్ అనుకోరు.

పంచెకట్టి హాఫ్ చేతుల చొక్కా వేశాడు. తలకి పాగా చుట్టుకున్నాడు. మెడలో తావీదు. సైకిలుకు పాలబిందె కట్టుకున్నాడు.

రిక్షా బార్ ముందాగింది.

గంగరాజు రిక్షా దిగాడు. బాడుగ చెల్లించాడు. బార్‌లోకి నడిచాడు.

బార్ ఎదుట పార్కు వుంది.

పార్కులో సైకిలు ఆపాడు శరీఫ్.

బార్ వైపే చూడసాగాడు.

గంగరాజు టేబులుముందు కూర్చున్నాడు. ఏవో పానీయాలు తెప్పించుకు త్రాగుతున్నాడు.

గంట గడిచింది.

అతడిని కలుసుకోవడానికి ఎవరూ రాలేదు.

అతడు కూడా ఎవరికోసమూ ఎదురు చూడలేదు.

తనకేం పట్టనట్టు తాగుతున్నాడు.

బిల్లు చెల్లించి బయటకు వచ్చాడు. తిరిగి ఏదో రిక్షా మాట్లాడుకున్నాడు.

శిరీష్ చటుక్కున రిక్షా వెనక్కి చేరాడు.

"రాయుడిగారి యింటికి!" అన్నాడు గంగరాజు.

రిక్షా కదిలింది.

శిరీష్ నిట్టూర్చి సైకిలువైపు నడిచాడు.

గంగరాజు భవనంలోకి నడిచాడు. జేబులోంచి సిగరెట్ పాకెట్ తీశాడు. సిగరెట్టు వెలిగించుకున్నాడు.

"శ్యా....మ....లా...." పిలిచాడు గంగరాజు.

శ్యామల తన గదిలోంచి పరుగెత్తుకు వచ్చింది.

"ఇంకా నిద్రపోలేదా?" అడిగాడు గంగరాజు.

శ్యామల ముక్కు మూసుకుంది. గుప్‌మని వాసన!

"సారీ శ్యామలా! సారీ .... నువ్వు .... సారీ...." గంగరాజు తన నోటికి అడ్డం పెట్టుకుని తన గదివైపు కదిలాడు.

"బాబాయ్...త్రాగి వచ్చావా?" శ్యామల గొంతులో దుఃఖం.

"అన్నయ్య గుర్తొస్తున్నాడు! శ్యామలా .... పాపిష్టి వాడ్ని" ఏడుస్తున్నాడు గంగరాజు.

శ్యామల నిట్టూర్చింది.

"ఏం తల్లీ! నిద్రపోలేదా?"

"నిద్రపోతాను బాబాయ్!"

"నిద్రపట్టడం లేదా తల్లీ!"

"లేదు బాబాయ్!"

"కాంపోజ్ వేసుకుంటున్నావా?"

"వేసుకున్నా సరే...."

"అరె....నిద్ర పట్టాలమ్మా!"

"నా అదృష్టం!" శ్యామల గొంతు వణికింది.

గంగరాజు తూలుతూ తన గదివైపు వెళ్ళాడు.

# 9

"శ్యామలా! నీతో ఒక విషయం మాట్లాడాలి!"

"చెప్పు అత్తయ్యా, ఏమిటా విషయం?"

"రవిశంకర్‌తో నువ్వు అంత చనువుగా తిరగకూడదు."

"అత్తయ్యా! పెళ్ళి చేసుకుంటాంగదా!"

"పెళ్ళి చేసుకో ఆలస్యం దేనికి?"

"శ్రావణం ఇంకా దూరం వుంది గదా!"

"నాన్న ఎటూ లేరు. ముహూర్తం కోసం పట్టింపు ఎవరికి వుంటుంది? బాబాయికి ముహూర్తం పట్టింపులు లేవు!"

"అప్పుడే పెళ్ళి ఏమిటిలే అత్తయ్యా!"

"అయితే అతడితో అంతవరకూ తిరగక!"

గుమ్మంలో చప్పుడయింది. రవిశంకర్ లోపలకు వస్తూ కనిపించాడు.

"పిన్నిగారేమిటో వుపదేశిస్తున్నారు!" అన్నాడు.

భాగ్యలక్ష్మి చటుక్కున లేచింది.

"పెళ్ళయేవరకూ మనిద్దరినీ ఎడంగా వుండమంటోంది" అంది శ్యామల.

"ఏనాటివో కబుర్లు చెబుతారు పిన్నిగారు!"

"అంటే!" తెల్లబోయింది భాగ్యలక్ష్మి.

రవిశంకర్ తనతో ఎన్నడూ ఇంత వ్యంగ్యంగా మాట్లాడలేదు. ఆమె మొహం ఎర్రబడింది.

శ్యామల కూడా తెల్లబోయింది.

"రవీ!" అంది.

"అవును శ్యామలా! ఇదే ప్రసక్తి మా ఇంట్లోనూ తెచ్చారు. మనకి మన హద్దులు తెలుసు. చుట్టూ చూసే వాళ్ళు గిరులు గీస్తున్నారు."

"మీ హద్దులు తెలిసినప్పుడు పెళ్ళి చేసుకోవడానికి ఏం అభ్యంతరం?" తీవ్రంగా అంది భాగ్యలక్ష్మి.

"ఆల్ రైట్! నేను రెడీ!" అరిచాడు రవిశంకర్.

"నేనూ రెడీయే, కాని.... నాన్నగారు పోయి ఇంకా పదిహేను రోజులు కాలేదు."

"అయితే ఏం తల్లీ!"

ముగ్గురూ ఆశ్చర్యంగా గుమ్మంలోకి చూశారు.

గంగరాజు గుమ్మంలో నిలబడే మాట్లాడుతున్నాడు. "మీ యిద్దరి పెళ్ళి నాన్నకు ఇష్టమేకదా! నేను పెళ్ళి పెద్దను. ఏర్పాట్లు చూస్తాను."

"ఈ స్థితిలోనా?" అంది శ్యామల. "నాకు నిద్ర పట్టడంలేదు. చిక్కి సగం అయాను."

"నిద్ర మాత్రలు వాడటం లేదా?" అడిగాడు గంగరాజు.

"రోజుకు రెండు మాత్రలు!"

"నీమీద నిద్ర మాత్రలు పని చేయవు!"

"అదేమిటి? వాటికూడా భేదాలు పాటించే శక్తి వుందా?"

"కొంతమంది శరీర స్థితి మాత్రకి లొంగుతుంది. కొంతమంది శరీర స్థితి వ్యతిరేకిస్తుంది!"

"అయితే నాకు నిద్రపట్టదా?"

గంగరాజు ఆలోచనలో పడ్డాడు.

"నాకు నిద్రపట్టి ఎంతో కాలమయింది!" విచారిస్తోంది శ్యామల.

"నాకూడా నా గదిలోకి రా" కదిలాడు గంగరాజు.

శ్యామల లేచింది. గంగరాజు వెంట కదిలింది.

ఇద్దరూ గంగరాజు గదిలోకి ప్రవేశించారు. తలుపులు మూతపడ్డాయి.

భాగ్యలక్ష్మి, రవీ మొహాలు చూసుకున్నారు.

# 10

గదిలో ఎర్రలైటు వెలుగుతోంది.

"శ్యామలా!" అధికారపూర్వమైన గొంతు వినిపించింది.

శ్యామల అటు చూచింది. ఆమె తలకు వైర్లు తగిలించి వున్నాయి. ఎర్రటి లైటుకు దిగువగా నిలబడిన అతడి మొహం ఆకర్షణీయంగా వుంది. అతడి కళ్ళు ఆజ్ఞాపించేటట్టు స్ఫుటంగా వున్నాయి. శరీరంలో అధికారం వున్న హొయలు.

"నువ్వు కొంతకాలంగా నిద్రపోవడం లేదు. అవునా?" అడిగాడు అతడు.

శ్యామల రెప్పలాడించింది.

అవును అంటే రెప్పలాడించాలి.

కాదంటే అలాగే చూస్తోండాలి.

ఈ సిగ్నల్స్ అతడే చెప్పాడు.

"కారణం నీకు తెలుసా?"

శ్యామల అలాగే చూస్తోంది.

"నీకు కిలోమీటర్ రాయి కనిపిస్తోంది. అవునా?"

"............"

"నీకు కళ్ళు మూసినా తెరచినా కిలోమీటర్ రాయి

కనిపిస్తోంది. అక్కడే నీ తండ్రి మరణించాడు. ఆతడి ఆత్మ అక్కడే ఘోషిస్తోంది. నిన్ను చూడటానికి రమ్మంటోంది—నీ తండ్రి ఆత్మను రాతి ప్రక్కనే చూశావా?"

"నీవు పోయివుంటే ఆత్మ కనిపించేది. ఆత్మను చూడబోయి నువు నిద్ర మానావు. ఈ రాత్రికి నిద్ర పోతావు. కిలోమీటర్ రాయి కనిపిస్తుంది.

విజయవాడ 300 కి.మీ.

పసుపుపచ్చ రంగు పులిమిన రాయి నీకు కనిపించి తీరాలి. దాని ప్రక్కనే నీ తండ్రి ఆత్మ....కారులో వెళ్ళేటప్పుడు ఏ బట్టలు వేసుకున్నాడో ఆ బట్టలతో.... నువు నా మాటను కాదనలేవు. ఆత్మను చూచితీరుతావు. నీ మనసు నా స్వాధీనంలో వుంది. నేను, ఆజ్ఞాపిస్తాను.

ఈ రాత్రికి నీ కళ్ళు మూతలుపడతాయి. కనురెప్పలు బరువుగా అవుతాయి. నిద్రపోకుండా తప్పించుకోలేవు. సొంత ఆలోచన రానివ్వవు. నీకు ప్రియమైనవాడు మీ నాన్న...."

అతడి వుపన్యాసం ధారా ప్రవాహంలాగా సాగిపోతోంది.

శ్యామలకు వినేకొద్దీ వినాలనిపిస్తోంది. అతడి మాటలు తేనెలూరుతున్నాయి, కళ్ళు కాసిస్తున్నాయి.

"కళ్ళు మూసుకో....కుర్చీలోనే నిద్రపో...." అతడు ఆదేశిస్తున్నాడో, బతిమాలుతున్నాడో .... శ్యామలకు మగతగా వుంది.

రెప్పలు బరువెక్కసాగాయి.

"గంగరాజు కూడా వెళ్తావు. అతడు చెప్పినట్టు వింటావు...."

శ్యామల నిద్రలో పడింది.

డిటెక్టివ్ శరీష్, అతడి మొహంలోకి చూశాడు.

"శ్యామల గంగరాజుతో వెళ్ళిందా?" ఎక్కడకు?"
అడిగాడు శరీష్.

రవిశంకర్ సిగ్గుగా చూశాడు. "ఇద్దరూ కారులో వెళ్ళారు. అక్కడే వున్నాం నేనూ, భాగ్యలక్ష్మి. వాళ్ళు కన్నెత్తి అయినా చూడలేదు."

"అంతేకాదు, శరీష్‌గారూ! అన్నయ్య చేతిలో కెమెరా వుంది."

"ఆయనదా కెమేరా?"

"కాదు. రాయుడు అన్నయ్యది."

"కెమెరాతో బయలుదేరారంటే ప్రకృతి దృశ్యాల కోసం."

"మాకు చెప్పవచ్చు కదా!"

"అవును. చెప్పి బయలుదేరవచ్చు. ఇందులో పెద్ద రహస్యం దేనికి?"

"ఎటు వెళ్ళారు?"

"మే ఫెయిర్ జంక్షన్ వైపు."

శరీష్ లేచాడు.

"నేనూ రానా?" అడిగాడు రవిశంకర్.

శరీష్ తలూపాడు.

ఇద్దరూ డాట్సన్‌లో బయలుదేరారు.

"గంగరాజు తీసుకువెళ్ళిన కెమెరా ఎటువంటిది?" అడిగాడు శరీష్.

"ఆటోమాటిక్. అప్పటికప్పుడు కలర్ పాజిటివ్స్ ఇస్తుంది!"

డిటెక్టివ్ శరీష్ ఆలోచనలో పడ్డాడు.

గంగరాజు పదేళ్ళుగా మాయమయ్యాడు. అన్న మర ణించిన మూడురోజులకు ప్రత్యక్షమయ్యాడు. ఇంతకాలం లేని ప్రేమ ఎలా పుట్టుకొచ్చింది?

పైగా గంగరాజు గురించి రాయుడుకు కలవచ్చేది. అతడు ఇంటినుండి మాయమయ్యేటప్పుడు ఏ వేషంతో వున్నవాడు ఆ వేషంతోనే కొన్ని ఫోటోలలోనూ, ప్రస్తుతం వున్నట్టుగా కొన్ని ఫోటోలలోనూ కని పించాడట గంగరాజు.

అలా ఎందుకు జరిగింది? ఎలా జరిగింది?

రాయుడు తోటలో సిగరెట్టు పీకలు చూశాడు. అది అతడు కాల్చినవేనని తాను అనుమానపడ్డాడు. గంగరాజు కాల్చే సిగరెట్లు కూడా 555 బ్రాండ్ వే! ఎక్కడబడితే అక్కడ సిగరెట్టు కాల్చే అలవాటు గంగరాజుకే వుంది.

శిరీష్‌కి మరో విషయం గుర్తొచ్చింది.

గంగరాజు వచ్చిన రోజునుండే శ్యామల నిద్ర పోవడంలేదు.

డాట్సన్ కారు బ్రిడ్జిమీద పరుగులు పెడుతోంది.

శిరీష్ చూపు నిలిచిపోయింది.

విజయవాడ 300 కి.మీ రాయివద్ద గంగరాజు నిల బడ్డాడు. అతడు చకచక ఫోటో తీస్తున్నాడు. పల్లంవైపు తిరిగి వున్నాడు.

శిరీష్ చుట్టూ చూశాడు.

శ్యామల కారులో కూర్చుని వుంది. గంగరాజు నిర్లిప్తంగా ఫోటోలు తీయసాగాడు.

## 12

శ్యామలకు కనురెప్పలు బరువెక్కుతోన్నాయి. చాల రోజులుగా లేని నిద్ర కళ్ళమీదకు వచ్చి పడుతోంది.

తన గదిలోకి నడచివెళ్ళి దబ్బున పడుకున్నది.

ఎలా పడింది అలాగే నిద్రపోయింది. గాఢనిద్ర!

గదిలో చీకటి.

శ్యామల నిశ్చింతగా నిద్రపోతోంది.

నిద్రలో దృశ్యం కదులుతోంది. చుట్టూ పచ్చటి ప్రకృతి.

విజయవాడ 300 కి.మీ.

శ్యామల కిలోమీటర్ రాతినే చూస్తోంది. అదే రాయి. తన తండ్రితో కలసి చూచింది తాను. అప్పటికీ యిప్పటికీ ఆ రాతిలో మార్పులేదు. మార్పు వచ్చిందల్లా తమ జీవితాల్లోనే.

తన తండ్రి ప్రమాదవశాత్తూ చనిపోయాడు.

శ్యామల ఉలిక్కిపడింది. కిలోమీటర్ రాతిలో ప్రాణం వస్తోంది.

మరు నిముషంలో అక్కడ తన తండ్రి నిలబడి వున్నాడు.

"నాన్నా!" అరచింది శ్యామల.

"ఏం తల్లీ?"

"నువ్వు....నువ్వు....చనిపోలేదా?"

"లేదు తల్లీ! నీ వెంబడే వున్నాను!"

"మరి ఆ రోజు....శవం...."

"భౌతిక జీవితం అల్పమయింది తల్లీ!"

"నా దగ్గరకు వస్తావా?"

"నిన్ను రప్పించుకుంటాను!"

"ఎప్పుడు?"

"త్వరలో."

"నాకంత అదృష్టమా?"

తండ్రి నవ్వుతున్నాడు. నిలబడిన చోటునుండీ కదిలాడు. రాయి అక్కడే వుంది. తండ్రి రోడ్డుమధ్యకు వచ్చాడు. చేతులూపుతున్నాడు.

శ్యామలకు తానెక్కడ వున్నదీ తెలియడంలేదు.

కాని తండ్రిచేతులు తన కళ్ళముందే వూగుతున్నాయి.

తండ్రి మొహం అదృశ్యమవుతోంది. చేతులు మాత్రమే వూగుతో కనిపిస్తున్నాయి.

దేన్నో ఆపమనో, తనని రమ్మనో....

శ్యామల వెనక్కి పడిపోయింది. చిమ్మ చీకటి!

# 13

మర్నాడు బ్రిడ్జి దగ్గర భాగ్యలక్ష్మి చనిపోయివుంది. రాయుడు లాగానే లోయలోకి దొర్లిపోయింది. ఆమె అక్కడికి ఎందుకు వెళ్ళిందో, ఎలా వెళ్ళిందో ఎవరికి తెలియదు.

"శ్యామలా!" పిలిచాడు శిరీష్.

శ్యామల మౌనంగా కళ్ళెత్తి చూచింది. అతడి కళ్ళలో ఆకర్షణ.

"నిన్న నిద్రపోతావనీ బ్రిడ్జివద్ద కిలోమీటర్ రాతివద్ద మనిషిని చూస్తావనీ ఆజ్ఞాపించిందెవరు?"

"పేరు తెలియదు!"

"ఇల్లు తెలుసా?"

"చూపించగలను!"

శ్యామల కారులో బయలుదేరింది. మే ఫెయిర్ జంక్షన్ దాటి ఒక ఇంటిముందు కారు ఆపించింది.

శిరీష్ ఆ ఇంట్లోకి నడిచాడు.

ఇంటి ముందు త్యాగరాజు హిప్నటిస్ట్ అని నేమ్ ప్లేట్ వుంది.

శిరీష్ కళ్ళు మెరిశాయి.

రాయుడిని బతికివుండగా హిప్నటైజ్ చేసింది యితడే!

కాలింగ్ బెల్ నొక్కాడు శిరీష్.

"ఎవరు కావాలి?" అడిగాడు తలుపు తెరచిన వ్యక్తి.

"త్యాగరాజు...." సున్నితంగా పిల్చాడు శిరీష్. ఆకర్షణీయమైన చూపు! త్యాగరాజు తడబడ్డాడు. క్షణంలో తేరుకున్నాడు.

"ఎవరు నువ్?" అరిచాడు త్యాగరాజు.

శిరీష్ తలుపు తోసుకుంటూ లోపలకు వెళ్ళాడు. చటుక్కున త్యాగరాజును ఒడిసిపట్టుకొని ముఖానికున్న మాస్కుని లాగేశాడు. అతడు గంగరాజు. నిర్ఘాంత పోయాడు గంగరాజు.

శిరీష్ చేతిలో నల్లటి పిస్తోలు మెరుస్తోంది.

అంతే!—గంగరాజు కుప్పలా కూలిపోయాడు. తన ఎత్తులు సాగనందుకు, అన్న ఆస్థిని కాజేయలేకపోయి నందుకు.

—:ఐ పో యిం ది:—

# మూడు కత్తులు-రెండు హత్యలు

## బొమ్మిడి అచ్చారావు

"చీకటి పడుతోంది, పోదామా?" అన్నది వసంత చేతికంటిన ఇసుక దులుపుకుంటూ.

సముద్రంవంకే తదేక దీక్షతో చూస్తూన్న ప్రభాకరం ఈ లోకంలోకి వచ్చాడు.

"ఇంకా కాసేపు కూచుందాం. పోయి చేసేదేముంది?" అన్నాడు భార్య కళ్ళలోకి చూస్తూ.

"నాకిక బోర్ కొడుతోంది బాబూ!"

"బీచ్‌లో బోర్ కొట్టడమా? అంటే నీ మనసు ప్రకృతి సౌందర్యంవైపు మొగ్గటంలేదన్నమాట!?"

"అలా కాదు. ఎందుకో మధ్యాహ్నంనించి కాస్త తల నొప్పిగా వుంది."

"మరి బీచ్‌కి ప్రపోజ్ చేసింది నువ్వే కదా. వద్దంటే ఇంటిదగ్గరే ఉండిపోయేవాళ్ళం కదా. వారానికి ఒక ఆదివారం — సెలవు. సరదాగా గడపాలనుకు నేసరికి నీకీ తలనొప్పి ఒకటా? సరే పద, పోదాం" అయిష్టం

గానే లేవబోతున్న ప్రభాకరాన్ని చేయిపట్టి ఆపింది వసంత.

"సరే, మరో అరగంట వుందాం" అన్నది.

బీచ్‌లో రకరకాల జంటలు కన్నుల పండువుగా తిరుగుతున్నారు. చాలామంది తిరుగు ప్రయాణ మవుతున్నారు. అసలే బీచ్ ఊరికి దూరం. అయినా బీచ్ అని చెప్పుకోవటానికి కాకినాడలో ఏమీ ఉండదు.

ఆదివారం మాత్రం జంటలు జంటలుగా యువతీ యువకులు అక్కడ కాసేపు విహరి స్తుంటారు.

ప్రభాకరం దృష్టిని ఓ హిప్పీ జుట్టు యువకుడు ఆకర్షించాడు. అతను చాలా సేపట్నుంచి వీళ్ళిద్దరివంక నే చూస్తున్నాడు.

ముఖ్యంగా వాడు చూస్తున్నది వసంత నే అని ప్రభాకరం గమనించాడు. వసంత అతడిని గమనించినట్టు లేదు. వాడు ఆమె నే అంత పరీక్ష గా ఎందుకు చూస్తున్నట్టు?

ప్రభాకరం చూసినపుడల్లా ఆ జుట్టుపోలిగాడు చూపులు తిప్పేసుకుంటున్నాడు. అందుకే వసంత వెళ్ళి పోదామన్నా ప్రభాకరం ఇష్టపడలేదు. వాడి విషయం ఏమిటో చూడాలి! ఇంకా వాడు సంస్కారహీనంగా అలాగే చూస్తూంటే కాలరు దొరకపుచ్చుకుని నాలుగు ఉతికివెయ్యాలి! ఆవేశంతో అతని గుప్పెళ్ళు బిగుసుకున్నాయి.

ప్రభాకరం చూపు కాసేపు పక్కకు మళ్ళింది. రెండు నిమిషాల తర్వాత మళ్ళీ హిప్పీగాడివంక చూశాడు. వాడు ఆ స్థానంలో లేడు! ఏమయినట్టు?

చటుక్కున పక్కకు చూసిన ప్రభాకరానికి వాడు

తమపక్కనించే వెళ్తూన్నట్టు కనిపించాడు. వెళ్తూ వెళ్తూ, వసంత పక్కనే ఏదో కాగితం ఉండచుట్టి పడేశాడు.

తను చూడటంలేదని వాడి నమ్మకం! కాని, తన దృష్టిలో పడిపోయింది వాడు చేసిన పని! వెంటనే వాడ్ని పట్టుకుని సంగతేమిటో తేల్చేయాలనుకున్నాడు. కాని కంగారు పడకూడదు, అసలు వాడు వసంత పక్కన పడేసిన చీటీ ఏమిటో, అందులో ఏముందో చూడాలి!

కాగితం ఉండను వసంత గమనించినట్టు లేదు. తన లోకంలో తనుంది. తన క్లాస్ మెట్సు, వాళ్ళ వెలుగుళ్ళు ఏయే హోదాల్లో వున్నదో చెప్పుకుపోతోంది. ప్రభాకరం ఊకొడుతూనే యిదంతా గమనిస్తున్నాడు.

ఆ కాగితం వసంత చూడకుండా తను చేజిక్కించుకోవాలి. అందులో ఏముందో చూడాలి! బహుశా వాడు వసంతకి బాగా తెలిసినవాడే అయివుండాలి. వసంతకేదో సందేశం అందించాడు. వసంత గమనించిందో, లేక గమనించే తనకీ అనుమానం రాకుండా నాటకమాడుతుందో అర్థంకాకుండా వుంది.

ప్రభాకరం చేతులానించి కూచున్నాడు. వసంత వీపు మీదుగా చెయ్యిసాచాడు. కాగితం అందలేదు. తలకింద చేతులు పెట్టుకుని యిసుకలో పడుకున్నట్టుగా వెల్లకిలా పడుకున్నాడు. ఎడమచెయ్యి సాచాడు. కాగితం ఉండ అందింది. గుప్పెట్లో చిక్కించుకుని, రెండు చేతులూ తల కిందకి తెచ్చుకున్నాడు.

వసంత వున్నట్టుండి అతనివేపు తిరిగి, "ఏమిటి శేష పాన్పు అలంకరించారు! ఇది పాలసముద్రంకాదు; చేపల సముద్రం. ఆ కంపంతా తలకి అంటించుకోకండి" అన్నది హాస్యంగా.

ఆమె కోర్కని ఆనందించే స్థితిలో లేడు ప్రభాకరం. ఏదో బలవంతాన పెదాలమీది నవ్వు తెచ్చుకున్నా అతని మెదడులో విమానాల రొద హోరెత్తిపోతోంది.

ఆ చీటీలో ఏముంది? చీటీని మెల్లగా షర్టు జేబులోకి తోసేశాడు. ఇక్కడ కాదు - తీరిగ్గా యింటి దగ్గిరెక్కడో దాన్ని చదవాలి. తనచాటు మాటున వసంత సాగిస్తున్న వ్యవహారమేమిటి?

వసంతతో తనకి పెళ్ళయి రెండేళ్ళయింది. అంత క్రితం ఆమె గురించి తనకి తెలియకపోయినా, పెద్దలు కుదిర్చిన పెళ్ళే! మంచి చెడ్డలు, కుటుంబ సంప్రదాయం అన్నీ బాగా చూసుకున్నాకనే తన పెద్దలు ఈ పెళ్ళి నిర్ణయించారు. తనకి కూడా పెళ్ళి చూపుల్లో వసంత రంభలాగా కనిపించింది. రూపవతేగాక, గుణవతి కూడానని యీ రెండేళ్ళ సంసార జీవితంలోను తను గమనించి తన అదృష్టానికి మురిసిపోతున్నాడు.

ఆమె బియ్యే చదువుకుంది. తన అభిప్రాయాలను గౌరవిస్తుంది. తనతో సినిమాలకి షికార్లకి తిరుగుతుంది. సోషల్ మూవింగ్ తెలిసిన స్త్రీ. ఇంతకాలం తను ఆమె నడతను గురించి ఏనాడు చెడ్డగా వూహించను కూడా లేదు. తను ఆఫీసుకి వెళ్ళి తిరిగొచ్చేవరకు తన కోసమే ఎదురుచూస్తూ ఉంటుంది! తను ఓ గంట యింటికి ఆలస్యంగా వస్తే భరించలేదు.

అలాంటి వసంతను అనుమానించటానికి మనసు అసలు ఒప్పుకోవటంలేదు. ఏవో యిలాంటి సంగనాచులు ఎంతకైనా తెగిస్తారు! మొగుడు చాటున రంకు సాగిస్తున్న పతివ్రతలు తనకి చాలామంది తెలుసు. ఈమె అందులో ఒకతె కాకూడదా?

ప్రభాకరం తల సుత్తులతో కొట్టినట్టు దిమ్మెక్కి-పోయింది.

"ఇక పోదామా?" అన్నది వసంత లేస్తూ.

ప్రభాకరం తనూ లేచాడు.

వసంత ఆ చీటీని గమనించలేదని అర్థమైపోయిందతనికి. ఆ హిప్పీగాడిని గమనించే వుంటుంది; అయితే వాడు చీటీ అక్కడ పడేసినట్టు గుర్తించి వుండదు! వాడు తన దృష్టిలో పడిపోయాడు.

## 2

ఇంటికొస్తూనే, బట్టలు మార్చుకుని బాత్ రూంలోకి దూరాడు ప్రభాకరం.

కాగితం వుండని విప్పాడు. అల్లిబిల్లిగా అలికేసినట్టున్నాయి అక్షరాలు.

"వీనూ! బొత్తిగా ఉపవాసం పెట్టేస్తున్నావు. నేనంటే మోజు తగ్గిపోయిందా? రేపు మధ్యాహ్నం పదకొండు గంటలకి నీకోసం డ్రీమ్‌లాండ్ లాడ్జిలో ఇరవై ఎనిమిదో నెంబరు రూంలో ఎదురు చూస్తూంటాను. వస్తావుకదూ!

—నీ శ్యామ్."

ఉత్తరం చదువుతూనే కోపంతో నిలువెల్లా కంపించిపోయాడు ప్రభాకరం! ఎంతకి తెగించింది? అయితే తన చాటుగా యిన్నాళ్ళు వ్యవహారం సాగిస్తున్నదన్నమాట!

తను ప్రాణానికి ప్రాణంగా ప్రేమిస్తున్న వసంత ఇంత దిగజారిపోయిందనుకోలేదు. తను ఆమెకేం లోటు చేశాడు? అడిగినది లేదనకుండా కోరిన చీరలు, అప్పుడప్పుడు చిన్న చిన్న బంగారు వస్తువులు కొంటున్నాడు. ఆమె కూడా ఎన్నడూ అసంతృప్తి వ్యక్తపరచలేదు.

తనమీద వలకపోస్తున్న ప్రేమ ఉత్త బూటకమన్న మాట! హు, ఆడదాన్ని నమ్మకూడదని అంటారందుకే కాబోలు!

ప్రభాకరం అప్పటికప్పుడే ఓ నిర్ణయానికొచ్చాడు. సరే, ఆ శ్యాంగాడి సంగతేమిటో తేల్చెయ్యాలి! వాడ్ని కలిస్తే అన్ని సంగతులూ బయటికొస్తాయి.

"ఏమిటండీ, ఎంతసేపుంటారు ఆ బాత్రూంలో? ఆకలికావటంలేదా? నేనిక్కడ వడ్డించి కూచున్నాను." అన్నది వసంత బయటనుంచి కేకపెడుతూ.

తలుపు తెరుచుకుని బయటికొచ్చాడు.

"అదేమిటి, స్నానం చేస్తున్నారనుకున్నాను, ఎంతకీ రాకపోతే! ఏం చేస్తున్నారేమిటి లోపల?" అన్నది నవ్వుతూ వసంత.

ఛీ, సిగ్గులేకుండా ఎలా నవ్వుతోందో! ఎవడినో మరిగి, అది బయటపడకుండా ఎంత చక్కగా నాటకమాడుతోంది? అంతగా వాడంటే పడి చచ్చేది తన నెందుకు పెళ్ళిచేసుకుంది? తన జీవితంలో ఎందుకు నిప్పులు పోసింది? పండంటి తన జీవితాన్ని ఎందుకు నాశనం చేసింది?

తన భావాలు బయటపడకుండా "నాకీ పూట ఆకలిగా లేదు, నువు భోంచేసెయ్యి" అంటూ గదిలోకి వెళ్ళిపోయాడు.

ఛీ, దాని చేతికూడు తినటమంటేనే ఒళ్ళు కంపరమెత్తిపోతోంది. తనకేదో రోజు ఇంత విషం కలిపేస్తుంది తిండిలో లేదా, ఏ స్లోపాయిజనో ప్రతిరోజు అన్నంలో కలిపేస్తుంది. తన అడ్డు తొలగించుకోవటానికి అనుమానం రాకుండా ఏమైనా చెయ్యగలదు! తన కళ్ళు

గప్పి, తను ఇంటలేని సమయంలో రంకు సాగిస్తోందన్న మాట, వగలాడి!

వెనకాలే వసంత గదిలోకి వచ్చేసింది.

"ఇందాకటి వరకు బాగానే వున్నారుగదా! ఇంతలో ఏమయింది? కడుపునొప్పిగాని వస్తోందా? అయినా మధ్యాహ్నం ఎప్పుడో తిన్న తిండి. ఆకలి వెయ్యక పోవట మేమిటి?" అన్నది అతని చెయ్యిపట్టుకుని పొట్ట మీద తల ఆనించుతూ.

అతను వదిలించుకున్నాడు. "చాల్లే సరసం! ఓ పక్క నాకు వంట్లో బావుండలేదంటే వేళాకోళంగా వుందా?" అన్నాడు తీవ్రంగా.

చిన్న విషయానికే అతనంత సీరియస్‌గా ప్రవర్తించ టంతో వసంత చిన్నబుచ్చుకుంది. ఏమయిందీయనకు? సాయంత్రం బీచ్ కెళ్ళేవరకూ బాగానే వున్నాడుగదా ఇంతలో ఏమయింది?

అన్యమనస్కంగా డైనింగ్ టేబిల్ దగ్గరకొచ్చి కూచుంది. అన్నం సహించలేదు. భర్త ప్రవర్తన కొంత విచిత్రంగానే అనిపిస్తోంది. కంచంలో చెయ్యి కడి గేసుకుని, గిన్నెలు సర్దేసింది.

వంట గది సర్దుకుని, పడగ్గదికి వచ్చేసరికి భర్త అటు తిరిగి పడుకుని వున్నాడు.

"కాసిని పాలు తాగుతారా?" అనడిగింది.

అతను మాట్లాడలేదు. నిద్రపోతున్న సూచనలు కూడా లేవు. అయితే ఉచ్ఛ్వాసనిశ్వాసలని బట్టి మెలకువగానే ఉన్నాడని అర్థంచేసుకుంది.

ఏమిటీయన ప్రవర్తన ఇలా వుందీరోజు—అనుకుంది పదోసారి. అతన్ని డిస్టర్బ్ చెయ్యటం అనవసరం. సమా

ధానం చెప్పటంలేదు.

లైటు తీసేసి పక్కమీదికి చేరింది.

## 3

సరిగ్గా మర్నాడు పదకొండు గంటలకి డ్రీమ్‌లాండ్ లాడ్జిలోని ఇరవై ఎనిమిదో నంబరు గదిముందు నిల్చున్నాడు ప్రభాకరం.

కాలింగ్ బజర్ నొక్కాడు.

వెంటనే తలుపు తెరుచుకుంది. "కమాన్ డార్లింగ్ నువ్వొస్తావని నాకు తెలుసు...." అంటున్న అతను చటుక్కున నాలిక్కొరుక్కున్నాడు.

ప్రభాకరం అతన్ని గుర్తుపట్టాడు. ఆ హిప్పీ జుట్టు తనకి మరచిపోదామన్నా గుర్తుంది. వాడే! నిన్న బీచ్‌లో వసంతకి సందేశం అందచేసిన జుట్టుపోలిగాడే! శ్యామ్ అంటే వీడేనన్నమాట!

"ఎవరు మీరు? ఏం కావాలి?" అన్నాడతను కంగారుగా.

"నువ్వే, నీ కోసమే వచ్చాను."

"ఏమిటీ దార్జన్యం? ఆ ఏకవచన ప్రయోగమేమిటి?" కోపంగా అన్నాడు.

"నీకంతకన్న గౌరవమివ్వటం అనవసరం."

లోపలికొచ్చి తలుపు మూశాడు ప్రభాకరం.

"మిస్టర్, నువ్వెవరో నాకు తెలీదు."

"నువ్వెవరో నాకు తెలుసు. పచ్చని సంసారాల్లో చిచ్చుపెట్టే నరరూప రాక్షసుడవనీ తెలుసు."

"ఎవర్ని చూసి ఎవరనుకుంటున్నావో? ముందు మర్యాదగా బయటికి నడు."

"నడుస్తాను....వసంత నీకెన్నాళ్ళుగా తెలుసు?"

అతను అదిరిపడ్డాడు.

"ఏ వసంత?"

"నీ నటనకు నా జోహార్లు. నా భార్య....అదే ఆ వంచకి వసంతకు, నీకు ఎన్నాళ్ళుగా పరిచయం?"

అతను వెంటనే మాట్లాడలేదు.

"నాకు యే వసంతతోను పరిచయం లేదు. నాకేం తెలీదు" అన్నాడు కొద్ది క్షణాల తర్వాత.

"నేనూ తెలియదనే అనుకునేవాడ్ని నిన్న నిన్ను బీచ్‌లో చూడకపోతే! ఈ కాగితం ఉండచుట్టి వసంత పక్కన పడెయ్యటం నేను కళ్ళారా చూశాను" కాగితం అతనివైపు చూపించి, మళ్ళీ జేబులో పెట్టేసుకున్నాడు ప్రభాకరం.

అతను దొరికిపోయినట్లు చూశాడు.

"చెప్పు, ఎన్నాళ్ళుగా సాగుతోంది మీ యిద్దరి మధ్య వ్యవహారం?....ఊఁ! చెప్పకపోతే యీ క్షణంలోనే నీ పీక నులిమి చంపేస్తాను."

అతను—ప్రభాకరం కండలు తిరిగిన శరీరం వంక ఓ క్షణం చూసి నీళ్ళు నమిలాడు.

"నన్నేం చెయ్యనంటే చెపుతాను."

"ఆ సంగతి తర్వాత ఆలోచిద్దాం. అసలు సంగతి చెప్పు!"

"దాదాపు నాలుగేళ్ళుగా వసంత నాకు తెలుసు."

అదిరిపడ్డాడు ప్రభాకరం.

"అంటే ఆమెకు నాతో పెళ్ళి కాక ముందు నుంచేనా?"

"అవును. ఇద్దరం కలిసి చదువుకున్నాం. మా వాళ్ళు లేనివాళ్ళని, వాళ్ళ నాన్న వసంతని నాకిచ్చి పెళ్ళి

చెయ్యనన్నాడు. అప్పటికే మా యిద్దరికీ సంబంధముంది. పెళ్ళయ్యాక కూడా మేము చాలాసార్లు కలుసుకున్నాం."

ప్రభాకరం రక్తం సలసల మరిగిపోతోంది.

"ఈ మధ్య వసంత మరొకడితో తిరగటం చూశాను. నన్ను కలవడం తగ్గించేసింది. మేమిద్దరం చాలాసార్లు యిదే లాడ్జిలో కలుసుకున్నాం."

ప్రభాకరం కాసేపు మాట్లాడలేక అచేతనంగా నిలబడిపోయాడు.

"నీ పేరు?" అడిగాడు.

"ఉత్తరంలో రాశానుగా, అదే—శ్యాంప్రసాద్."

"నువ్వు చెప్పేది నిజమనటానికి రుజువేమిటి?"

"అంటే........వసంత నాతో తిరగటమా, లేక మరొకడితో తిరగటమా? దేనికి కావాలి రుజువు?"

ప్రభాకరం రక్తం మళ్ళీ సలసల మరిగింది.

"అదే, మరొకడెవడో అన్నావుగా, ఆ సంగతి?"

"వాడి పేరు ప్రేంకుమార్. భానుగుడి దగ్గిర పిఠాపురం రోడ్డున ఎనభైతొమ్మిదో నెంబరు యిల్లు. బహుశా నీ భార్య ప్రస్తుతం అక్కడికే పోయి వుంటుంది."

"ఏమిటి గ్యారంటీ?"

"నేను రోజూ చూస్తున్నా గాబట్టి! కావాలంటే ముందు నీ యింటికి పోయి వెరిఫై చేసుకో! నీ పెళ్ళాం అవుట్. తర్వాత నే చెప్పిన డోర్ నంబర్ వెతుక్కుని వెళ్ళు. నీ భార్య దర్శనమిస్తుంది."

ప్రభాకరం పళ్ళు బిగుసుకున్నాయి. నరాలు పొంగాయి. అనుకోకుండా అతని దృష్టి అక్కడున్న టేబిల్ మీద పడింది. దానిమీద పాలనురుగులాంటి చేతి

రుమాలు. చుట్టూ ఎంబ్రాయిడరీ. మధ్య పద్మం. రుమాలుకి ఓ చివర 'వి' అన్న యింగ్లీషు అక్షరం—

అవును, అదే! వసంత తనకోసం ప్రేమతో కుట్టి యిచ్చిన చేతిరుమాలు. తను దాన్ని అపురూపంగా దాచుకున్నాడు. అది యీ దౌర్భాగ్యుడి చేతి కెలా వచ్చింది? తనకి తెలీకుండా తెచ్చి యిచ్చిందెప్పుడో! తనీ మధ్య ఆ రుమాలు సంగతే మర్చిపోయాడు.

శ్యాంగాడు చెప్పేది నిజమేలాగా వుంది. వీడితో సంబంధం పెట్టుకుందన్న విషయంలో అనుమానం లేదు. వీడు చెప్పిన ఆ ప్రేమ్‌కుమార్ గాడి సంగతి కూడా తెలుసుకోవాలి!

గిరుక్కున వెనుతిరిగాడు ప్రభాకరం. భుజంమీదుగా వెనక్కి శ్యాంవేపు చూసి, "నిన్నింతటితో వదుల్తాననుకోకు. ఆ ప్రేమ్‌గాడి సంగతి కూడా నిర్ధారణ చేసుకున్నాకే మీ ముగ్గుర్నీ ఒకేసారి చంపి పారేస్తాను" అన్నాడు నిప్పులు రాలుస్తూ.

శ్యాం చిద్విలాసంగా నవ్వుతున్నాడు.

4

దూరంనించే తమ యింటికి తాళం వేలాడుతుండటం కొట్టొచ్చినట్టు కనిపించింది. ఒక నిమిషం కర్తవ్య విమూఢుడిలా అచేతనంగా వుండిపోయాడు ప్రభాకరం.

ఈ రోజు ఎలాగూ ఆఫీసుకి సెలవు పడేశాడు. ఈ సంగతి పూర్తిగా తేల్చేసుకోవాలి. ఈ వంచకిని, దానితో సంబంధం పెట్టుకున్న నీచుల్ని నరికి పారెయ్యాలి. తను ఉరికంబం ఎక్కినా ఫరవాలేదు.

స్కూటర్ వెనక్కి తిప్పాడు. తిన్నగా శ్యాంగాడి రోడ్డు పట్టించాడు. పిఠాపురం రోడ్‌న స్కూటర్ స్లో

చేశాడు. ఇంటి నెంబర్లు వెరిఫై చేసుకుంటూ పోతు న్నాడు.

ఎనభైతొమ్మిదో నెంబరు ...ఆ, వాడు చెప్పిన యిల్లు యిదే!

అది డాబా యిల్లు. చుట్టూ ప్రహరీ వుంది. ఇంటి ముందు క్రోటన్స్, పూల మొక్కలు కుండీల్లో వున్నాయి. కొత్తగా పెయింట్ వేసివున్నాయి యింటి గోడలు. ఆ ప్రేమ్‌గాడు ఉన్నవాడిలాగానే వున్నాడు.

ఏం చెయ్యాలి యిప్పుడు? లోపలికి వెళ్ళి వసంత వుందో లేదో తేల్చుకోవాలా? కాసేపు అక్కడే తచ్చాడి బయటి కొస్తుందో లేదో కనిపెట్టాలా?

లోపలికి వెళ్ళటం ఫూలిష్‌నెస్. ఆ శ్యాంగాడు తనని తప్పుదారి పట్టించినా పట్టించవచ్చు. వాడిన్ని యెవడు నమ్మాడు?

స్కూటర్ పక్కకి తీసి ఆపుచేశాడు. అక్కడ ఓ పాన్ షాపు వుంది. షాపు పక్కనే కూచోవటానికి అటు యిటు రెండు బల్లలున్నాయి. కాసేపు యిక్కడే కాల క్షేపం చేసేస్తే సరి!

పాన్ షాపుదగ్గిర గోల్డుఫ్లాక్ సిగరెట్టు ప్యాకెట్టు తీసుకున్నాడు. ఓ సిగరెట్ తీసి వెలిగించాడు.

బల్లమీద కూలబడ్డాడు. దృష్టిని ఆ యింటిమీదనించి జరగనివ్వటంలేదు. షాపువాడికి అనుమానం రాకుండా అప్పుడప్పుడు దారిన పోయే వాహనాల్ని, మనుషుల్ని గమనిస్తున్నట్టు నటిస్తున్నాడు.

షాపువాడిన్ని ఆ యింటి వివరాలు అడిగితేనో?....అను కున్నాడు—కాని, వాడికి లేనిపోని ఆసక్తి కలిగించిన వాడవుతాడు. అదంత మంచిపని కాదు కూడా.

షాపువాడు తన పనిలో తనున్నాడు. అది మంచి సెంటర్ కావటాన పాన్‌షాపుకి బేరం బాగానే సాగుతోంది.

ప్రభాకరం గుండె ఓ క్షణం ఆగి కొట్టుకుంది.

వసంత లోపల్నుంచి వస్తోంది. వేగంగా నడకో, పరుగో తెలీని నడకతో గేటు తోసుకుని బయటికొచ్చింది. ఎటూ చూడటంలేదు. తిన్నగా రోడ్‌మీదికొచ్చింది. రిక్షాని పిలిచింది. ఎక్కి కూచుంది. రిక్షా కదిలింది.

ఆమెని ఫాలో కావటం అనవసరం! శ్యాం చెప్పింది నిజమే అయుంటుంది. వసంత తనని గమనించలేదు. అసలు ఆమె ఎవర్నీ గమనించడానికి అవకాశంలేదు. తిన్నగా వచ్చి రిక్షా పిలిచి కూచుంది.

ప్రభాకరం తలెత్తి ఆ యింటివంక పరీక్షగాచూశాడు. వరండాలో ఎవడో మొగాడు. లుంగీ, షర్టుమీదున్నాడు. బయటికి స్పష్టంగా కనిపిస్తున్నాడు.

ప్రభాకరం లేచాడు. సిగరెట్ విసిరికొట్టాడు.

ఆ యిల్లు సమీపించాడు. గేటు తోసుకుని లోపలికి వెళ్ళాడు. సరాసరి ఆ మనిషి దగ్గిరికే వెళ్ళాడు.

"ఎవరు కావాలి?" అన్నాడతను.

"ప్రేమ్‌కుమార్ ఎవరు?" సూటిగా ప్రశ్నించాడు ప్రభాకరం.

"నేనే! మీరెవరు? నా పేరెలా తెలుసు?"

"అదంతా తర్వాత చెపుతాను. ఇప్పుడిక్కడికి వచ్చిపోయిన మనిషి నీకెలా తెలుసు?"

"ఆ వివరాలు అంత అవసరమా? అయినా నీకుయెందుకు చెప్పాలి? అసలు నువ్వెవరు? నా యింటికొచ్చి

నన్నే డబాయిస్తున్నావు. పైగా అమర్యాదగా మాట్లాడుతున్నావు. మర్యాద యిచ్చి పుచ్చుకోవాలి!" అన్నాడు ప్రేమ్‌కుమార్ కోపంతో.

"మర్యాద విషయం నీకన్నా నాకే బాగా తెలుసు. ఆ విషయం తర్వాత మాట్లాడుకుందాం. ఆ మనిషి నీకెలా తెలుసు, నీ కేమిటి సంబంధం?"

"నాకు చాలా కావలసిన మనిషి. ముందు నువ్వెవరో చెపితే వివరాలు చెపుతాను. ముక్కు మొఖం తెలీని వాడితో నా రహస్యాలు చెప్పాల్సిన అవసరం నాకు లేదు."

"అయితే విను. వసంత నా భార్య."

అతను నిర్ఘాంతపోయినట్టు చూశాడు.

"వాట్? వసంత నీ భార్యా?"

"అవును. ఇప్పుడు చెప్పు, ఆమెతో నీకేం పని?"

ప్రేమ్‌కుమార్ నవ్వాడు.

"ఆ మాత్రం అర్థం చేసుకోలేవా? ఇంకా నోటితో చెప్పాలా? నీ భార్య నీ భార్య కాకముందునించీ నాకు తెలుసు!"

"అంటే....?"

"ఇంత మొద్దు బుర్రేమిటయ్యా నీది? వసంత నాకూడా భార్యతో సమానమే! చాలా, యింకా వివరంగా చెప్పాలా?"

"యూ బ్రూట్! నీకు నా భార్యే కావలిసొచ్చిందా? సుఖంగా కాపురం చేసుకుంటున్న ఆడవాళ్ళని వేటాడ్డమేనా నీ పని?"

"అది నా తప్పా? నీ పెళ్ళాం నా వెంటపడి నేనే కావాలని వెంపర్లాడుతుంటే ఏం చేసేది? తన అవసరాలు

నేను తీర్చటంలో తప్పేముంది?"

"అలాగే నీ పెళ్ళాన్ని మరోడు తగులుకుంటే.... అప్పుడు కూడా వాడు నీ పెళ్ళాం అవసరాలు తీరుస్తానని తయారవుతే....? నీతోనే నీ పెళ్ళాం తనతో తిరుగుతోందని బాహాటంగా చెపితే...."

"నోర్ముయ్! నేనంత చేతగాని వాజమ్మని కాదు. అలా తెలిసిన మరుక్షణం దాన్ని ఉప్పుపాతర వేసేస్తాను. ఫర్ యువర్ యిన్ఫర్మేషన్, నాకింకా పెళ్ళి కాలేదు."

ప్రభాకరం సమాధానం చెప్పలేకపోయాడు వెంటనే. వాడు తనని వాజమ్మ అంటున్నాడు. చేతకానివాడినంటున్నాడు. అయినా, యింత సేపు వాడితో తను సంభాషణ పెంచుకోవటం అనవసరం!

నిజంగా తను చేతకానివాడే! లేక పెళ్ళాం తిరుగుబోతని ప్రత్యక్షంగా తెలిసిపోతున్నా యింకా సిగ్గువిడిచి దాని విటులతో మాట్లాడుతున్నాడు?

ఆవేశంతో ప్రభాకరం నరాలు పొంగాయి. రక్తం ప్రతీకార వాంఛతో మరిగిపోయింది.

ఇప్పుడు కాదు....వీడి కిప్పుడు స్థానబలముంది. ఇక్కడ కాదు, మరోచోట మరో విధంగా చంపాలి. ఆ శ్యాం గాడ్ని వీడ్ని ఒకేసారి చంపిపారెయ్యాలి. ఆ తర్వాత ఆ వంచకి వసంతని అంతం చెయ్యాలి. అంతే....అప్పుడే తనకి శాంతి!

పరువు పోయాక మనిషి బతికినా ఒకటే, చచ్చినా ఒకటే! తనకి తెలీదుగాని, యిప్పటికే వసంత తిరుగుళ్ళు అందరికీ తెలిసిపోయుంటాయి. తను ఆఫీసుకి అలా పోగానే, తను యిలా ఊరిమీద పడి చెడ తిరుగుతోంది.

ఇంతటితో యీ పాతకి చరిత్ర అంతం చెయ్యాలి. దాని పాపాన్ని దాని రక్తంతోనే కడిగెయ్యాలి. దానితో సంబంధం పెట్టుకున్న యీ రాక్షసు లిద్దర్నీ, దాన్నీ— ఒక్కేసారి....ఒక్కేసార....చంపెయ్యాలి—

ఎక్కడ, ఎప్పుడు, ఎలా?

ప్రభాకరం కసిగా, కోపంగా ప్రేమ్‌కుమార్ వంక చూశాడు. అతని చూపులకే శక్తి వుంటే ఆ క్షణంలో వాడు భస్మమయిపోవలసిందే!

"చేతకానివాడికి కోపం ఎక్కువని చిన్నప్పుడు పుస్తకాల్లో చదవలేదా?" అన్నాడు ప్రేమ్‌కుమార్, వ్యంగ్యంగా నవ్వుతూ.

"ఛీ, నీతో నా కేమిటి?" వెనుతిరిగాడు ప్రభాకరం.

"ఒన్ మినిట్!" వెనకనించి ప్రేమ్‌కుమార్ పిలిచాడు.

వద్దనుకుంటూనే ఆగాడు ప్రభాకరం.

"శ్యాంప్రసాద్, నేను—నీ పెళ్లాం ఆడే ఆటలో తురుఫుముక్కలం.అసలైన ఇస్పేటాసు మరొకడున్నాడు. వాడి పేరు, వివరాలు తెలుసుకోకుండానే వెళ్ళిపోతున్నావు" అన్నాడు ప్రేమ్‌కుమార్.

ప్రభాకరం అతనికేసి చూడలేదు. వినటానికి సిద్ధంగా నిల్చున్నాడు.

"హాస్పిటల్ వీధిలో అరవై మూడో నెంబరు ఇంట్లో బ్రహ్మాండమైన భవంతి ఒకటుంది. దాంట్లో రాంగోపాల్ అనే నవయువకు డొకడున్నాడు. మా యిద్దరికన్నా వాడంటేనే నీ పెళ్ళానికి మోజెక్కువ. పడి ఛస్తుంది. ఓసారి వాడ్ని కూడా దర్శించుకో వీలు వెంబడి—"

కర్కశంగా నవ్వుతున్నాడు ప్రేమ్‌కుమార్.

ప్రభాకరం సహనం కోల్పోతున్నాడు. ఇంకా అక్కడే వుంటే ఎలాంటి మాటలు, మరికొంతమంది గురించి వినాల్సి వస్తుందో....!

నాలుగడుగుల్లో గేటు తీసుకుని బయటికొచ్చాడు.

స్కూటర్ స్టార్టు చేశాడు.

తిన్నగా తన యింటికి పోనిచ్చాడు.

## 5

"ఇంకా టైం మూడయినా కాలేదు. అప్పుడే తిరిగొచ్చేశారే!...." సంభ్రమంగా అన్నది వసంత.

కోరగా చూశాడు ప్రభాకరం.

"ఏం, రాకూడదా?"

"అదేమిటండీ, ఏదయినా సినిమా ప్రోగ్రాం వేశారేమోనని అలా అడిగాను. ఈ రోజో రేపో మొన్న విడుదలైన కొత్త సినిమాకి తీసుకెళ్తానన్నారు కదా! అందుకని పెందరాళే వచ్చేశారేమోనని...."

"సినిమాకి నేను తీసుకువెళ్ళటం దేనికి? నువ్వు వెళ్ళలేవా? నీకు ఊరు తెలీదా, దారి తెలీదా?"

"ఏమిటండి అలా మాట్లాడుతున్నారు? మీరు లేకుండా నేనెప్పుడైనా సినిమాకు వెళ్ళానా?"

"ఇప్పుడు వెళ్ళు, నీ కడ్డేముంది?"

"మీ మూడ్ బావున్నట్టు లేదు. మంచి టీ తీసుకొస్తానుండండి వేడి వేడిగా."

"అక్కర్లేదు. ఇప్పుడే తాగాను."

"నేను తాగిస్తాను."

"అదొక్కటే తక్కువ మనకు."

"ఏమిటో బాబూ, మీ మగాళ్ళ తత్వం అర్థం చేసుకోవటం చాలా కష్టం!"

"ఏం యింకా ఎవరెవరి తత్వం అర్థంకాలేదు?"

వింతగా చూసింది భర్తవంక.

ప్రభాకరం బట్టలు మార్చుకుంటూ అన్నాడు.

"మధ్యాహ్నం—అదే—పన్నెండుగంటల వేళ ఓ సారి యింటికొచ్చాను...."

ఉలిక్కిపడింది వసంత.

"మొన్నెదో 'దేవీ దర్శనం' సినిమా నూన్‌షోకి వెళ్తా నన్నావు కదూ! అది చూడ్డానికి వెళ్ళావను కున్నాను."

"అవునండీ! అబ్బ, సినిమా చాలా బావుందండి. నిజంగా 'దేవి' పాత్రకు కె.ఆర్. విజయ ముమ్మూర్తులా సరిపోయిందండి—అమ్మవారు కళ్ళ ముందు నిలిచినట్టే అనిపించిందండి!"

గొంగళి పురుగులు ఒంటిమీద పాకుతున్నట్టయి ఒళ్ళు జలదరించింది ప్రభాకరానికి. రంకు నేర్చింది బొంకు నేర్చుతుందని పూరకే అన్నారా?....ఆ బొంకేది ఏదో దేవుడిమీద బొంకటం దేనికి? ఇంకోటేదో చూసి ఏడ్చా నని చెప్పకూడదూ? ఊరినిండా నూన్ షోస్ తెరపి లేకుండా ఆడుతున్నారు కదా?

"అంత బావుందన్న మాట! మరోసారి నేను కూడా చూస్తానులే!"

మంచంమీద అడ్డంగా పడుకున్నాడు.

వసంత పక్కనే కూచుంది.

"కాసేపు నన్ను ఒంటరిగా వదిలెయ్యి. తలనొప్పి పేల్చేస్తోంది. కాసేపు పడుకుంటే రిలీఫ్ యిస్తుంది" అన్నాడు మరోపక్కకు తిరిగి పడుకుంటూ.

"తలనొప్పా? మరి చెప్పరేం? ఉండండి, అమృతాం

జనం మర్దన చేస్తాను. క్షణాల్లో నొప్పి యెగిరి పోతుంది."

"నాకే మందులూ వద్దుగాని, కాసేపు యిక్కడినించి వెళ్తావా?" చిరాగ్గా అరిచాడు.

"ఆ మాత్రానికే అంత చిరాకు దేనికి? రెండు రోజుల్నించి మీ వరసేం బావోలేదు. ప్రతి చిన్నదానికీ నామీద విరుచుకుపడ్తున్నారు" విసురుగా లేచి పక్కగది లోకి వెళ్ళిపోయింది వసంత.

వెనక్కి పిలిచి తను విన్నదీ, చూసిందీ అంతా చెప్పి మూర్ఛపోయేలా చేద్దామనుకున్నాడు. కాని, తను బయట పడటం అనవసరం. తన రంకువేషాలు తెలిసిపోయినట్లు తను వెల్లడి చేయకూడదు. జాగ్రత్తపడిపోతుంది. ఏం ఎరగనట్టే వ్యవహరించాలి. సమయం చూసుకుని చంపి పారెయ్యాలి!

ఈ లోపల ఆ శ్యాంగాడిని, ప్రేమ్‌గాడిని యెలా చంపాల్సిందీ ప్లాన్ చేసుకోవాలి. ఇద్దరూ ఒకే చోట కలుసుకొనేలా చెయ్యాలి. ఒక్కసారిగా దాడి చేసి యిద్దర్నీ ఒకేసారి పొడిచి పారెయ్యాలి. ఆ వెంటనే ఈ వంచకిని చంపెయ్యాలి. అలా అయితేనే తను ముగ్గురిమీద కసి తీర్చుకోగలుగుతాడు.

ఏ ఒక్కరు తప్పించుకున్నా తన పంతం నెరవేరదు. తను ఉరికంబం ఎక్కడానికి ఎటూ సిద్ధంగా వున్నాడు. ఒక హత్య చేసినా మూడు హత్యలు చేసినా శిక్ష ఒక్కటే! ముగ్గుర్నీ చంపితేనే తన ప్రతీకార జ్వాలలు ఉపశమిస్తాయి.

ప్రభాకరం తల దిమ్మెక్కిపోయింది.

అకస్మాత్తుగా ప్రేమ్‌కుమార్ చెప్పిన మరో వ్యక్తి

విషయం గుర్తొచ్చింది. రాంగోపాల్ గురించి కూడా ఎంక్వయిరీ చెయ్యాలి. వాడు చెప్పిందే నిజమయితే, ఆ రాంగోపాల్ తన టార్గెట్‌లో మొదటివాడు.

## 6

హాస్పటల్ వీధిలో అరవైమూడో నెంబరు యిల్లు తేలిగ్గానే దొరికింది.

ప్రభాకరం స్కూటర్ పక్కకి తీసి లాక్ చేశాడు.

ఇంటివంక తదేక దీక్షతో చూశాడు.

రెండు అంతస్తుల మేడ. ఆకుపచ్చ పెయింటింగ్‌తో వింతగా మెరుస్తోంది. గోడలకి సున్నం కాకుండా ఎనామిల్ పెయింట్‌నే వాడినట్లున్నారు. నిగనిగ మెరుస్తున్నాయి. ఇంటిచుట్టూ ఎత్తయిన ప్రహారీ, లోపల చాలా రకాల మొక్కలున్నాయి. పారపెట్ వాల్ పైకి నైట్ క్వీన్ గాబోలు. పాకించారు. ఓ పక్కగా ప్రహారీ నానుకుని సన్నజాజి పందిరి వుంది.

మొత్తంమీద యిల్లు చాలా అధునాతనంగా హుందాగా, దర్జాగా వుంది. అందులో నివసించేవాళ్ళు బాగా ధనవంతులని చూడగానే అర్థమైపోతుంది.

గేటుకి నేమ్ బోర్డు వేలాడుతోంది. 'ఎస్. రాంగోపాల్, ఎం. ఎస్సి., లెక్చరర్ యిన్ ఫిజిక్స్' అని వుంది.

'అడ్రసు కరెక్టే'—అనుకున్నాడు ప్రభాకరం.

కెంం ఉదయం పదకొండు దాటింది. బహుశా ఇతను ఎం. ఎస్సీ ఎప్పుడు చేశాడు? లెక్చరర్ ఎప్పుడయ్యాడు? బహుశా జూనియర్ లెక్చరర్ అయుంటాడు. అయినా అతనికి, వసంతకి ఎలా కలిసింది?

వసంత బియ్యే చదివింది. అతను ఎమ్మెస్సీ. సైన్సు

గ్రాడ్యుయేట్. కోర్సులు వేరయినా ఒకే కాలేజీలో కో ఎడ్యుకేషన్ అయివుంటుంది. చదువుకుంటున్న రోజుల్లోనే ఒకరికొకరు దగ్గిరై వుంటారు. ఏ కారణాలవల్లనో పెళ్ళిదాకా పోలేదు. అప్పటికే యిద్దరూ గ్రంథం నడిపి వుంటారు.

శ్యాంప్రసాద్, ప్రేమ్‌కుమార్ కూడా అదే కాలేజిలో చదివి వుంటారు. అందుకే ఒకళ్ళ గురించి మరొకరికి వివరంగా తెలుసు!

అమ్మా, యీ నీచుగాలు ఎంత గుండెలుతీసిన బంటు! శృంగార క్రీడలన్నీ ముగించుకుని తనను పెళ్ళాడింది! అంతటో వూరుకోక తన చాటునే మాజీ ప్రియుల్ని కలిసి ఖుషీ చేస్తోంది—ఒకడ్ని మార్చి మరొకడ్ని.

తలచుకుంటేనే వాంతి అయినట్టవుతోంది. ఇలాంటి బజారుదానితోనా తనిన్నాళ్ళు సంసారం చేసింది?

దారిన బోయేవాళ్ళు తననే పరీక్షగా చూడటం గమనించి యీ లోకంలోకి వచ్చాడు ప్రభాకరం.

చటుక్కున గేటు తోసుకొని లోనికి వెళ్ళాడు. ఎదర వరండా వుంది. దానికి యినుప గేటుంది. అది దాటుకుని లోపలకి వెళ్ళాడు.

లోపల విశాలమైన హాలుంది. హాల్లో సోఫాసెట్టు, టీపాయ్. దానిమీద రకరకాల యింగ్లీషు మేగజైన్స్ వున్నాయి. ఇంట్లో ఎవరూ వున్న జాడలేదు.

"ఎవరు కావాలి బాబూ?" ఓ వయసు మళ్ళిన ముసలాడు—నౌఖరు కాబోలు—పలకరించాడు.

"రాంగోపాల్ వున్నారా?"

"పొద్దుటే కాలేజికి వెళ్ళిపోయారండి."

"మధ్యాహ్నం భోజనానికి వస్తారా?"

"కాలేజి షిఫ్టు సిస్టమండి. ఓ గంటలో ఏకంగా వొచ్చేత్తారండి. అలా కూకోండి బాబూ!"

"నువ్వేం చేస్తుంటావిక్కడ?"

"పనివాడిని బాబూ! పనివాడినన్న మాటే గాని, రాంబాబు నా చేతులమీద నే పెరిగారండి. ఆరు నన్ను పనోడిలాగాక స్వంత మడిసిలా సూత్తారండి."

"ఇంకా ఎవరుంటున్నా రీ యింట్లో?"

"ఇల్లు యింత పెద్దదుందని యెక్కువమందున్నారను కొంటున్నా రేమో! ఇంటికంతటికీ నేను, బాబుగారు, వంటమనిషి—ముగ్గర మే! బాబుగారిది యీ పక్క నే గొల్లప్రూడి గ్రామమండి. ఉద్యోగమయిందని ఆ రొక్కరు కాకినాడ వొచ్చేసేరు. బాగా డబ్బున్నోరు లెండి. ఉద్యోగమక్కర్లేదసలు. ఏదో కాలచ్చేపానికి సేత్తన్నారు. ఆరి గురించే యిక్కడె యీ మేడ కొనేసేరు. ఉద్యోగమయి నిండా ఆర్నెల్లు కూడా కాలేదండి. లంకంత కొంపలో బిక్కు బిక్కుమని ముగ్గురం."

"మీ అయ్యగారి భార్యా పిల్లలు యెక్కడుంటున్నారు?"

"అయ్యగారికి పెళ్ళికాలేదండింకా. ఎప్పుడెప్పుడవుద్దా అని ఆరి నాన్నగారు అమ్మగారులతో బాటుగా నేను ఎదురుసూత్తా వున్నాను. కల్యాణ గడియ రావాలి కదూ బాబూ! నిలబడే వున్నారు. కూకోండి. తమరికి కాఫీ తెత్తాను వంటమనిసి నడిగి."

అతను లోపలికి వెళ్ళాడు. ప్రభాకరం హాలంతా పరీక్షిస్తూవుండిపోయాడు. ఈ పనివాడు బొత్తిగా బోలా మనిషిలా వున్నాడు. వీడిద్వారా చాలా సంగతులు తెలుస్తాయి తనకి! అనుమానం రాకుండా కూపీ లాగాలి.

వసంత గురించి వీడికి తెలిసే వుంటుంది.

గోడలకి మంచి మంచి పెయింటింగ్సు వేలాడుతున్నాయి. ఎగురుగావున్న గోడకి పెద్ద ఫోటో వేలాడుతోంది. బస్టువరకు ఎన్లార్జిమెంటు ఫోటో. అందులో ఓ యువకుడి ముఖం అందంగా నవ్వుతోంది. కలర్స్ వేసి వున్న ఫోటో! చాలా అందమైన ముఖం! చూడగానే గుర్తుండిపోయే ముఖవర్ఛస్సు! బహుశా అది రాంగోపాల్ ఫోటో అయుండాలి!

అతను వేడి వేడి కాఫీ తీసుకుని వచ్చాడు.

కాఫీ అందుకుంటూ, "అన్నట్టు నీ పేరేమిటన్నావు?" అనడిగాడు.

"ఎంకన్నంటారండి."

"రాంగోపాల్ గారి చిన్నతనంనించీ వారింట్లోనే వుండేవాడివా?"

"అఁయ్, నేను ఆ రింట్లో పని చెయ్యటం మొదలెట్టేసరికి పన్నెండేళ్ళ కుర్రాడినండి. రాంబాబు పుటక నాకు బాగా తెలుసండి. ఆరి కుటుంబంలో నలుగురు ఆడపిల్లల తర్వాత యీ బాబు ఒక్కరే మగ సంతానం. చాలా గారాబంగా పెరిగారండి."

"అలాగా! అమ్మాయిల పెళ్ళిళ్ళు అయిపోయాయా?...."

"ఎప్పుడో అయిపోయాయండి."

"మరి మీ బాబుగారు యింకా పెళ్ళి చేసుకోకుండా యెందుకుండిపోయారు? వయసు మీరిపోతున్నది కదా?"

"అదేంటో బాబూ, పెళ్ళంటేనే యిష్టం లేదంటారు. ఆయనకి నచ్చిన పిల్లే దొరక్కపోయిందా? ఏటో ఆ బాబు లోకమా బాబుది."

"ఒకవేళ యెవర్నయినా ప్రేమించారేమో! లేక ఎవర్నయినా రహస్యంగా పెళ్ళి చేసుకున్నారేమో, నీకేం తెలుసు?"

"ప్రేమించిన మాట్నిజమేగాని బాబూ, పెళ్లి సేసుకోలేదండి."

"ఎవర్ని?" కుతూహలంగా ముందుకి వంగాడు ప్రభాకరం.

"వసంతమ్మగారని చాలా అందగత్తె బాబూ! మా బాబుగారికి ఆ యమ్మంటే వల్లమాలిన పేమ. ఆ అమ్మగారికి కూడా అంతే నండి! పెల్లి సేసుకోవాలని కూడా అనుకున్నారండి. కాని, యెందుకో మరి సేసుకోలేదండి."

ప్రభాకరానికి తెర విడిపోయింది. ప్రేమ్‌కుమార్ చెప్పింది నిజమే! వసంత ప్రథమ ప్రియుడు రాంగోపాల్!

టైం చూసుకున్నాడు. ఒంటి గంట కావస్తోంది. రాంగోపాల్ వచ్చే సమయం. అతన్ని యింకా అడిగేదేముంది? విషయం పనివాడి దార్యానే తెలిసిపోయింది.

అనుమాన నివృత్తికోసం, జేబులోంచి పర్సు తీసి అందుకొని ట్రాన్స్‌ప్రంట్ కాగితం కింద దాచుకున్న వసంత ఫోటో తీశాడు ప్రభాకరం. పాస్‌పోర్టు సైజు ఫోటో అది! తనది, ఆమెది పర్సులో పక్క పక్కనే దాచుకున్నాడు. పర్సు తీసినపుడల్లా ఆమె సుందరవదనారవిందం తనకి నవ్వుతూ దర్శనమిచ్చేది! ముద్దు పెట్టుకోకుండా వుండేవాడు కాదు!

"ఇదిగో, యీ అమ్మాయిగారేనా మీ వసంత?" వెంకన్నకి ఫోటో చూపించాడు.

"ఆఁ, యీ అమ్మాయిగారేనండి! ఇది తమ దగ్గిర కెలా వచ్చింది బాబూ?"

"చెప్తానులే! ఇప్పుడీ అమ్మాయి ఎక్కడుంటుందో నీకు తెలుసా?"

"ఆ అమ్మాయిగారికి పెళ్ళయి పోయిందంట బాబూ! ఈ ఊళ్ళోనే వుంటోందని బాబుగారు చెప్పారు. బాబుగారు చాలాసార్లు చూశారంట కూడా!"

"అంటే యిప్పుడు కూడా యిద్దరూ కల్సుకుంటున్నారా?"

"ఆ యివరాలు నాకు తెల్దు బాబూ! ఆ అమ్మాయి గారికోసమే బాబుగారు పెల్లి మానేసారు. అది మాత్రం కచ్చితంగా చెప్పగలను."

ప్రభాకరం లేచాడు. తనక్కావలసిన వివరాలు తెలిశాక యింకా అక్కడే వుండటం అనవసరం!

"ఆ ఫోటో ఎవరిది? చాలా బావుంది" అన్నాడు ప్రభాకరం.

వెంకన్న అతనివంక అదోలా చూసి, "తమరొచ్చింది మా బాబుగారికోసమేకదా! మరి మా బాబుగారి ఫోటో యెవరిదని అడుగుతారేంటి? ఆయన మీకు తెలియదా?" అనడిగాడు.

ప్రభాకరం తొట్రుపాటు నణచుకొని, "అబ్బే రాంగోపాల్ గారు తెలియకపోవడ మేమిటి? ఇద్దరం కలిసి చదువుకున్నాం కూడా! ఫోటోలో ఇంకోలా వుంటేనూ" నీళ్ళు నమిలేశాడు.

"ఎల్లిపోతున్నారేంటి? బాబుగారొచ్చేత్తారిక. కూకోండి."

"ఇప్పుడే వస్తాను. బ్యాంక్ కి వెళ్ళాల్సిన పనుంది,

రెండయితే బ్యాంకు మూసేస్తారు."

"అయితే తమ పేరేంటి? బాబుగారొస్తే ఏం చెప్ప మన్నారు?"

"ప్రేమకుమార్ వచ్చి వెళ్ళాడని చెప్పు! మళ్ళీ వస్తా నన్నానని చెప్పు."

ప్రభాకరం బయటికొచ్చాడు. స్కూటర్ స్టార్టు చేస్తూ ఏదో అనుమానం వచ్చి ఎటాచెడ్ బేగ్ జిప్ వంక చూశాడు. అది సగం తెరచివుంది. తను దాన్ని పూర్తిగా మూసినట్టే గుర్తు! అయినా ఆ బేగ్‌లో తనేమీ దాచ లేదు కూడా. ఖాళీగానే వుంటోంది.

జిప్ పూర్తిగా లాగాడు. ఏదో కాగితం మడతలు కనిపించింది. పైకి తీశాడు.

అవి కేబినెట్ సైజు ఫోటోలు. నాలుగున్నాయి.

నాలుగింట్లోను ఓ జంట చాలా క్లోజ్‌గా, చెట్టాపట్టా లేసుకుని నవ్వుముఖాలతో చాలా సంతోషంగా, ప్రేమ సామ్రాజ్యం తనదేనని చాటి చెప్తున్నారు.

ఆ జంట—రాంగోపాల్, వసంత!

## 7

"నేనడిగినదానికి సూటిగా సమాధానం చెప్పు!" భర్త స్వరం విని ఉలిక్కిపడింది వసంత.

"అడగండి" అన్నది కళ్ళు వాల్చుకుని.

ఎకాఎకిన రామ్‌గోపాల్ ఇంటినుంచి తన యింటి కొచ్చేశాడు ప్రభాకరం. బహుశా ఆ సమయంలో వసంత యింటి దగ్గర వుండదనుకున్నాడు. కాని అతని వూహ నిజం కాలేదు. వసంత హాల్లో కూచుని ఏదో పుస్తకం చదువుకుంటోంది. అప్పుడు తట్టింది తనకు—అంతక్రితం రోజు తొందరపడి తను ఆమె పన్నెండు గంటల సమ

యంలో లేని విషయం నోరు జారాడు. అందుకే జాగ్రత్త పడివుంటుంది. తను ఏ సమయంలోనైనా రావచ్చునని అనుమానించి తన ప్రియులను కల్సుకోవటానికి పోలేదన్న మాట!

"నువు నన్నెందుకు పెళ్ళిచేసుకున్నావు?"

విస్మయంగా చూసింది భర్తవంక.

"అదేంమాట?"

"నన్నె ఎందుకు చేసుకున్నారని అడుగుతున్నాను."

"పెళ్ళిచూపుల్లో మీరు నాకు నచ్చారు, అందుకని!"

"మీ నాన్న బాగా డబ్బున్నవాడు, నేను సామాన్యమైన ఉద్యోగిని. మీ నాన్న తల్చుకుంటే యింకా బోలెడు కట్నంపోసి చాలా పెద్ద సంబంధమే తెచ్చివుండేవాడు. కాని నన్నే ఎందుకు ఎంచుకున్నాడు?"

"అదేమిటండి, యీ రోజు మీకీ అనుమానమెందుకొచ్చింది? ఎందుకో వింతగా వుంది మీ ప్రవర్తన!"

"వింతగానే వుంటుంది. ఎందుకు నన్ను చేసుకున్నావో తెలుసా? నీకిక నేను తప్పితే మొగుడు దొరకడని! నీ చరిత్ర తెలిసినవాడెవడూ నిన్ను చేసుకోడని అందుకే తొందరపడి నాకిచ్చి ముడిపెట్టేశాడు మీ నాన్న! మా వాళ్ళు అన్ని విషయాలు సరిగా ఎంక్వయిరీ చెయ్యకుండా పెద్ద సంబంధం దొరికింది కదా అని నిన్ను ముడిపెట్టేశారు."

"అసహ్యంగా మాట్లాడకండి. నా చరిత్రకేం వచ్చింది? నాకు మొగుడెందుకు దొరకడు?"

"ఎందుకా, చెడిపోయినదానివి కనక! పెళ్ళికి ముందే రాసక్రీడల్లో మునిగితేలావు గనక!"

"ఆపండి మీ ప్రేలాపన! ఇదా మీ బుర్రలో వున్న

దురూహ! ఇందుకా నిన్నట్నుంచి మీరు నా మీద నిఘా వేసి తిరుగుతున్నది? మీ కెవడు చెప్పాడో గాని నా మీద లేనిపోనివి చెప్పి మనసు విరిచాడు. మీరు ఆ మాట పట్టుకుని నన్ననుమానించి మీ నోటికొచ్చినట్టు మాట్లాడుతున్నారు. మీ మగాళ్ళ బుద్ధే అంత! తాళి కట్టిన పెళ్ళాన్ని ప్రాణానికి ప్రాణంగా మెలిగే అర్ధాంగిని అనుమానించి అవమానించడం అనాదిగా మీ మగజాతి కలవాటే!"

"ఉపన్యాసం ఆపు. రాంగోపాల్ నువ్వూ ప్రేమించు కున్నారా లేదా?"

వసంత ఉలిక్కిపడి సర్దుకుంది.

"ప్రేమించుకున్నాం."

"చాలా క్లోజ్ గా తిరిగారా లేదా?"

"తిరిగాం."

"పెళ్ళి చేసుకోవాలనుకున్నారు కదూ!"

"అవును. కాని వాళ్ళ పెద్దవాళ్ళు అంగీకరించలేదు."

"అందుకని పెళ్ళి ఎందుకులే అని యిద్దరు శోభనం జరిపేసుకున్నారు. మీ కోరికలు, సరదాలు అన్నీ తీర్చు కున్నారు. అవునా?"

"లేదు, లేదు. మేము హద్దుమీరి ప్రవర్తించలేదు."

"షటప్! నీ నాలిక తెగ్గోస్తాను. శ్యాంప్రసాద్ తెలుసా?"

"తెలుసు."

"ప్రేమ్‌కుమార్?"

"అతనూ తెలుసు. ఆ ఇద్దరూ నా క్లాస్ మేట్స్."

"అంతే కాదు. నీ ప్రియులు కూడా."

"ఆపండి. నోటికొంత వస్తే అంతా అనకండి. శాస్త

నా మాట కూడా వినండి."

"ఇంకా ఏం వినాలి? వంచకీ, నిన్ను బ్రతకనివ్వను. నన్నింత మోసం చేస్తావా? నువు నిజంగా అమాయకు రాలివనే అనుకున్నా నిన్నాళ్ళు! నీ నిజ స్వరూపం బయటపడింది. నీ రంకు నాటకమంతా తెలిసింది. నన్ను మోసం చేసిన నిన్ను ఆ రాంగోపాల్ గాడ్ని, శ్యాంగాడ్ని ప్రేమ్‌గాడ్ని అందర్నీ చంపి పాతేస్తాను. నా కసి తీర్చుకుంటాను."

ప్రభాకరం చేతిలో పొడవాటి కత్తి తళుక్కున మెరిసింది. ఒక్క ఉదుటున వసంతమీద కురికి ఆమె జుట్టు దొరకబుచ్చుకున్నాడు. కత్తిని ఆమె గుండెల్లో దించబోయాడు.

ఆమె చటుక్కున అతని పట్టు విడిపించుకుని కిందికి దొర్లింది. ప్రభాకరం ఆ ఊపుకు నిలదొక్కుకోలేక పక్కకి పడబోయి సర్దుకున్నాడు. ఆ రెండు క్షణాలు చాలు, వసంత తప్పించుకోడానికి!

బయటికి ఒక్కసారిగా పరుగెత్తింది. ప్రభాకరం బయటికి రాకుండా వీధి గుమ్మం తలుపుకి గొళ్ళెం పెట్టేసింది.

ప్రభాకరం గుండె లవిసిపోయాయి. చాలా చురుగ్గా తప్పించుకుంది. తన గురించి పోలీసులకి చెపుతుందేమో? తనని హత్య చేయబోయాడని ఆరోపిస్తుంది. పోలీసులు తనని అరెస్టు చేసి జైల్లో పడేస్తారు.

తను అనుకున్నదొకటి, జరిగిందొకటి! ఈ నలుగుర్నీ చంపి పారేశాక తనే మైపోయినా ఫరవాలేదు. ఏం సాధించకుండానే జైలుపాలైతే ఎలా?

ప్రభాకరం వెంటనే దొడ్డివైపు పరుగెత్తాడు.

చుట్టుపట్లవాళ్ళు అనుమానించడానికి ఆస్కారముంది. ఎవరికీ తమ మధ్య జరిగిన రగడ తెలిసివుండదు. వసంత చాలా తాపీగా రోడ్డుమీదికి పోయింది. తనూ ఏం జరగనట్టే బయటపడాలి!

నెమ్మదిగా దొడ్డివైపునించి వీధిలోకి వచ్చాడు. స్కూటర్ బయటికి తీశాడు.

తిన్నగా గాంధీ పార్కుకి పోనిచ్చాడు.

కాసేపు ముందు కార్యక్రమం గురించి తర్జనభర్జన చేసుకున్నాడు.

శ్యాంప్రసాద్, ప్రేమ్‌కుమార్‌ని ఒకచోటికి చేర్చాలి. ముందుగా తను వాళ్ళతో చేతులు కలిపినట్టు నటించాలి. తన ధ్యేయమంతా రాంగోపాల్‌ని చంపడమేనని వాళ్ళకి నమ్మకం కలిగించాలి. రాంగోపాల్‌ని మట్టుబెట్టడానికి వాళ్ళిద్దరి సహాయం కావాలని అడగాలి.

వాళ్ళిద్దరికీ రాంగోపాల్ అంటే మంట, తప్పక తనకి సహకరించటానికి ముందుకొస్తారు. వాళ్ళు రాంగోపాల్ ఇంటికి చేరుకోవాలి. అక్కడ రాంగోపాల్‌ని హత్య చేసి, అదే సమయంలో వ్యూహించని రీతిలో శ్యాంప్రసాద్‌ని, ప్రేమ్‌కుమార్‌ని అదే కత్తితో పొడిచి చంపెయ్యాలి. తప్పించుకు పారిపోయిన వసంతకోసం వల వెయ్యాలి.

ఈలోపల తన కోసం పోలీసులు గాలిస్తూంటారు. వాళ్ళకి దొరక్కుండా తప్పించుకుని నీలుచూసుకుని వసంతని పైలోకం పంపించెయ్యాలి. దాంతో శత్రు సంహారం పూర్తవుతుంది. తన మనసు చల్లబడుతుంది.

ఆ తర్వాత పోలీసులకి దొరికిపోయినా ఫరవాలేదు. తన కక్ష తీరుతుంది. తనకాక్కావసింది అదే! ప్రతీకార వాంఛ తన నరనరాన్ని కొరుక్కు తినేస్తూంది.

అయితే శ్యాంప్రసాద్ ఎక్కడుండేదీ తనకు తెలీదు. డ్రీమ్‌లాండ్ లాడ్జిలో తరచు రూం తీసుకుంటాడు కాబోలు! అయినా అతని పర్మనెంటు అడ్రసు తెలుసుకోవాలి ప్రేమ్‌కుమార్‌ని అడగాలి. వాడికి తప్పక తెలిసే వుంటుంది. వాళ్ళిద్దరు పార్టనర్స్‌కదా! ఒకడి ఆచూకీ మరొకడికి తెలుసు.

అయితే ముందు ప్రేమ్‌కుమార్ దగ్గరికి వెళ్ళి వాడితో స్నేహం కలుపుకోవాలి. వాడి కోరనవ్వును చూస్తూంటే తనకి ఒళ్ళు మండిపోతుంది. కాని తప్పదు, భరించాలి! ఈ ఒక్క రోజే! రేపు ఈ సమయానికి జీవితంలో ఎలానూ వుండడు.

ప్రభాకరం స్కూటర్ భానుగుడి రోడ్డు పట్టించాడు. పదినిముషాల్లో ప్రేంకుమార్ యిల్లు చేరాడు.

# 8

తన కోసమే ఎదురుచూస్తున్నట్టు వరండాలో నే కూచుని రోడ్డువంక చూస్తున్నాడు ప్రేమ్‌కుమార్.

"హల్లో బ్రదర్, నువ్వొస్తావని నాకు తెలుసు" అన్నాడు ప్రభాకరాన్ని చూసి.

ప్రభాకరంకి కారం రాసుకున్నట్టుంది.

"ఏం, ఎలా అనుకున్నావు?" అన్నాడు నవ్వు పెదవులమీదికి తెచ్చుకోనటానికి ప్రయత్నిస్తూ.

"నాకు జ్యోతిషం తెలుసు నేను చెప్పిన విషయం నిజమేనని గ్రహించే వుంటావు. స్వయంగా చూసి వస్తున్నావని నీ ముఖమే చెపుతోంది."

"అవును. నువు చెప్పింది నిజమే! రాంగోపాల్‌తో వసంతకి సంబంధముంది."

"చూశావా మరి? నీ భార్యను పాడుచేసింది వాడే!

ఓసారి పతనమయిపోయిన ఆడది మరోసారి కావటానికి వెనుతీయదు."

"నీతో పర్సనల్‌గా మాట్లాడాలి."

"ఇక్కడ మన విషయాలు మరెవరూ వినరు, పట్టించుకోరు. ఫరవాలేదు, నువ్వు చెప్పాల్సిందేదో ధైర్యంగా చెప్పు."

ప్రభాకరకరం ఊపిరి పీల్చుకుని వదిలాడు.

"నేను రాంగోపాల్‌ని చంపెయ్యాలని నిర్ణయించు కున్నాను."

"గుడ్ డెసిషన్."

"అది నా ఒక్కడివల్ల అయేపని కాదు."

"దెన్?...."

"నీ సహాయం కావాలి. హత్య చెయ్యటంలో కాదు. హత్య నేనే చేస్తాను. అది అడ్డంలేకుండా నిరాటంకంగా కొనసాగాలంటే మరో మనిషి సహకారం అవసరం. రాంగోపాల్ నీకూ శత్రువేకదా! ఏమంటావు?"

ప్రేమకుమార్ రెండు నిమిషాలు మౌనం వహించాడు.

"ఓ.కే. నాకభ్యంతరంలేదు. అయితే హత్య చాలా పకడ్బందీగా జరగాలి. నువుగాని, నేను గాని పట్టుబడ కూడదు."

"ఇంకో పనిచేస్తే....?"

"ఏమిటది?"

"శ్యాంప్రసాద్‌ని కూడా మనతో కలుపుకుంటే...."

"వాడెందుకు. వాడొట్టి రోగ్! హత్య విషయాలు బయటపెట్టిసా పెడతాడు, నమ్మకూడదు వాడ్ని."

"మనలో కలిపేసుకుంటే బయటపెట్టడు. తనూ

ఇరుక్కుంటాడు కదా బయటపెడితే!"

"ఆల్ రైట్. వాడికి కబురుపెట్టి రప్పిస్తాను. ఎప్పుడు బయలేరుదాం?"

"రాత్రి పదిదాటాక! రాంగోపాల్ గాడిని వాడింటి దగ్గరే చంపేయాలి. ఇల్లు లోపలికి వెళ్ళి చూశాను. వాడి పడకగది కూడా చూశాను. ఇంట్లో ఓ పనివాడు వంటమనిషి తప్ప ఎవరూ లేరు. వంటమనిషి రాత్రి తొమ్మిదింటికి ఇంటికి పోతుంది. ఇక ఆ ఇంట్లో వుండేది రాంగోపాల్, పనివాడు వెంకన్న మాత్రమే!

లంకంత కొంప. లోపల ఏం జరుగుతున్నదీ ఎవడికీ తెలియదు. గుట్టు చప్పుడు కాకుండా వాడి పని పట్టెయ్యొచ్చు. తప్పించుకోవటం కూడా చాలా తేలిక. సమయం కోసం వేచివుండటానికి ప్రహారీ లోపల చాలా స్థలంవుంది. అన్నీ చెట్లు పొదలు. విశాలమైన ఆవరణ."

"అంతా పరిశీలించే వచ్చావన్నమాట, గుడ్!"

"మనం ముగ్గురం ఎక్కడ కల్సుకోవాలో, ఎన్ని గంటలకి కల్సుకోవాలో ఇప్పుడే నిర్ణయించుకోవాలి."

"అవును. రాత్రి తొమ్మిది దాటాక ఇక్కడే కల్సుకుందాం. ముగ్గురం ఇక్కడ్నుంచే పోదాం. నీ స్కూటర్ తీసుకురాకు. నాకు చిన్న కారుంది. ముగ్గురం దాంట్లో పోదాం. కారు హాస్టల్ వీధిలో వున్న గారేజిలో పెట్టేస్తాను. గారేజి ఓనర్ నా ఫ్రెండ్. మనం ఎందుకొచ్చిందీ అతనికి తెలియనివ్వం. మన పని పూర్తికాగానే కార్లో పారిపోయి వచ్చేద్దాం."

"ఓ. కే. శ్యాంప్రసాద్ కి కబురు పంపిస్తావు కదూ?...."

"తప్పకుండా!"

ప్రభాకరం స్కూటర్ మీద బయిటికి దారి తీశాడు. అప్పుడే టైం రాత్రి ఏడు కావస్తోంది.

ఇంకో రెండు గంటలు ఎక్కడైనా కాలక్షేపం చేసెయ్యాలి. ఇంటికి వెళ్ళటం ప్రమాదకరం! ఆ నీచు రాలు పోలీసులకిగాని కబురు పెట్టివుంటే వాళ్ళు తన కోసం అప్పుడే వేట ప్రారంభించి వుంటారు.

పిఠాపురం రోడ్డున కాసేపు తిరిగాడు. చివరికి ఊరిచివర వున్న కాలవ దగ్గిర కాసేపు కాలక్షేపం చేసేశాడు. టైం ఎనిమిదిన్నరయింది.

స్కూటర్ స్టార్టు చేశాడు. భానుగుడి దాటి కొండయ్యపాలెంలో వున్న తన స్నేహితుడి దగ్గిరకి వెళ్ళాడు. స్కూటర్ అతని యింట్లో పెట్టాడు. దార్లో ట్రబులిచ్చిందని, రేపు తీసుకుపోతానని చెప్పాడు.

అతను నమ్మాడు.

## 9

"అంతా రెడీ! శ్యాంప్రసాద్ కూడా వచ్చాడు. నీతో మాట్లాడటానికి బిడియపడుతున్నాడు" అన్నాడు ప్రేమ్‌కుమార్.

ప్రభాకరం వరండాలోనే కూచున్న మరో వ్యక్తిని శ్యాంప్రసాద్‌గా గుర్తించాడు. పలకరింపుగా నవ్వాడు.

శ్యాంప్రసాద్ లేచి ప్రభాకరం దగ్గిరకొచ్చి చేయి చాచి కరచాలనం చేశాడు.

"సో, ఉయ్ ఆర్ ఫ్రెండ్స్! మన ముగ్గురి ధ్యేయం ఒకటే! రాంగోపాల్‌ని మట్టుపెట్టడం."

"ఎస్. కాని వాడ్ని నా చేతుల్లోనే చంపాలి. ఆ ఛాన్స్ నాది. అప్పుడే నా కసి తీరుతుంది."

"ఓ. కే. మేమిద్దరం జస్టు నీకు అసిస్టు చేస్తాం. పని

నువ్వే పూర్తిచెయ్యి."

"ఇక బయల్దేరుదామా?" అన్నాడు శ్యాంప్రసాద్.

ప్రేమ్‌కుమారు చిన్న కారు బయటికి తీశాడు.

ముగ్గురు ఎక్కారు.

కారు కదిలింది. హాస్పిటల్ వీధికి పరుగెత్తింది.

పది నిమిషాల్లో గమ్యస్థానం చేరారు.

"మీ రిద్దరూ యిక్కడే దిగిపోండి. నేను కారుని మా ఫ్రెండ్ గారేజిలో పెట్టి వస్తాను" అన్నాడు ప్రేమ్‌కుమార్.

వెనక డోరు తెరచుకొని ప్రభాకరం, ముందు సీట్లోంచి శ్యాంప్రసాద్ క్రిందికి దిగారు.

ప్రభాకరం పేంటు తడుముకున్నాడు. బొడ్లోనించి దోపిన పదునైన కత్తి చేతికి తగిలింది. అతని గుండె వేగంగా కొట్టుకుంటోంది.

ఈ రాత్రి తను మూడు నిండుప్రాణాలు తియ్యబోతు న్నాడు. రక్తం అంటేనే భయపడి దానికి దూరంగా పారిపోయే తను యీ రోజు హంతకుడిగా మారి మూడు ప్రాణాలు పొట్టబెట్టుకోబోతున్నాడు. ముగ్గురి వేడినెత్తురు రుచిచూడబోతున్నాడు.

ఎంతలో ఎంత మార్పు? ఎంతో సాత్వికుడిగా మంచి వాడిగా, పదిమందిలోనూ పరువుమర్యాదలతో అప్సరస లాంటి భార్యతో హాయిగా జీవితం వెళ్ళబోస్తున్న తనని పరిస్థితులు హంతకుడిగా, నేరస్థుడిగా మార్చివేశాయి. తనని పతనానికి, పాతాళానికి దిగజార్చుతున్నాయి.

అయినా తప్పదు, తనని ప్రత్యక్షంగాను పరోక్షం గాను మోసం చేసిన యీ దుష్టుల్ని, కిరాతకుల్ని తుద ముట్టించాలి. అంతే!

ప్రేమ్‌కుమార్ వేగంగా అడుగులు వేస్తూ దగ్గరి కొచ్చాడు. "ఓ.కే. పదండి పోదాం. వీధివైపు యింకా జనసంచారముంటుంది. పెరటివైపునించి గోడ దూకి లోపలికి ప్రవేశిద్దాం. అటు ఎవరూ మసలరు యీ సమయంలో" అన్నాడు.

ముగ్గురు రాంగోపాల్ యింటి వెనకవైపుకి ఒకరి తర్వాత ఒకరుగా చేరుకున్నారు. ప్రహరీగోడ ఎత్తుగా వుంది. అందరిలోను ప్రేమ్‌కుమార్ పొడగరి.

"మీ రిద్దరూ ముందు దూకండి. నేను చివరిగా గోడెక్కుతాను. మీ యిద్దర్నీ పైకి ఎక్కించటానికి నే నుండాల్సిందే!" అన్నాడు ప్రేమ్‌కుమార్.

గోడ దూకి లోపలికి ప్రవేశించారు.

గదుల్లో యింకా లైట్లు వెలుగుతున్నాయి.

రాంగోపాల్ యింకా నిద్రపోలేదన్నమాట!

సరే, అదీ మంచిదే, అడగాల్సిన నాలుగు మాటలూ వాడి మొఖాన అడిగేసి వాడ్ని ఎందుకు చంపాల్సి వచ్చినదీ చెప్పి మరీ చంపొచ్చు అనుకున్నాడు ప్రభాకరం.

"మీ రిద్దరూ యీ క్రోటన్స్ ప్రక్కనే వెయిట్ చెయ్యండి. అవసరపడినపుడు పిలుస్తాను" అన్నాడు ప్రభాకరం.

"అలాగే" అన్నారిద్దరు.

'ముందు రాంగోపాల్‌ని చంపిపారేసి ఆ తర్వాత వీళ్ళిద్దర్నీ ఒక్కరొక్కర్నే లోనికి పిలిచి పొడిచి చంపెయ్యాలి. అప్పుడు ఒకడికి మరొకడు సాయం రాకుండా తన చేతిలో నిశ్శబ్దంగా ఛస్తారు' అప్పటికప్పుడే తన పథకాన్ని పటిష్ఠంగా రూపొందించుకొన్నాడు ప్రభాకరం.

# 10

లోపలికి మెల్లిగా అడుగులు వేస్తూ పరిసరాలు గమనిస్తున్నాడు ప్రభాకరం.

హాల్లో ఎవరూ లేరు. వెంకన్న చెప్పిన మాటల్నిబట్టి రాంగోపాల్ పడకగది మేడమీద వున్నట్టు తను గ్రహించాడు. ప్రేమ్‌కుమార్ కూడా చూచాయగా ఆ గది గురించి చెప్పాడు.

మెల్లగా మెట్లెక్కాడు.

మేడమీద రెండు గదులున్నాయి. ఒకదానిలో లైటు వెలుగుతోంది. మరో గది చీకటిగా వుంది. వెల్తురున్న గదే రాంగోపాల్ ది అయుండాలి.

ఊపిరి బిగబట్టి అడుగులు వేస్తున్నాడు.

గది దగ్గర ఆగాడు. నిశ్శబ్దంగా వుంది.

తోశాడు. గడియ వేసిలేదు. తెరుచుకుంది.

కుర్చీలో కూచుని ఏదో రాసుకుంటున్న వ్యక్తి చటుక్కున పక్కకి తిరిగి చూశాడు.

ప్రభాకరం అతన్ని గుర్తుపట్టాడు. ఫోటోలో వ్యక్తి. అతనే రాంగోపాల్!

"ఎవరు మీరు?" చటుక్కున కుర్చీలోంచి లేచాడు.

"నేనెవరో తెలీదా? నీ ప్రేయసి, నీ ఉంపుడుకత్తె వసంతకి తాళికట్టిన మొగుణ్ని! కుక్క ముట్టిన కుండలో నీరు తాగుతున్న వాడ్ని. అర్థమైందా నేనెవరో?"

"మీరు ప్రభాకరం కదూ! రండి కూచోండి. మిమ్మల్ని రెండు మూడుసార్లు చూశాను దూరంనించి. దగ్గర్నించి చూడగానే గుర్తుపట్టలేకపోయాను."

"సర్లే, యీ ఊకదంపు కబుర్లెందుకు? నీకు రోజులు నిండిపోయాయి. దేవుడ్ని ప్రార్థించుకో! పరాయివాడి

పెళ్ళాన్ని కోరే నీలాంటి నీచుడు బతికుండకూడదు."

"ఆగు, ఏమిటి నువ్వంటున్నది?"

"వసంతని పెళ్ళిచేసుకుంటానని పాడు చేశావు. నువు పాడుచేసినదాన్ని దాని తండ్రి నాకు అంటగట్టి చేతులు దులుపుకున్నాడు. నేను జరిగిన విషయం తెలీక ఆ నీచురాల్ని నా ఆరాధ్య దేవతగా ఇన్నాళ్ళు చూసుకుంటున్నాను—కాని అది నా కళ్ళు గప్పి నీతో ఇంకా రంకు సాగిస్తూనే వుంది. అందుకే నువు పెళ్ళి కూడా చేసుకోవడం మానేశావు. అవసరం తీరిపోతోంది కదా!"

"అన్యాయంగా మాట్లాడకు. వసంతతో నాకే విధమైన సంబంధమూ లేదు. వసంత నిప్పులాంటి పిల్ల. ఆమె చెడిపోయిన మనిషి కాదు. అలాంటి భార్య దొరకటం నిజంగా పూర్వజన్మ సంకృతం. మీరు ఆమెను అపార్థం చేసుకుని అవమానిస్తున్నారు...."

"నోర్మూయ్! చెడిపోయినదాన్ని సమర్థించక ఏం చేస్తావు? నువు చేసిన పాపాన్ని, అది నాకు చేసిన ద్రోహాన్ని యీ రోజుతో అంతం చెయ్యాలనుకుంటున్నాను...." ముందుకి ఉరికాడు ప్రభాకరం. అతని చేతిలో కత్తి లైటు వెలుగులో మెరిసింది.

"ఆగు. నేను చెప్పేది కాస్త విను. ఆ తర్వాత నువు నాకే శిక్ష విధించినా ఆనందంగా అనుభవిస్తాను. దయచేసి విను."

ప్రభాకరం అతని మాటలు వినిపించుకోలేదు. కత్తి ఎత్తి డొక్కలో పొడవబోయాడు.

కాని అతని చెయ్యి గాల్లోనే ఆగిపోయింది.

ఎవరో పట్టుకున్నారు చేతిని.

వెనక్కి తిరిగి చూశాడు ప్రభాకరం.

వెంకన్న!

"బాబుగారి సేయితుడ్నని చెప్పి ఫోటో ఎవరిదని అడిగినప్పుడే అనుకున్నానుకో నువ్విలాంటి పనేదో సేత్తావని, మా బాబుగారిమీదికి కత్తి ఎత్తుతావా? నీకెంత దయిర్యం? ఈ వెంకన్న బతికుండగా మా బాబుగారిమీద సీమ కూడా వాలనియ్యడు. ఏటను కున్నావో?"

వెంకన్న కళ్ళు నిప్పులు కురిపిస్తున్నాయి.

రాంగోపాల్ నించున్న చోటినించి ఒక్క అంగుళం కూడా కదల్లేదు—జాలిగా ప్రభాకరంవంక చూశాడు.

వెంకన్న ప్రభాకరం చేతిలోని కత్తిలాగి పక్కన పడేసి, పై తువ్వాలుతో అతని రెండు చేతులు పెడ రెక్కలు విరిచి కుర్చీకి కట్టేశాడు.

ప్రభాకరం గింజుకున్నాడు. అరిచి ప్రేమ్‌కుమార్ని శ్యాంప్రసాద్‌ని పిలుద్దామనుకుని అంతలో నే ఆ ప్రయత్నం విరమించుకున్నాడు, అరిస్తే వీళ్ళు జాగ్రత్త పడవచ్చు. తన పథకం ఒక్కసారిగా తల్లక్రిందులయింది.

"ఇప్పటికైనా నే చెప్పేది విను. వసంత, నేను కాలేజీలో చదువుకుంటున్నప్పుడు ప్రేమించుకున్నమాట వాస్తవమే. ఆమె బియ్యే ఫస్టియ్యర్ చదువుతుండగా నేను బియస్సీ ఫైనల్ చదువుతున్నాను. ఆమె అందం, నడవడి, నమ్రత నన్నాకర్షించింది. ఆమెతో పరిచయం పెంచుకున్నాను. ఆమె కూడా నా పట్ల ఆసక్తి కనపరిచింది. ఒకరి మనసు ఒకరికి విప్పి చెప్పుకున్నాం. పెళ్ళి చేసుకోటానికి నిర్ణయించుకున్నాం.

"నేను ఎమ్మెస్సీ చదవటానికి వైజాగ్ వెళ్ళాను. ఓ ఆర్నెల్లు మా మధ్య ఎడబాటు కలిగింది. వసంత

బియ్యే రెండో సంవత్సరంలో వుండగా, మా పెళ్ళి ప్రసక్తి మా నాన్నగారివద్ద తెచ్చాను. ఆయన కోపంతో మండిపోయారు.

"ఆయనకి కులాలు మతాలు అంటే మహా పట్టింపు. మా ఇద్దరి కులాలు ఒకటి కాదు. అదీగాక వసంతకన్నా ఎన్నో రెట్లు పైనున్నవాళ్ళం. మాకన్నా ఆస్తిలోను అంతస్థులోను వసంత వాళ్లు చాలా కిందే వున్నారు. అది కూడా ఒక కారణమయింది మా పెళ్ళి కాకుండా చెయ్యటానికి.

"ఓ సంవత్సరం పాటు ఇద్దరం ఓపిగ్గా వేచివున్నాం, పెద్దవాళ్ళ మనసులు మారి పెళ్ళికి ఒప్పుకుంటారని! కాని, మా ఆశ అడియాసే అయింది. నేనా స్వతంత్రుడ్ని కాదు. నాన్నతో తెగతెంపులు చేసుకుని పోతే ఈ లోకంలో ఎలా బతికేది? అందునా వసంతతో ఎక్కడికి పోను? వసంత లేని లోకం ఊహించుకోలేను.

"ఆర్థికంగా స్వతంత్రం సంపాదించుకున్నాక వసంతని పెళ్ళిచేసుకోవాలనుకున్నాను. ఎమ్మెస్సీ ఫైనల్ చేస్తూనే ఉద్యోగ ప్రయత్నాలు చేస్తూండేవాడ్ని. కాని ఏ ప్రయత్నమూ కలిసిరాలేదు.

"ఇంతలో పిడుగులా వసంత పెళ్ళి శుభలేఖ నన్ను వెతుక్కుంటూ వచ్చింది. నాకు లోకమంతా చీకటై పోయినట్టయింది. అంతే! ఆ తర్వాత నేను మళ్ళీ వసంతని కలవలేదు. రెండు మూడుసార్లు మీతో వుండగా సినిమా థియేటర్ల దగ్గర, మెయిన్ రోడ్‌లోను చూశాను, అంతే! అంతకు మించి వసంతకు నాకు మధ్య ఎలాంటి పాడు సంబంధమూ లేదు. నా మాటలు నమ్మండి!"

రాంగోపాల్ కంఠం రాను రాను జీరపోయింది. అతను చెప్పినదంతా నిశ్శబ్దంగా విన్నాడు ప్రభాకరం.

వెంకన్న ఓ పక్కగా నిలబడి యజమాని వంక దీనంగా చూస్తున్నాడు.

"మీకు నామీద, వసంతమీద, ఎవరో లేనిపోనివి చెప్పి మనసు విరిచేశారు. వసంత నిజంగా దేవత! అలాంటి మనిషిని అనుమానించటం ఘోరం. ఆమెపై నున్న పవిత్రభావం యిప్పటికీ నానుండి చెరిగిపోలేదు."

"నువ్వు చెప్పింది నిజమనే నమ్మివుండేవాణ్ని. కాని నువ్వు వసంత చెంపా చెంపా రాసుకుంటూ, చెయ్యి చెయ్యి పట్టుకొని తీయించుకున్న ఫోటోలు అబద్ధం చెప్పవు."

రాంగోపాల్ విషాదంగా నవ్వాడు.

"ఆ ఫోటోలు ఓసారి పిక్నిక్‌లో నా స్నేహితుడు తీసినవి. అవి మొన్నటివరకు నా దగ్గర కాపీలుండేవి. వసంత పెళ్ళయ్యాక అవి వుండటం మంచిదికాదని, నేనే చించిపారేశాను."

"నేను నిన్ననే వాటిని కళ్ళారా చూశాను."

"అవును. నెగిటివ్ వుంటే ఎన్ని కాపీలయినా తియ్యవచ్చును. ఆ కాపీలు మీకు యెలా చేరివుంటాయో కూడా ఊహించగలను. ఆ రోజు ఆ ఫోటోలు తీసిన నా స్నేహితుడి పేరు ప్రేమకుమార్. మీకు ఆ కాపీలు పంపించే అవకాశం అతనొక్కడికే వుంది. ఎంచేతనంటే నెగిటివ్స్ అతని దగ్గరే వున్నాయి కనక."

ప్రభాకరం కాసేపు మాట్లాడలేదు.

"ప్రేమ్‌కుమార్‌కి ఆ కాపీలు నాకు పంపాల్సిన అవసరమేముంది?"

"మీ కిక్కడ మరో సంగతి చెప్పాలి. నాకు ఇద్దరు స్నేహితులుండేవారు. నాతో పాటు చదువుకున్నారు. ఒకడు ప్రేమ్‌కుమార్, మరొకడు శ్యాంప్రసాద్! వాళ్ళిద్దరికీ వసంత నాకు మధ్య నడిచిన ప్రేమ విషయం బాగా తెలుసు. పిక్నిక్‌లో వద్దంటున్నా ప్రేమ్‌కుమార్ మా యిద్దర్ని దగ్గరగా నిలబెట్టి ఫోటోలు తీశాడు. అప్పట్లో అదో సరదా, థ్రిల్. కాదనలేకపోయా మిద్దరం.

"కాని వాడు ఆ తర్వాత ఆ ఫోటోలు చూపించి నన్ను వసంతని బ్లాక్ మెయిల్ చేస్తాడని అప్పట్లో ఊహించలేకపోయాను. వాడు, శ్యాంప్రసాద్ కూడా వసంతతో అసభ్యంగా ప్రవర్తించబోయి చెంపదెబ్బలు తిన్న సందర్భాలున్నాయి. వసంత మూలంగా వాళ్ళిద్దరు నాకు శత్రువు లయ్యారు కూడా."

ప్రభాకరం తల తిరిగిపోతోంది.అయితే ప్రేమ్‌కుమార్ చెప్పిన కథ, శ్యాంప్రసాద్ ఆడిన నాటకం అంతా బూటకమేనా! వసంత నిజంగా చెడిపోలేదా?

"అయితే—వసంత శ్యాంప్రసాద్ డ్రీమ్‌లాండ్ లాడ్జిలో కల్సుకోవటం, ప్రేమ్‌కుమార్ని అత నింటిదగ్గర కల్సుకోవటం —యిది కూడా ఉత్తదే నంటావా? శ్యాం ప్రసాద్ వసంతకి రాసిన ఉత్తరం నేనే స్వయంగా చూశాను.వసంత ప్రేమ్‌కుమార్ని వాడింట్లో కల్సుకోవటం కూడా నా కళ్ళతో నేనే చూశాను."

"ఒకప్పుడు మన కళ్ళు చెవులుకూడా మనల్ని మోసం చేస్తాయి. ప్రేమ్‌కుమార్ని వసంత కల్సుకోవటానికి ప్రబలమైన కారణముంది. ప్రేమ్‌కుమార్ తను తీసిన ఫోటోలు మీకు చూపించి తన జీవితం నాశనం చేస్తానని వసంతని బెదిరించాడు. తనని కల్సుకుని ఆ ఫోటోలు, నెగిటివ్స

తీసుకోవాలని వసంత ప్రేమ్‌కుమార్‌ని ప్రాధేయపడా లని అతనింటికి వెళ్ళింది. కాని అతను వాటికి ప్రతిఫలంగా వసంతనే కోరాడు. వసంత భద్రకాళిలా విరుచుకు పడింది! 'నా భర్తకి అసలు విషయం చెప్పేసి క్షమాపణ కోరుకుంటాను. ఆయన దయతో క్షమిస్తారు. ఆయన మనసు ఉన్నతమయింది. నీ లాంటి నీచుడికి లొంగటం యీ జన్మలో జరగని పని!' అంటూ దూషించి వసంత తిరిగొచ్చేసింది. అది మీరు చూసి అపార్థం చేసు కున్నారు."

"ఇదంతా నీ కెలా తెలుసు?"

"వెంకన్నా, వసంతని యిలా తీసుకురా!" అన్నాడు రాంగోపాల్ ప్రశాంతంగా.

ప్రభాకరం నిర్ఘాంతపోయి చూశాడు.

"సాయంత్రం వసంత నా దగ్గరకొచ్చి మీరు తనని హత్య చేయబోయారని, తప్పించుకు వచ్చానని చెప్పింది. అంత క్రితం శ్యాంప్రసాద్ గురించి, ప్రేమ్‌కుమార్ గురించి మీరు అడిగారని, తను నిజం చెప్పబోతే విని పించుకోకుండా తనపై కత్తితో దాడి చేశారని, తనకి దిక్కుతోచక, యెలాగో తప్పించుకువచ్చానని చెప్పి నా సహాయం కోరింది. మీరు తనని అనుమానించి, చివరికి హంతకుడిగా మారిపోతున్నారని యేడ్చింది. నేను ప్రస్తు తానికి ఆమెని యిక్కడే వుండమని వెంకన్న తోడుగా వుంటాడని, యీ లోపల మీకు విషయం నచ్చచెపుతా నని చెప్పాను."

వెంకన్న వెంట లోనికొచ్చిన వసంత ప్రభాకరాన్ని కట్టిపడెయ్యటం చూసి, "అయ్యయ్యో! అదేమిటండీ, ఎవరిలా కట్టేశారు? వెంకన్నా, అయ్యగారి కట్లు ఊడ

దియ్యి" అన్నది ఆత్రంగా.

వసంతని చూడగానే భోరుమని యేడ్చేశాడు ప్రభాకరం.

"నన్ను క్షమించు వసూ! రాక్షసుడిలా, పశువులా ప్రవర్తించాను" అన్నాడు.

వసంత అతని తల అక్కున చేర్చుకొని ఓదార్చింది.

గుమ్మం దగ్గిర అలికిడికి అందరూ అటు చూశారు.

ఎదురుగా శ్యాంప్రసాద్, ప్రేమకుమార్ నిల్చుని వున్నారు. వాళ్ళిద్దరి చేతుల్లోను పదునైన కత్తులు తళ తళ మెరుస్తున్నాయి.

"నువ్వు యెంత సేపటికీ రాకపోపోతే ఏమయిందోనని మేమిద్దరం వెళొచ్చాం. పాపం ఇక్కడ మీరు ఒకళ్ళొ కళ్ళు ఓదార్చుకుని ఒకటైపోతుంటే చూడలేక పోతున్నాం.

ఈ వసంత వగలాడి. మా యిద్దర్నీ కొట్టి అవమా నించింది. మా ప్రేమ తిరస్కరించింది. అప్పుడే మే మిద్దరం ప్రతిజ్ఞ పట్టాం. దీనికి పెళ్ళి కాకుండా చెయ్యా లనుకున్నాం.

రాంగోపాల్ తండ్రితో యిది చెడ తిరిగి చెడిపోయిం దని, అలాంటిదాన్ని కోడలిగా చేసుకోవద్దనీ చెప్పి రాం గోపాల్‌తో పెళ్ళి కాకుండా చెయ్యగలిగాం. కాని యెలాగో నీతో దానికి పెళ్ళైపోయింది.

మాకు దక్కనిదాన్ని నువ్వు దక్కించుకుంటే చూస్తూ వూరుకునే దద్దమ్మలం కాదు. ప్లాన్ వేశాం. నువ్వు చూస్తుండగా శ్యాం నీ పెళ్ళానికి ఉత్తరం అందజేసి నట్టు నటించాడు. అది చదివి నువ్వు నీ పెళ్ళాన్ని అనుమా నించావు. దాన్ని నేను యింకా బలపరిచాను.

రాంగోపాల్ తో వసంత దిగిన ఫోటోలు నెగెటివ్స్ యిస్తాను రమ్మని మా యింటి నౌఖరుతో వసంతకి నువ్వు లేని టైంలో కబురెట్టాను. శ్యాంగాడితో ముందే చెప్పాను, యిలా రప్పిస్తానని. వాడు సరిగ్గా నీతో అదే మాట చెప్పాడు. నువ్వు వసంత నాతో గడుపుతోందని అపోహపడేలా సీన్ సృష్టించాం.

దీన్ని నీ చేతనే చంపించేద్దామనుకున్నాం. మాకు యీ రాంగోపాల్ మీద కసి, ద్వేషం. అందుకే వాణ్ణి కూడా నీ చేత చంపించేలా వల పన్నాం. నేను నువ్వు రాంగోపాల్ ఇంట్లో వెంకన్నతో మాట్లాడ్తుండగా ఫోటోలు నీ స్కూటర్ ఎటాచ్ లో దాచాను.

నీకు అనుమానం తల కెక్కిపోయింది. పెళ్ళాన్ని చంపబోయి విఫలమయ్యావు.మమ్మల్ని సహాయం కోరావు, రాంగోపాల్ని చంపడానికి! మాక్కావలసిందీ అదే! కాని యిక్కడికొచ్చాక మీ రిద్దరూ 'భాయ్ భాయ్' అంటూ ఒకటైపోయారు.

మీ మొగుడూ పెళ్ళాల్నిద్దర్నీ చంపి ఆ కేసు యీ రాంగాడిమీద రుద్దేస్తే మీ అందరి కథా ముగిసిపోతుంది...." అంటూ మెరుపు దాడి చేశాడు ప్రేమ్ కుమార్.

కాని, వెంకన్న ఒక్కసారిగా ప్రేమ్ కుమార్ మీదికి లంఘించి అతన్ని ఒడిసిపట్టుకున్నాడు.

శ్యాంప్రసాద్ వసంతమీదికి ఉరికాడు. కాని మరు క్షణంలో "అబ్బో!" అంటూ నేలకూలిపోయాడు. అతని గుండెల్లోంచి వెచ్చటి నెత్తురు ఫౌంటెన్లా విరజిమ్మింది.

విస్తుపోయి చూశాడు ప్రేమ్ కుమార్.

రాంగోపాల్ చేతిలో వున్న రివాల్వర్ పొగలు కక్కుతోంది. వెంకన్న ప్రేమకుమార్ని వదిలేసి, "బాబూ!" అంటూ ముందుకి రాబోయాడు.

ప్రేమకుమార్ ఆ అవకాశాన్ని ఉపయోగించుకో బోయాడు. కాని మరోసారి రాంగోపాల్ చేతిలోని రివాల్వర్ చప్పుడు చెయ్యకుండా గర్జించింది.

ప్రేమకుమార్ నేలకూలాడు.

ప్రభాకరం, వసంత నిర్ఘాంతపోయి చూస్తున్నారు.

"బాబూ, యెంత పని చేశారు?" అంటున్నాడు వెంకన్న.

రాంగోపాల్ జీవంలేని నవ్వు నవ్వాడు.

"వీళ్ళిద్దరూ బతికితే యింకా యెన్నో కాపురాలు కూలదోస్తారు. అందుకే వీళ్ళని పైకి పంపేశాను. నాకెలాగూ పెళ్ళాం పిల్లలు లేరు. నేనేమయిపోయినా ఫరవాలేదు. కాని సుఖంగా కాపురం చేసుకుంటున్న వసంత జీవితం నాశనమయితే నేను చూడలేను. అందుకే యిందుకు సాహసించాను. ఆత్మరక్షణకోసం యీ రివాల్వర్ కి యిదివరకే లైసెన్సు తీసుకున్నాను. దీనికి సైలెన్సర్ కూడా అమర్చాను. ఇలాంటి అవసరం రాకూడదనుకున్నాను. కాని తప్పలేదు."

"నన్ను క్షమించండి. ఇదంతా నా వల్లనే వచ్చింది" క్షమాపణ చెప్పుకుంటున్నాడు ప్రభాకరం.

"బాబూ! మీరు ఖూనీకోరుగా అందరూ చెప్పుకోవటం నేను వినలేను. మీకు పిచ్చిపడితే నూర్నేను. మీరు ఎంటనే యిక్కడ్నించి ఎల్లిపోండి. ఈళ్ళిద్దర్నీ నేనే సంపేనని పోలీసోళ్ళకి చెప్పి దొరికిపోతాను. ఆ తుపాకీ యిలాగివ్వండి" అంటూ వెంకన్న రాంగోపాల్

చేతిలోని రివాల్వర్ లాక్కోబోయాడు.

"వెంకన్నా! నువ్వు నాకు తండ్రిలాంటివాడివి. నువ్వు చెయ్యని నేరం నువ్వు నెత్తిన వేసుకుంటా నన్నా నే నొప్పుకోను. నన్ను వదులు....ప్రభాకరం! మీరు వసంతని తీసుకుని వెంటనే యింటికి వెళ్ళిపోండి! ఊఁ, ప్లీజ్ గో అవే!"

వెంకన్న ఏడ్చేస్తున్నాడు.

వసంత కళ్ళ నీళ్ళతో తన కాపరం నిలబెట్టిన రాంగోపాల్ వంక దేవుణ్ని చూసినట్టు చూస్తోంది.

రాంగోపాల్ ఫోన్ దగ్గిరికి వెళ్ళాడు.

"హల్లో, పోలీస్ స్టేషన్...." అంటున్నాడు.

ప్రభాకరం, వసంత హృదయ భారంతో ఆ యింటి నించి బయటపడ్డారు.

—: అయిపోయింది :—

సీరియల్

# రక్తం త్రాగే పిశాచం

వసుంధర



(గత సంచిక తరువాయి)

"అలా నవ్వకు—" అన్నాడు కోదండం.

"మరేం చేయను? ఇంకోలా నవ్వడం నాకు రాదు.." అంది వకుళ.

"అయితే నవ్వడం మానేయ్ ...." అన్నాడు కోదండం.

వకుళ కోదండాన్ని తినేసేలా చూసింది—"మొదట్నించీ వెధవ బుద్ధే నీది—నువ్వు సంతోషంగా ఉండడం కోసం నేను నవ్వడం మానేయాలా? నా యిష్టం—నేను నవ్వుతాను...." అంటూ వకుళ ఆగకుండా నవ్వసాగింది.

కోదండానికి ఆ నవ్వు భరించ శక్యం కాకుండా ఉంది.

"వకుళా—ప్లీజ్—" అన్నాడతను.

ఆమె నవ్వు ఆపలేదు.

"వకుళా!" అరిచాడతను.

వకుళ నవ్వు ఆపేసి—"నలుగురూ వచ్చి ఏదో జరిగిందనుకుంటారు. ఒక్క ముక్క చెప్పడానికి వచ్చాను. నువ్వేం సుఖపడ్డా ఈ నర్సింగ్ హోంలోనే! ఇందులోంచి బయట పడగానే ప్రతి క్షణం నరకం చూస్తావు" అంటూ వెనుదిరిగింది.

ఇంతలో ఆ గదిలోకి ఓ నర్సు పరుగున వచ్చి—"ఏం జరిగింది?" అనడిగింది.

"ఏమీ లేదు. మా మామయ్య ఆడది నవ్వితే చూడ లేడు—" అని అక్కణ్నించి బయటపడింది. ఆమె హాల్లోకి వచ్చేసరికి ఇందాకటి వ్యక్తి ఇంకా అక్కడే కూర్చుని ఉన్నాడు.

"హలో!" అంటూ వకుళే అతన్ని పలకరించింది.

అతనులిక్కిపడి ఆమెను చూసి మరింత ఉలిక్కిపడి—"మీకు.... మీకు.... ఏం కావాలి?" అన్నాడు.

"నాకేం అక్కర్లేదు. మీకింకేమైనా కావాలేమో తెలుసుకుందామని వచ్చాను...." అంది వకుళ.

"అబ్బే.... నాకేమీ వద్దు...." అన్నాడతను.

"గుడ్.. కీ పిటప్...." అని అక్కణ్నించి రోడ్డు మీదకు వచ్చింది వకుళ.

అప్పుడు ముందు బట్టల షాపుకి వెళ్ళిందామె. ముందు రోజు కౌంటర్లో ఉన్న వ్యక్తి ఆమెను చూసి గుర్తుపట్టి ఉలిక్కిపడ్డాడు.

"హలో! రతన్‌లాల్‌కి ఫోన్ చేసి డబ్బు తీసుకున్నారా?" అందామె.

"లేదు...."

"చెంప దెబ్బ తినేసరికి మీకు మతిపోయినట్లుంది. ఇలాగైతే వ్యాపారమేం చేస్తారు?" అంది వకుళ.

అతను నీళ్ళు నమిలాడు....

"చూడండి మిస్టర్...." అని ఆగిందామె. అప్పుడతను తన పేరు సత్యారావు అని చెప్పాడు.

"చూడండి మిస్టర్ సత్యారావ్! నేను మిమ్మల్ని కొట్టింది డబ్బు ఎగవేయడానికి కాదు. ఆడవాళ్ళని చిన్న మాటలని తేలిక చేయకుండా ఉండడానికి. నాకు మీ షాపులో వెరైటీ నచ్చింది. అన్నీ ఇక్కడే కొనాలనుకుంటున్నాను. డబ్బు రతన్‌లాల్ ఇస్తాడు. ఎందుకైనా మంచిది—ఇప్పుడే ఓ మనిషిని ఆయన ఇంటికి పంపండి. ఇల్లంటే ఆయన పెళ్ళాం బిడ్డలుండేది కాదు. ఆయన తన కోసం ప్రత్యేకంగా కట్టించుకున్న బంగళా లేదూ.... అది.... నే నిక్కడే బట్టల బేరం చూస్తూంటాను. మీ మనిషిని టాక్సీలో పంపి మూడు వేలు తెప్పించండి. టాక్సీ డబ్బులు నాదేలెండి...." అని నవ్వి లోపలకు వెళ్ళింది వకుళ.

అతను ముందు కాస్త తెల్లబోయినా తర్వాత తేరుకుని

ఓ మనిషిని పంపించాడు. అతడికి వకుళ ఓ చీటీ రాసిచ్చింది. ఆమె ఏం రాస్తుందోనని ఆత్రుతగా చూస్తున్న సత్యారావు ఉలిక్కిపడ్డాడు.

"రతన్‌లాల్! ఈ రోజు నీ రక్తం తాగుతాను. ఇతడికి మూడువేలిచ్చి పంపించు—వకుళ!"

చీటీ తీసుకుని ఆ కుర్రాడు వెళ్ళిపోయాడు. సత్యారావు మాత్రం ఆలోచనలో పడిపోయాడు.

ఎవరీ వకుళ! ఏమి ఈమె అసాధారణ ప్రవర్తన? నిన్న ఆమె తనను కొట్టిన దెబ్బ సామాన్యమైనదికాదు. కుసుమ కోమలమైన ఆమె చిన్నారి చేతుల్లో అంత బలముంటుందని ఎవ్వరూ ఊహించలేరు. ఇప్పుడీమె రతన్‌లాల్‌కు రాసిన ఉత్తరం కూడా చిత్రంగా వుంది.

అందులోని భాషకు అర్థమేమిటి? వకుళ రతన్‌లాల్ని బ్లాక్ మెయిల్ చేస్తోందా? రక్తం తాగుతానంటే అర్థమేమిటి? అదేమైనా కోడ్ భాషా?

లోపల వకుళ బేరం అవుతూండగా వెళ్ళిన కుర్రాడు మూడువేలూ తీసుకుని వచ్చాడు.

సత్యారావు ఆ కుర్రాణ్ని నెమ్మదిగా అడిగాడు—"ఆ చీటీ చూశాక రతన్‌లాల్ ప్రవర్తన ఎలా ఉంది?"

ఆ కుర్రాడు కూడా నెమ్మదిగానే చెప్పాడు—"ఆయన ఆ ఉత్తరం చూసి చాలా సంతోషపడ్డాడండి. మూడుసార్లు ఆ చీటీని ముద్దుపెట్టున్నాడండి. నాకు పది రూపాయలు బహుమతి కూడా ఇచ్చాడండి—"

సత్యారావు ఆశ్చర్యపడ్డాడు. తన అంచనా ప్రకారం రతన్‌లాల్ ఆ చీటీ చూసి కలవరపడాలి. జుత్తు పీక్కోవాలి. ఒకవేళ బయటివాడి దగ్గర దొరికిపోకూడదని లోపలి భావాలు దాచుకున్నప్పటికీ—ఆ చీటీ

చూసి సంతోషించే అవకాశం ఏమాత్రమూ లేదు. అందులోనూ ఆయన ఈ వస్త్రాడికి పది రూపాయల బహుమతి కూడా ఇచ్చాడు అంటే—ఆ చీటీ ఆయనకు సంతోషాన్ని కలిగించింది. రతన్‌లాల్ మనస్ఫూర్తిగానే మొత్తం మూడు వేలూ ఇప్పుడిచ్చాడు.

చటుక్కున సత్యారావుకు ఏదో స్ఫురించింది. ఈ వకుళ శృంగారాధి దేవత అయుండాలి. మగవాడిని తృప్తిపరచడంలో ఆమెకు ఎన్నో కొత్త విద్యలు తెలిసి ఉండాలి. అందువల్లనే రతన్‌లాల్ ఈమెకు దాసుడయ్యాడు. రక్తం తాగడమనేది వారిద్దరి మధ్యా—శృంగారానికి సంబంధించిన ఏదో కోడ్ అయుండాలి. అతనప్పటికప్పుడు ఆ కోడ్‌ను డీకోడ్ చేయడానికి ప్రయత్నించసాగాడు. అది మానసికంగా అతడికి మంచి తృప్తిని స్తున్నట్టుంది. కానీ ఒకరిద్దరు కస్టమర్స్‌కు చిల్లర ఎక్కువిచ్చేశాడు.

వకుళ ఆ రోజు మరో నాలుగు చీరలు కొన్నది. అరడజను లంగా గుడ్డలు, నాలుగు జాకెట్టు గుడ్డలు తీసుకుని-నిన్నటిదీ, ఆ రోజుదీ కలిపి డబ్బు ఇచ్చేసింది. సేల్స్ బాయిలంతా ఆమెతో ఆ రోజు చాలా జాగ్రత్తగా వ్యవహరించారు.

ఆమె డబ్బు ఇస్తూంటే సత్యారావామెను పరీక్షించి చూశాడు. మనిషి చాలా అందమైనది. ఈ అందం, అవయవాల పొందిక—రతన్‌లాల్ వంటి వాడి దగ్గర వృథా అయిపోకూడదు. తన అదృష్టం కూడా పరీక్షించుకుంటే....

వీలైనంతగా స్వరం తగ్గించి—"మిస్! మరోలా అనుకోకండి—మీరు నా రక్తం తాగరూ?" అన్నా

డతను. ఆ నేసి ఆమె చేతికి అందనంత వెనక్కి వెళ్ళాడు.

వకుళ నవ్వింది. ఎప్పటిలాగే నెమ్మదిగా, భయంకరంగా........అక్కడున్న వారి నందర్నీ ఆకర్షించే విధంగా!

అక్కణ్నించి వెళ్ళిపోతూ—"నాకింకా చిల్లర వస్తుంది. కానీ మరోసారి తీసుకుంటాలెండి!" అంది.

తరువాత ఆమె టైలరింగ్ షాపుకి వెళ్ళి—"నిన్న నీ పేరడగడం మరిచాను—" అంది.

"రాజబాబు—"

"మిస్టర్ రాజబాబూ—నా బట్టలు కుట్టేవా?" అందామె.

"మా షాపులో టైమంటే టైమే—" అంటూ ఆమె జాకెట్స్ ఇచ్చాడు.

"ట్రయల్ రూముందా?"

"ఉంది—"

వకుళ ట్రయల్ రూంలోకి వెళ్ళి జాకెట్ వేసి చూసుకుంది. ఆమెకు తృప్తిగానే అనిపించింది.

షాపులోనే లంగా గుడ్డలు, జాకెట్ గుడ్డలు ఇచ్చి యెలా కుట్టాలో చెప్పింది.

"మిస్టర్ రాజబాబూ నాకో చిన్న హెల్ప్ చేసి పెడతావా?"

"చెప్పండి—"

"జాకెట్లు కుట్టావు కదా—దాన్నిబట్టి నాకే నెంబరు బ్రా కావాలో నీకు తెలుస్తుంది. డబ్బులిస్తాను—మంచి కంపెనీవి ఓ అరడజను బ్రాసరీలు తెప్పించిపెట్టు. నాకు నెంబరు తెలియదని ఆశ్చర్యపోకు. ఇంతవరకూ నేనవి

వాడ లేదు—"

ఆమె మాటలు రాజబాబుకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించాయి. కానీ అతనేమీ అనకుండా ఆమె దగ్గర డబ్బు తీసుకుని—తన కొట్లో కుర్రాడికి నెంబరు చెప్పి పంపించాడు. కుర్రాడు ప్యాకెట్ తెచ్చి యివ్వగానే—ఆమెకు అందించి—"మీరు చాలా విచిత్రమైన మనిషిలా ఉన్నారు. నిన్న జరిగింది కలో, నిజమో ఇంతవరకూ నమ్మలేకుండా ఉన్నాను—" అన్నాడు రాజబాబు.

"ఆ సందేహం తీర్చడం పెద్ద లెక్కలోది కాదు—ట్రయల్ రూంలోకి పద—" అందామె.

ఇద్దరూ అక్కడకు వెళ్ళాక ఆమె అక్కడి కిటికీ తలుపులు తీసింది. నాలుగుండవలసిన చోట మూడే ఊచలున్నాయి. వకుళ మరో ఊచను లాగి దారంలా ఉండచుట్టేసి క్రింద పడేసి—"కలో, నిజమో యిప్పుడు తెలిసిందా నీకు?" అనడిగింది.

రాజబాబుకు నోట మాటరాలేదు. అతను కన్నార్పకుండా ఆమెవంకా, క్రిందపడి వున్న ఊచవంకా చూడసాగాడు.

వకుళ అతడి చేతిలో పాతికరూపాయలు పెట్టి—"ఇది కట్టుకూలి కాదు. కిటికీకి కొత్త ఊచలు వేయించుకో—" అని అక్కణ్ణించి బయటకు వచ్చేసిందామె. ఆ తర్వాత వకుళ తిన్నగా ఇల్లు చేరింది. లోపలకు వెళ్ళి గడియ వేసింది. తన గదిలోకి వెళ్ళి దీపం వేసింది.

గదిలో మధు కూర్చుని వున్నాడు.

"నువ్విక్కడున్నావా?" ఆశ్చర్యంగా అంది వకుళ.

"వచ్చేసరికి కాస్త ఆలస్యమైంది. నువ్వెక్కడి

కళ్ళావో తెలియదు. నిన్ను చూడకుండా ఉండలేక యిక్కడ యీ గదిలో కూర్చున్నాను—" అన్నాడు మధు.

వకుళ ఆతడివంక ఆప్యాయంగా చూసి—"రక్తం తెచ్చావా?"

"అదెంత సేపు. క్షణంలో పనైపోయింది—" అంటూ మధు ఆమెకు రక్తపు సీసా యిచ్చాడు. వకుళ ఒక్క గుక్కలో ఆరక్తం తాగి—"మధూ! నీ మేలు మరువలేను. స్నానానికి ఈ ద్రావకం దొరకడంలో నేనిప్పుడు పగలు కూడా బయటకు రాగల్గుతున్నాను. ఇంక నాకే అడ్డంకులూ లేవు. ఎప్పుడు ఎక్కడ కావలన్నా యధేచ్ఛగా సంచరించగలను—" అంది. ఉత్సాహంతో ఆమె నవ్వగా మధు కూడా శృతికలిపాడు.

"నువ్వు నవ్వకు—" అంది వకుళ. ఆతడి నవ్వు ఆమెకు నచ్చలేదు.

మధు వెంటనే నవ్వు ఆపేశాడు.

"మధూ! ఈ ఇల్లు మనకు శాశ్వతం కాదు. నువ్వు నాకోసం ఒక మంచి ఇల్లు చూడు. వీలయితే అది కొనేసుకుందాం. లేదా అద్దెకు ఉందాం. మనిద్దరం ఒక చోటే ఉందాం—మనం సాధించాల్సిన పనులు ఎన్నో వున్నాయి. నీకు నచ్చిన ఇల్లొకటి తొందరగా చూడు. ఇంట్లో కనీసం నాలుగు గదులుండాలి. అన్నీ విశాలంగా ఉండాలి. ఒక విశాలమైన బాత్‌రూం—అన్నీ ఆధునిక సౌఖర్యాలతోటి వుండాలి. ఇక్కడ నేనింక ఎన్నాళ్ళో ఉండలేను—" అంది వకుళ.

"అలాగే వకుళా—మరి నేను వెళ్ళొస్తాను...." అన్నాడు మధు.

"మంచిది. వెళ్ళిరా!" అంది వకుళ.

"కానీ...."అని ఆగాడు మధు.

"ఏమిటి?"

"వకుళా, ప్లీజ్ ....ఒక్కసారి నా రక్తంతాగవూ?" అన్నాడు మధు. అతడి కళ్ళు ఆమెని అర్థిస్తున్నాయి.

వకుళ మధువంక అదోలా చూసి—"అది తప్పు ఇంకేమైనా అడుగు—" అంది.

"అయితే...." అని ఆగాడు మధు.

"చెప్పు...."

"నువ్వు స్నానం చేస్తూంటే చూడాలని ఉంది—" తడబడుతూ అన్నాడు మధు.

వకుళ అతణ్ని సమీపించి—"కాస్తోకూస్తో నీకు ఇంకా నా మీద ప్రేమ వుంది—" అంటూ అతడి బుగ్గలపై మృదువుగా ముద్దు పెట్టుకుంది. "సరే—నీ కోరిక తీరుతుంది—" అంటూ గాలిలోకి ఎగిరింది.

మధు ఆమెవంక ఆత్రుతగా చూస్తున్నాడు.

చూస్తూండగా గాజు సిలెండర్లో పై మూత గాలిలోకి తేలింది. అందులోని బొమ్మ పైకి ఎగిరి గదిలో ఓ మూలకు వెళ్ళిపోయింది. వకుళ వంటిమీదనుంచి ఒకో వస్త్రమే రాలి నేలమీద పడింది. ఆమె గాజు సిలెండర్లోకి దిగింది. వెంటనే పైన మూత వేసుకుంది.

మధు రెప్పలార్పకుండా వకుళ సౌందర్యాన్ని చూశాడు. ఆమె మానవ కన్యలా లేదు. దేవకాంతలా గున్నది.

ముఖంనుంచి కాళ్ళవరకూ ఆ సౌందర్యంలో ఎక్కడా ఏ లోపమూ లేదు.

ఒకానొకప్పుడీ వకుళ తన్ను ప్రేమించింది. తను

వివాహానికి సిద్ధపడితే ఆమె భార్య కావడానికి సిద్ధపడింది. అప్పట్లో తన ఊహాలు వేరే ఉన్నాయి. చూస్తూ చూస్తూ ఒక అభాగ్యురాలి మెటలో తాళి కట్టడం ఇష్టం లేకపోయింది. అవకాశం వస్తే ఉపయోగించుకుందామనే కాచుకుని కూర్చున్నాడు. అవకాశం రాలేదు.

ఇప్పుడు అవకాశం పూర్తిగా పోయింది. ఆమె ఎప్పటికీ తనది కాలేదు. కానీ తను ఆమె వశమైపోయాడు. ఆమె ఎలా చెబితే అలా నడుచుకుంటున్నాడు.

కానీ ఇంత అందం ఎవరికీ కాకుండా పోయింది.

ఈ తప్పు ఎవరిది?

వకుళ ద్రావకంలో కేరింతాలు కొడుతోంది. నవ్వుతోంది. గాజు జాడీలోంచి ఆమె మాటలు సన్నగా వినపడుతున్నాయి. అసలే భయంకరంగా ఉండే ఆమె నవ్వు గాజు జాడీలోంచి వింటూంటే మరింత సన్నబడి ఇంకా భయంకరంగా ఉంది.

వకుళ ఆ గాజు జాడీలో పైకీ క్రిందికీ కదుల్తోంది. దేవతాశిల్పి మలిచిన అద్భుతమైన పాలరాతి శిల్పంలా మెరిసిపోతోందామె. ఆ అందాన్ని చూస్తూంటే—మనిషి బట్టను కనిపెట్టడంవల్ల ప్రపంచంలో సౌందర్యానికి తీరని అన్యాయం జరిగిందనిపిస్తుంది. కొంతమంది బట్టలు వేసుకున్నప్పుడు బాగుంటారు. కొందరు బట్టలు లేనప్పుడు బాగుంటారు. కొందరు రెండు విధాలా బాగుంటారు.

వకుళ సౌందర్యం తలచుకుంటే మధుకు దుఃఖం వచ్చింది. అతడు ఆగకుండా ఏడ్వనారంభించాడు.

వకుళ కేరింతలు ఆపి—"యేమయింది మధూ....!" అంది.

"నువ్వు....నువ్వు....యెవరికీ కాకుండా....యెందుకూ కాకుండా....అయిపోయావు. ఇది నా కెంత బాధ కలిగిస్తోందో నీ కర్థంకాదు...." అన్నాడు మధు.

వకుళ ద్రావకంలో కూర్చుంది.—"మధూ! గత జల సేతు బంధనం అనవసరం. నీకు నా గురించి బాధగా వుంటే నువ్వు కూడా నాకులాగే ఎవరికీ కాకుండా ఎందుకూ కాకుండా అయిపో!"

"అలా అయిపోవాలనే నా కోరిక—"

"సరే—ఇంక వెళ్ళు—"

మధు వెళ్ళిపోగానే వకుళ తిరిగి ద్రావకంలో కేరింతలు కొట్టసాగింది.

## 19

"ఆ బుగ్గలమీద రక్తపు మరకలేమిట్రా—" అంది మధు తల్లి.

"ఎక్కడమ్మా — నాకేమీ కాలేదే?" అన్నాడు మధు.

"బాగానే వుంది. నీ వంటికి గాయమైనా నీకు తెలియడంలేదన్నమాట! నీ గురించి నాకు బెంగగా వుంది. కొద్ది రోజులుగా నీ ప్రవర్తన ఏదోలాగుంటోంది—" అంటూ ఆవిడ కాసిని నీళ్ళు తీసుకుని వచ్చి కొడుకు బుగ్గలు—తడి కొంగుతో తుడిచింది. అయితే ఆవిడ ఆశ్చర్యపోయేలా ఆ రక్తపు మరకలు మాయమయ్యాయి.

"అయితే నీకేం దెబ్బతగల్లేదన్నమాట—మరి ఆ రక్తపు మరకలెక్కణ్ణించి వచ్చాయి!"

మధు తల్లిని కసిరాడు — "మగాణ్ని—లక్ష పనులు నాకు....నువ్వు నన్నేమీ అడగొద్దు—"

అయితే తల్లి బెదరలేదు—"నువ్వు మగాడివేకావచ్చు.

కానీ నేను నీకు తల్లిని. నవ మాసాలు మోసి—ఓర్పుతో పెంచితే—ఇప్పటికింత వాడివయ్యావు. నిన్న నువ్వు నాకు అంత డబ్బివ్వగానే అనుమానం వచ్చింది. నువ్వు కాని పని ఏదో చేస్తున్నావని. నిన్న డబ్బుకి రక్తం అంటు కుంది. ఏదో ఓ రోజున నువ్వు కటకటాల వెనక్కు వెడతావు. మగాణ్ని... నాకు లక్ష పనులుంటాయంటే పోలీసులూరుకోరు. చావదన్ని నిజం కక్కిస్తారు. నువ్వేం చేస్తున్నావో నాకు చెప్పు. మంచిచెడ్డలు విచారించి చెబుతాను. అది నా బాధ్యత. నా కర్మకొద్దీ ఈ సమ యంలోనే ఆయన ఆఫీసు టూర్లో వున్నారు. ఆయన వచ్చేదాకా నీ బాధ్యత నాది. తర్వాత అన్నీ ఆయనే చూసుకుంటారు—"

మధు కాస్త తగ్గి—"చెప్పడానికేమైనా వుంటే నేనే చెబుతాను కదమ్మా.—" అన్నాడు.

"నువ్వా రతన్‌లాల్ దగ్గర పనిచేస్తున్నావు. ఆయన నీకు రోజూ వందలకు వందలిస్తాడు. డబ్బున్నవాళ్ళ ఔదార్యాన్ని నేను నమ్మను. ఆయన నీవల్ల అంతకంతా ప్రతిఫలం పొందుతున్నాడు. ఆ విధంగా నువ్వు బలై పోతున్నావని నా అనుమానం. అందుకే నేను నిన్ను నిలదీస్తున్నాను—" అంది మధు తల్లి.

"బాగుందమ్మా — నువ్వన్నీ తప్పుగా అర్థం చేసు కుంటున్నావు. రతన్‌లాల్ చాలా పెద్దమనిషి. ఆయన నాకు డబ్బిస్తున్నాడంటే—వెధవ పనులు చేయమని కాదు. వకుళ గురించి - ఆ రతన్‌లాల్ వకుళ బానిస!" అన్నాడు మధు.

మధు తల్లి ముక్కుమీద వేలేసుకుని—"ఏమన్నావ్? ఆఖరికా పిల్ల ఇలా తయారయిందా? సిగ్గూ, శరం వది

లేసిందన్నమాట! అయితే నువ్వసలాపిల్లతో ఇంక తిరగ టానికి వీల్లేదు. జీవితంలో డబ్బొక్కటే ముఖ్యంకాదు. నా మాట విను. నాలుగు రోజులు ఇల్లు కదలకు—" అంది.

"అమ్మా-వకుళ నేమైనా అనుకుంటే కళ్ళు పోతాయి. ఆ పిల్ల నిప్పులాంటిది...." అన్నాడు మధు.

"నిప్పులాంటి పిల్లయితే రతన్‌లాల్ దానికి బానిస ఎందుకౌతాడు—నీ వెర్రిగానీ!" అంది మధు తల్లి.

ఆ ప్రశ్నకు జవాబివ్వకుండా-"వకుళ నిప్పు. అందులో సందేహంలేదు—" అన్నాడు.

"డబ్బు లేని నీలాంటి వెధవలకు అది నిప్పులాగే వుంటుంది. దానిఅసలు రంగు డబ్బున్నవాళ్ళకే తెలుసుంది—" అంది మధు తల్లి. ఆమె ఇంకా ఆ మాటలు పూర్తి చేయకుండానే — ఎవరో చెవి దగ్గర గుసగుస లాడినట్లు—"అత్తయ్యగారూ!" అని వినిపించింది.

ఆ పిలుపుకి ఆవిడ ఉలిక్కిపడింది.

మళ్ళీ చెవుల దగ్గర అదే పిలుపు వినిపించింది.

"ఎవరూ?" అని అరిచింది మధు తల్లి.

"నేను — వకుళను—" స్వరం గుసగుసలాడినట్లే వుంది.

"వకుళా—ఇలా వచ్చావేం?" అన్నాడు మధు.

"నీ బుగ్గలమీదకు రక్తం ఎలా వచ్చిందో మీ అమ్మ గారికి చెబుదామని—!" అంది వకుళ.

తన వెనకనే నిలబడివున్న వకుళను చూసింది మధు తల్లి. తడబడుతూ—"నువ్వెప్పుడొచ్చావమ్మా!" అంది.

"మధు వెనకాలే నేనూ వచ్చాను. నా గురించి మీరే మనుకుంటున్నారో తెలుసుకోవాలనిపించి—రహస్యంగా

మీ మాటలు విన్నాను. పాపం మధు తప్పేంలేదు. రక్తం తాగే పిశాచానిక్కూడా అతడంటే ముద్దువచ్చి రెండు బుగ్గలమీద ముద్దుపెట్టుకుంది. దాని పెదాల రక్తం అంటుకుంది—" అంది వకుళ.

"నువ్వేమంటున్నావో నాకర్థం కాలేదు—" అంది మధు తల్లి. వకుళ తననేదో వేళాకోళం చేస్తోందని ఆమెకు అనుమానం వచ్చింది.

"మీ ఇంట్లో ఆడా, మగా కలిసి తీయించుకున్న ఫోటోలేమైనా వుంటే తీసుకురా మధూ!" అంది వకుళ.

"ఏమిటమ్మా నీ అథార్టీ!" అంది మధు తల్లి చిరాగ్గా.

"ముందు మధును ఫోటో తీసుకురానీండి—" అంది వకుళ.

మధు లోపలకు వెళ్ళి ఓ ఫోటో తీసుకువచ్చాడు. ఏదో పెళ్ళిలో తీయించుకున్న ఫోటో అది. అందులో నలుగురు చిన్నపిల్లలూ, అయిదుగురు మగాళ్ళూ నలుగు రాడవాళ్ళూ వున్నారు.

"ఆ ఫోటో ఓసారి మీ అమ్మకు చూపించు—" అంది వకుళ. మధు వెంటనే ఫోటో తల్లికిచ్చాడు. వకుళ మళ్ళీ గుసగుసలాడుతున్నట్లుగా — "అత్తయ్యగారూ" అంది.

ఆ పిలుపు మధు తల్లికి నచ్చలేదు. ఉలిక్కిపడినట్లు వకుళను చూసిందావిడ.

"అందులో ఎవరెవరున్నారో బాగా గుర్తుపెట్టుకోండి. నాకోసారి ఆ ఫోటో ఇలా ఇవ్వండి—" అని ఆవిడ ఇచ్చేలోగా తనే బలవంతంగా ఆవిడ దగ్గర్నుంచి ఫోటో తీసుకుంది.

మరుక్షణం అక్కడ కాగితం కాలిన వాసన వేసింది.

వకుళ ఆ ఫోటోను మధు తల్లికిచ్చేసి గుసగుసలాడుతున్నట్లుగా మళ్ళీ—"అత్తయ్యగారూ!" అంది. ఆమె అలా పిలిస్తే మధు తల్లికి గుండెలోంచి బెదురు పుట్టుకొస్తోంది.

"నేను నిప్పులాంటిదాన్ని కాదు. నిప్పును. మగాళ్ళు ఫోటోలో వుండగా నన్ను తాకినాసరే ఏమైపోతారో ఓసారి ఫోటోకేసి చూడండి—" అంది వకుళ.

మధు తల్లి ఫోటోకేసి చూసి దిగ్భ్రాంతురాలైపోయింది. ఫోటోలో నలుగురూ చిన్నపిల్లలూ నలుగురాడవాళ్ళు బాగానే వున్నారు. అయిదుగురు మగవాళ్లూ ఉన్నంతమేరా అది కాలిపోయింది. సరిగ్గా అంతే మేర కాలడం ఆవిడకు ఆశ్చర్యంగానే వుంది.

ఆవిడ ఫోటోకేసి — వకుళకేసీ మార్చి మార్చి చూసింది.

"ఇది చెప్పడానికే వచ్చాను. మరి నేను వస్తాను. మధూ — ఒక్కసారి రోడ్డుదాకా వస్తావా?" అంది వకుళ.

ఆమె నడుస్తూంటే మధు అనుసరించాడు. మధు తల్లికి అడుగు ముందుకు పడలేదు. వెళ్ళిపోతున్న వకుళవైపూ, తన చేతిలోని కాలిన ఫోటోవంకా ఆవిడ మార్చిమార్చి చూస్తూనే వుంది. ఆవిడ కళ్ళముందు వకుళ ఇంట్లోని గాజుబాడీ, అందులోని బొమ్మా ఒక్కసారి మెదిలాయి. అంతలోనే పుల్లారావు గుర్తొచ్చాడు. వెంటనే ఆ బొమ్మ స్థానంలో వకుళ ఉన్నట్లూ, కేరింతలు కొడుతూ—పైకీ—క్రిందకూ తిరుగుతున్నట్లూ—అనిపించిందావిడకు.

వెంటనే ఆవిడ కెవ్వుమని కేక వేసి కూలబడిపోయింది.

అప్పటికి మధు, వకుళ రోడ్డుమీదకు వచ్చారు. ఇద్దరికీ ఆ కేక వినబడింది.

"అ త్తయ్యగారు భయపడినట్లున్నారు-" అంది వకుళ నవ్వుతూ.

"భయపెట్టాలనే కదా నువ్వొచ్చింది!" అన్నాడు మధు.

"అవును. నా శక్తులన్నీ ప్రదర్శించి అందర్నీ హడల గొట్టాలని వుంటోంది. ఈ ప్రపంచాన్నే ఓ ఊపు ఊపాలని వుంటోంది. రోజురోజుకీ ఈ కాంతి ప్రబలి పోతోంది. ఈ వీధిలో ఇంకెన్నాళ్ళో వుండలేను. మనం త్వరగా ఇల్లు మార్చాలి. రేపంతా అదే పని నీకు! మంచిల్లు చూడు—" అంది వకుళ.

"ఇంకా చెప్పాల్సిందేమైనా వుందా?"

"వుంది. రక్తం తాగగానే మూతి తుడుచుకోవడం మరిచిపోతే గుర్తు చేస్తూండు. ఇది చెప్పాలనే వచ్చి మీ అమ్మగారితో ఓ ఆట కూడా ఆడి వెళ్తున్నాను. ఇంక వెళ్ళు—" అంది వకుళ.

## 20

బస్సు దిగగానే జోగారావు భార్యతో—"ధర్మా సుపత్రిమీదుంచి వెడదామా?" అనడిగాడు.

"అంతా మీ పిచ్చిగానీ ఈ పాటికి వకుళ మనింటికి వెళ్ళిపోయుంటుంది. మనం ముందు ఇంటికే వెడదాం—" అంది శారద.

జోగారావు మాట్లాడలేక ఊరుకున్నాడు. కానీ అతడికి మనసులో దిగులుగా వుంది. రిక్షాలో ఎక్కించి నప్పటి కూతురి శరీరం ఎలా సలసల కాగిపోతోందో అతడికి గుర్తుంది. ఆ పరిస్థితుల్లో ఆమెను వదిలేసి వెళ్ళి

పోతున్నందుకు తన్ను తనే నిందించుకున్నాడతను.

శారద సామాను లెక్కచూసి— "అన్నీ సరిగ్గానే వున్నాయి. మీరు రిక్షా బేరమాడి తీసుకురండి" అంది.

జోగారావు నాలుగడుగులు వేసి రెండు రిక్షాలు పిల్చుకుని వచ్చి—"మనమెలా కావాలంటే అలా తీసుకు వెడతారుట. ధర్మాసుపత్రి మీదనుంచి తీసుకువెళ్ళినా ఎక్కువ తీసుకోరుట—" అన్నాడు.

శారద భర్త కళ్ళలోకి తీవ్రంగా చూసింది. ఈ పర్యాయం అతడు భయపడలేదు. అతడి కళ్ళలోని అరింపును ఆమె గుర్తించింది.

ఇటీవల భర్త కూతురి గురించి కలవరపడుతున్నాడని ఆమె గ్రహించింది. అత్తారింట్లో వదినగారి కొడుకు బారసాలకు వచ్చినా అతడు ప్రతిరోజూ అన్యమనస్కంగానే వున్నాడు. ఎన్నడూ లేనిది అల్లుడలాగుండడం చూసి అత్తమామలు అడిగారు కూడా. అయితే శారద తలిదండ్రులకు వకుళ జబ్బు గురించి చెప్పలేదు.

"సరేలెండి—అసుపత్రిమీంచే వెడదాం. మీ వెర్రి గానీ అదింకా అక్కడెందుకుంటుంది? అప్పుడే దాన్ని దిగవిడిచి వారంకావస్తోంది—" అంది శారద.

'వళ్ళెరుగని జ్వరంలో వున్న పిల్లని వదిలేసి వారం రోజులున్నానన్నమాట—' అనుకున్నాడు జోగారావు. జ్వరమెప్పుడు తగ్గిందో, పథ్యమెవరు పెట్టారో—అదిప్పుడసలెలాగుందో?

భర్త మాట్లాడకపోవడం చూసి శారదే మళ్ళీ అంది- "మా బావకీ ఊరు ట్రాన్స్‌ఫరయింది. మనిల్లు పెద్దదే కదా అని వాళ్ళని మనింటికొచ్చి వుండమన్నాను. ఎందు

కనుకున్నారు? వకుళ ఆరోగ్యం కుదుటపడి వుంటుందన్న నమ్మకం నాకుండబట్టే!—ఎంత సవతి తల్లినైనా పెంచిన ప్రేమకదా? మూడేళ్ళప్పట్నించీ పెంచాను దాన్ని. ఏదో మామూలు జ్వరం కదా అని వదిలేశానుగానీ...." అని ఆగిపోయి — "మీరలా అన్యమనస్కంగా ఉంటే కాదు—ఇంటికి వెళ్ళగానే కాస్త మా వాళ్ళకి ఏర్పాటు చెయ్యాలి. నాల్రోజుల్లో వాళ్ళు వచ్చేస్తారు—" అంది మల్లి.

అంతా రిక్షాలు ఎక్కారు. ధర్మాసుపత్రి దగ్గర శారదే దిగి లోపలకు వెళ్ళి కనుక్కుంది. అయితే అక్కడ వకుళ లేదు. ఎవ్వరూ ఆమెకు సరైన సమాచారం అందివ్వలేకపోయారు. ఒక డాక్టర్ని నిలదీసి అడిగితే—"చూడమ్మా — ఇక్కడికి జనం వందల్లో వస్తారు. ఎంతమందినని మేము కాచుకుంటాం. రోగిమీద మీకు శ్రద్ధ ఉంటే కూడా మీలో ఎవరో ఒకరొచ్చి వుండాలిగానీ — ఇలా మా మీద సవారీచేస్తే లాభం లేదు—" అన్నాడు. ఆ మాటలకు కిక్కురుమనకుండా శారద బైటకు వచ్చేసింది.

జోగారావు ఆత్రుతగా భార్యవంకే చూస్తున్నాడు. అది గమనించిన శారద—"నేను చెప్పలేదండీ—అనుకున్నట్టే అయింది. మర్నాడే దాన్నింటికి పంపించేశారుట. అంత చిన్న జ్వరాని కింత హడావుడేమిటని ఒకటే నవ్వు కూడాను—" అని తనూ నవ్వడానికి ప్రయత్నించింది. అయితే ఆమె కూడా నవ్వు రాలేదు.

ఆ రోజు వకుళకు జ్వరం తీవ్రంగానే వచ్చింది. ఆమెను డాక్టర్లు శ్రద్ధగా చూశారా? జ్వరం తగ్గిందా? ఇప్పుడు వకుళ ఎక్కడుంది?

ఒకవేళ వకుళ....

"అబ్బే అలా జరగదు—" అనుకుంది శారద. ఆ ఆలోచనకే ఆమెకు చెమట్లు పట్టాయి. "దానిది మొండి ప్రాణం. అంత సులభంగా చావదది....కానీ.... కానీ...." శారదకు బెంగగా వుంది—"వకుళ యింట్లో ఉందా? యిప్పు డింటికి వెళ్ళేసరికి ల్లు తాళం వేసి వుంటుందా-తీసి వుంటుందా?"

రిక్షాలు ఇల్లు చేరాయి. ఇంటికి తాళం వేసే వుంది. శారద గుండె గుభేలుమంది.

జోగారావు శారదవంక చూశాడు. అతడి ముఖంలో కోపంలేదు. కళ్ళలో బెంగ వుంది. కానీ శారద తలెత్తి అతడివంక చూడలేదు. తప్పు చేశానన్న అనుభూతి ఆమెలో క్షణమాత్రం కలిగింది.

శారద ముందు ఇంట్లో అడుగుపెట్టకుండా ఎదురింటి కామేశ్వరమ్మ తలుపు తట్టింది.

పుల్లారావొచ్చి తలుపు తీసి—"మీరా? యెప్పు డొచ్చారు?" అన్నాడు.

"ఇప్పుడే—మీ అమ్మ ఉందా—మీ యింట్లో తాళ మిచ్చాను. వెళ్ళి అడిగి తీసుకురా...." అంది శారద. వకుళ గురించి అడిగి తెలుసుకోవాలని నాలిక చివరిదాకా వచ్చి ఆగిపోయింది. అసలు వకుళని యెక్కడ, యెందుకు వదిలేసి వెళ్ళారూ అనడిగితే ఏం చెప్పాలి?

కామేశ్వరమ్మ తాళంచెవి తీసుకువచ్చి—"ఇదేనామ్మా రావడం—" అనడిగింది.

తాళంచెవిని చూస్తూనే శారద గుండె మళ్ళీ గుభేలు మంది. అంటే తాళంకోసం వకుళ వీళ్ళ దగ్గరకు రాలేదన్న మాట. ఇంక వుండబట్టలేక—"మా వకుళ తాళంకోసం

రాలేదా?" అనడిగింది.

"తాళం మా కిచ్చినట్లు తెలియక తను తాళం బద్దలు కొట్టుకుని యింట్లో కెళ్ళిందట. ఇప్పుడు యింట్లో కొత్త తాళం వేసింది. తను బయటకు వెడుతూ ఓ చెవి మా కిచ్చి వెళ్ళిపోయింది—మీ రొస్తే ఉంటుందని!" అంటూ తాళం చెవి శారద కిచ్చిందామె.

"అంటే—అసి తాళం బద్దలు కొట్టేంత ఘటికురాలైందన్నమాట. కాస్త యెదురింట్లో అడిగి చూస్తే ఏమయింది? అయినా దానికి డబ్బు విలువ ఎప్పుడు తెలిసేడ్చింది కనుక....ఇలా తాళం బద్దలుకొట్టి అలా కొత్తది కొంది. ధరలు మండిపోతున్న యీ రోజుల్లో యిదేనా చేయాల్సింది? రానీ చెబుతాను. అయినా ఈ టైములో దీనికి పెత్తనాలు కావలసొచ్చాయా? రోజూ యిలాగే బైటకు పోతోందా?" అనడిగింది శారద. వకుళ ఇంటికి వచ్చింది అని తెలియగానే ఆమె మనసు తేలికపడింది. పాత ప్రవృత్తి మళ్ళీ బుసకొట్టింది.

"ఏమోనమ్మా—నాకు మా యింట్లో పనులతో నే సరిపోతోంది. రోజూ వెడుతోందో లేదో తెలియదు. అదిసరే—మీ రూరికి వెళ్ళేటప్పుడు వకుళ యింట్లో లేదు గదా—అప్పుడు తను పెత్తనాలకు వెళ్ళిందా—నువ్వెక్కడికయినా పంపావా?" అనడిగింది కామేశ్వరమ్మ.

తెలుసుకోవాలని అడిగిందో, వెటకారం చేస్తోందో అర్థంకాలేదు శారదకు. అయితే ఆ ప్రశ్నకు జవాబేం చెప్పాలో తెలియక—"అన్నీ తర్వాత మాట్లాడుకుందాంలే—" అని శారద అక్కణ్నించి వచ్చేసింది.

శారద వెళ్ళిపోతూంటే కామేశ్వరమ్మ కుతూ

హాలంగా చూస్తోంది. ఇప్పుడేం జరుగుతుంది?....ఆమె తలుపులు పూర్తిగా వేయకుండా యెదురింటివైపే చూడసాగింది.

శారద విసురుగా భర్తను చూసి—"చూశారా—మీ అమ్మాయి వరస! తాళం బద్దలు కొట్టి ఇంట్లో దూరిందట. డబ్బు తగలేసి కొత్తతాళం కొని ఇంటికేసి పెత్తనాలకు పోయిందిట—" అంది.

జోగారావు మనసు ఆ మాటలకు తేలికపడింది. అతనే మాత్రమూ కలవరపడకుండా—"పోనీ తాళం ఎదురింట్లో ఇచ్చిందా, లేదా?" అనడిగాడు.

"ఏదో—ఆ మాత్రం చేసింది లెండి—" అంది శారద మూతి మూడు వంకర్లు తిప్పి. భర్త కూడా తనతో పాటు వకుళ చర్యను గర్హించకపోవడం ఆమెకు నచ్చలేదు.

శారద తాళం తీసింది. హాల్లో దీపం వేసింది.... "అబ్బబ్బ....ఇది మనుషులుండే కొంపలాగుందా?" అంటూ విసుక్కుంది.

రిక్షావాళ్ళు సామాను లోపలపెట్టి డబ్బులు తీసుకుని వెళ్ళిపోయారు.

"ఒక్క నిముషం నడ్డి వాలుస్తాను....అలసటగా వుంది. వెధవ బస్సులో కూర్చుని నడ్డి లాగేసింది—" అంటూ జోగారావు పడకగదిలోకి వెళ్ళాడు.

"మాకూ అలసటగా ఉంది—" అంటూ పిల్లలిద్దరూ కూడా పడగ్గదిలోకి నడిచారు.

"ఏ అలసటా లేనిదాన్ని ఈ ఇంట్లో నేనొకత్తినే!" అని గట్టిగా అరిచింది శారద.

"ఈ యింటికి యజమానురాలిని. అలసటగా ఉంటే

విశ్రాంతి తీసుకోవడానికి ఎవరి అనుమతీ అక్కర్లేనిదానివి నువ్వే కదా—" అంటూ పడకగదిలోంచి జోగారావు శాంతంగా జవాబిచ్చాడు.

ఆ సమాధానం శారదకు నచ్చలేదు. ఆమె కోపాన్ని వీధి తలుపులు వేయడంలో చూపించింది. ధడేలుమని తలుపులూ, దడీమని గడియ వేసింది.

అంతవరకూ తలుపు సందుల నుంచి చూస్తూన్న కామేశ్వరమ్మ నిరాశగా—"ఇంతవరకూ ఏం జరగలేదు?" అనుకొని తనూ తలుపు వేసుకొంది.

శారద చిరాగ్గా—"అసలోసారి ఇల్లంతా ఎలా ఉందో చూడాలి—" అనుకుంటూ వకుళ ఉండే గది లోనికి వెళ్ళింది. దీపం వేయగానే గదిలో కనపడ్డ వస్తువులామెకు దిగ్భ్రమ కలిగించాయి. అందులో ఒక్కటీ ఇదివరలో ఉన్నవి లేవు. గదిలో మూలగా ఉన్న నిలువెత్తు గాజుజాడీ ఆమెకు ఆశ్చర్యాన్ని కలిగించింది.

"ఇవన్నీ ఏమిటో?" అనుకుంది శారద. అప్పుడే ఎవరో నవ్వినట్లు వినపడిందామెకు. శారద అప్రయత్నంగా తలెత్తి చూసింది. అంతే—కెవ్వుమని ఇల్లదిరిపోయేలా కేకపెట్టి పరుగు పరుగున భర్త వున్న గదిలోకి పరుగెత్తింది శారద.

"ఏం జరిగింది?" అంటూ లేచి కూర్చున్నాడు జోగారావు. పిల్లలు కూడా ఎంతో కంగారుపడిపోయారు.

శారద నిలబడి ఆయాసంతో రొప్పుతోంది. ఆమె కళ్ళు భయంవల్లనో మరెందువల్లనో గుండ్రంగా తిరిగిపోతున్నాయి. ఆమె చటుక్కున కూలబడిపోయింది.

"ఏం జరిగిందే?" జోగారావు అడిగాడు.

"గదిలో.... దెయ్యం...." అంది శారద అతి కష్టం

మీద గొంతు పెగల్చి.

దెయ్యం అన్న మాట వింటుంటే పిల్లలిద్దరూ కూడా కవ్వుమని భయంతో వణకడం మొదలెట్టారు.

"దెయ్య మేమిటే....?" అన్నాడు జోగారావు విసుగ్గా.

"గదిలో....వకుళ ...దెయ్యం!...." అంది శారద మళ్ళీ.

"ఏదీ ...నాకు చూపించు...." అంటూ లేచి నిలబడ్డాడు జోగారావు. వకుళ ....దెయ్యం అనగానే అతడి మనసు కీడును శంకించింది. వకుళేమిటి—దెయ్యమేమిటి— అని గొణుక్కున్నాడు.

"మీరు వెళ్ళి దాని గదిలో చూసి రండి—" అంది శారద.

"నువ్వూ రా— నేను పక్కనుంటాను గదా—నీకే భయం లేదు—...." అన్నాడు జోగారావు.

"అమ్మ బాబోయ్—ఆ దృశ్యం మళ్ళీ చూడలేను నేను...." అంది శారద.

జోగారావుకు చిరాకేసింది—"అసలేమిటో చెప్పు ముందు...."

శారద గొంతు సవరించుకొని పిల్లలకేసి చూసి— "ఒరేయ్—మీరు వినకండి. అలా వెళ్ళండి—" అంది. కానీ పిల్లలు కదల్లేదు. వాళ్ళ కళ్ళలో భయం, కుతూహలం—రెండూ కనబడుతున్నాయి.

శారద లేచి భర్తకు దగ్గరగా వచ్చి—స్వరం కాస్త తగ్గించి—"గదిలో పై కప్పుకు బల్లిలా అంటిపెట్టుకొని వున్నది. దాని ముఖం నా వైపే తిరిగి వున్నది. దాని వంటిమీద బట్టలు లేవు. అది నవ్వుతోంది. ఎప్పుడైనా

ఎవరైనా అలాంటి దృశ్యం ఊహించగలరా?" అంది.

జోగారావు ముఖంలో భయం కంటె దిగులు కన పడింది.—"అయితే అది వకుళే నంటావా?" అన్నాడు.

"చిన్నప్పట్నించి పెంచాను. వకుళ నాకు తెలియదా?"

"అయితే అది చచ్చిపోయి దెయ్య మయిందం టావా?...."

శారద ఉలిక్కిపడి—"అవును—నాకీ విషయం స్ఫురించనేలేదు. పైన కనబడ్డ దృశ్యం నా మతి పోగొట్టింది. అది తాళంచెవి కామేశ్వరమ్మకిచ్చి వెళ్ళింది. మరి యింట్లో...." అని ఆగింది.

"పద—వెళ్ళి చూద్దాం—" అన్నాడు జోగారావు.

శారద తను రానంటే రానన్నది. జోగారావు తానొక్కడే గదిలోకి వెళ్ళాడు. గదిలోని వింత వస్తువు లతడికి ఆశ్చర్యాన్ని కలిగించాయి. కానీ అక్కడ భయం కరమైనదేదీ అతడి కగుపించలేదు. అత డక్కణ్ణించే పిల్ల లిద్దర్నీ కేకపెట్టాడు—"రమా—సూర్యం—ఇలా రండి—మీ అమ్మ ఇక్కడ ఏం చూసి భయపడిందో తెలుసుకుందురు గాని...."

అతడి పిలుపు వింటూనే పిల్లలిద్దరూ పరుగున వచ్చారు. తర్వాత అక్కడేమీ లేకపోవడం చూసి ముగ్గురూ పక పకా నవ్వసాగారు. జోగారావు నవ్వాపి—"దెయ్యాలు పిరికివాళ్ళకోసం కాచుకూర్చు నుంటాయ్. మనవంటి ధైర్యవంతులకోసం కాదు. వెళ్ళి మీ అమ్మను కూడా తీసుకొని రండి—" అన్నాడు.

"అయితే పిల్లలు కదల్లేదు. వాళ్ళు ఇంకా నవ్వ సాగారు. వాళ్ళ నవ్వు చూసి జోగారావు మళ్ళీ తనూ

శృతి కలిపాడు. అయితే వాళ్ల నవ్వులు ఒక్కసారిగా ఆగిపోయాయి.

ఆ ముగ్గురి నవ్వులతోనూ మరొకరి నవ్వు కలిసింది. ఆ నవ్వు మరో రకంగా వున్నది. వీరి నవ్వులతో శృతి కలవ లేదు. నెమ్మదిగా, భయంకరంగా ఉన్న ఆ నవ్వు ముగ్గురూ కూడా స్పష్టంగా విన్నారు.

వాళ్ళు నవ్వాపగానే ఆ నవ్వు కూడా ఆగిపోయింది.

జోగారావు సూర్యంకేసి చూసి—"వెటకారంగా వుందా వెధవకానా—మామూలుగా నవ్వక అదేం నవ్వు? అసలే మీ అమ్మ భయపడి చస్తోంది. ఇలా నవ్వావంటే దాని గుండె ఆగిపోతుంది కూడా—" అన్నాడు.

"నేను నవ్వలేదు నాన్నా—ఇంకా నువ్వలా నవ్వుతున్నావేమో ననుకున్నాను—" అన్నాడు సూర్యం దిక్కు మొగంవేసి.

ఇద్దరూ అనుమానంగా రమవంక చూశారు. రమ తన కేమీ తెలియదంది.

"మనం ముగ్గురం కాకపోతే దెయ్యం నవ్విందం టారా?" అన్నాడు జోగారావు విసురుగా. అతడా ప్రశ్న వేయగానే పిల్లలిద్దరూ బెదిరిపోయారు. అమ్మ దెయ్యాన్ని చూశానంది. తమకు దెయ్యం కనబడలేదు కానీ యేదో నవ్వు వినబడింది. అది దెయ్యానిదా? ఈ యింట్లో దెయ్యం చేరిందా?

"సరే ఈ విషయం అమ్మకు చెప్పకండి. సూర్యం—నువ్వెళ్ళి అమ్మను పిల్చుకురా—దానెదురుగుండానే ఈ గదిలో అణువణువూ శోధిద్దాం. అందరి అనుమానాలూ వదిలిపోతాయి—" అన్నాడు జోగారావు.

సూర్యం గదిలోంచి హాల్లోకి అడుగుపెట్టి—నాలు

గడుగులు వేసి—ఇంక అడుగు ముందుకు పడక ఆగి పోయాడు.

వీధి తలుపు గడియ నెమ్మదిగా దానంతటదే తేస్తోంది. చూస్తూంటే యెవరో అదృశ్య వ్యక్తి గడియ తీస్తున్నట్లుంది.

సూర్యం అరుద్దామనుకున్నాడు. గొంతు లేవలేదు. పరుగెడదామనుకొన్నాడు. అడుగుపడలేదు. కళ్ళు మాత్రం తలుపువైపే చూస్తున్నాయి.

గడియ విడింది. తలుపులు తెరుచుకొన్నాయి—నెమ్మదిగా!

సూర్యం ఊపిరి బిగబెట్టాడు.

లోపల వకుళ అడుగుపెట్టింది.

సూర్యం వకుళను గుర్తుపట్టి ఒక్క పరుగున ఆమెను చేరి—"అక్కా—నువ్వా?" అన్నాడు.

"ఎప్పుడొచ్చావురా?" అంది వకుళ—వాణ్ని దగ్గరగా తీసుకొని.

"అబ్బా—నీ వళ్ళు చాలా చల్లగా వుంది—"అన్నాడు సూర్యం.

"ఈ ఊళ్ళో ఓ హోటల్లో స్కేటింగ్‌కి కృత్రిమ మంచు తయారుచేశారు. అక్కణ్ణించే వస్తున్నాను. రేపు నిన్ను అక్కడికి తీసుకువెడతాన్లే—అంతా కులాసానా?" అంది వకుళ.

"నువ్వు లోపలకు వచ్చేటప్పుడు గడియ దానంతటదే విడింది. నేను హడలిపోయాను. ఏ దెయ్యమైనా వస్తోందేమోనని. కానీ తీరా చూస్తే నువ్వే వచ్చావు—" అన్నాడు సూర్యం.

"అదా?" అని చటుక్కున నవ్వింది వకుళ. అదే

నవ్వు. నెమ్మదిగా, భయంకరంగా!

సూర్యం ఉలిక్కిపడి—"అదే నవ్వు — ఇందాక, గదిలో....విన్నాను...." అన్నాడు.

వకుళ నవ్వాపేసి "గడియ బయటనుంచి ఎలా తెరుచు కుంటుందీ చూపిస్తానుదా—" అని సూర్యాన్ని వీధిలోకి తీసుకు వెళ్ళింది. గడియ మేకు ఒకటి బయటకు పొడుచుకుని వచ్చింది. దాన్ని బైటనుంచి తిప్పి గడియ తీసేయవచ్చు. సూర్యం తను కూడా అలాగే చేసి ఆనంద పడ్డాడు.

ఈలోగా — "ఎవర్రా వస్తా—" అంటూ శారద, జోగారావు, రమ వచ్చారు హాల్లోకి.

వకుళ చకచకా వాళ్ళను సమీపించి—"బారసాల బాగా జరిగిందా పిన్నీ—" అనడిగింది.

శారద వకుళను ఎగాదిగా చూసి-"నువ్వు కులాసాగా ఉన్నావా?" అంది.

జోగారావు కళ్ళు కూతుర్ని చూడగానే తృప్తితో మెరిశాయి. వకుళ ఆ తృప్తిని గమనించింది. ఆమె తండ్రి నింకేం అడగలేదు. ఈలోగా సూర్యం తలుపు గడియ గురించి వర్ణించి చెప్పాడు.

వెంటనే శారద గుండెలు బాదుకుని—"ఇలా బైట నుంచే తీసేమాటయితే ఈ యింటి వీధి గుమ్మానికి గడి యెందుకు? అయ్యో అయ్యో—ఈ ఇల్లు గుల్లయిపోతుంది. వెంటనే బాగుచేయించాలి. అయినా ఇంట్లో వాళ్ళే తలుపలా తీస్తుంటే—బయట్నించెవరైనా చూశారంటే ఇంకేమైనా వుందా?" అంది.

"ఎందుకలా గుండెలు బాదుకుంటావు పిన్నీ—తలుపు గడియ బయట్నించి తియ్యడం ఎవరివల్లా కాదు. నాకు

సూర్యమే తలుపు తీశాడు. నిన్ను భయపెట్టాలని ఏదో కథ చెప్పాడు—" అంది వకుళ.

"లేదమ్మా—నాకు అక్క చూపించింది. నేను కూడా బయటినించి తలుపు గడియ తీయగలిగాను—" అన్నాడు సూర్యం.

"దీనికింత గొడవెందుకు—వెళ్ళి చూస్తే సరిపోలా?" అన్నాడు జోగారావు.

అంతా వెళ్ళి చూశారు. వీధి తలుపు ఎప్పటి లా మామూలుగా వుంది. గడియ మేకేదో పొడుచుకు వచ్చినట్లు లేదు. సూర్యం కళ్ళు తేలవేశాడు.

"వచ్చీరాగానే నన్ను తిట్టించాలని వెధవ బుద్ధి—పిన్ని నీ బుద్ధి లే— నీ పిల్లలకూ వంటబట్టేస్తున్నాయ్. నేను మిమ్మల్ని పలకరించడమే తప్పు. నా గదిలోకి పోతాను—" అంటూ విసురుగా ఆ గదిలోకి వెళ్ళి పోయింది వకుళ.

వకుళ ధైర్యానికి జోగారావు విస్తుపోయాడు. శారద మాత్రం ఈ ఎదిరింపు సహించలేకపోయింది. "ఇప్పుడే ఊర్నించి వచ్చాం — మాకంతా వంటచేసి పెట్టవా?" అంటూ అక్కణ్ణించి అరిచింది.

"నేనూ తిరిగి తిరిగి వచ్చాను. వంట చేయలేను. నా కన్నం అక్కర్లేదు. మీకాక్కావాలంటే మీరు వండుకు తినండి. నా జోలికి రావద్దు—" గదిలోంచి సమాధానం ఇచ్చింది వకుళ. ఆమె తలుపులు దగ్గరగా మూసింది.

ఈ గొడవలో తనకేమీ సంబంధం లేనట్లుగా జోగారావు వీధి తలుపు గడియవేసి — పిల్లలిద్దర్నీ తీసుకుని పడగ్గదిలోకి వెళ్ళిపోయాడు.

"ఎలా చేయవో చూస్తాను—...." అంటూ శారద

విసురుగా వకుళ గది దగ్గరకు వెళ్ళి తలుపు తీసి ఏదో అనబోయి మాట్లాడ్డానికి బదులు కెవ్వుమని కేక వేసింది.

ఎదురుగా గాజు జాడీలో వకుళ నగ్నంగా జలకా లాడుతోంది. ఆ దృశ్యం చూడ్డానికి భయంకరంగా వున్నది. వకుళ నాలిక బైటపెట్టి శారదను వెక్కి రించింది.

శారద మళ్ళీ వెనక్కు పరుగెత్తి పడకగది చేరి జోగారావుతో—"సందేహంలేదు. ఆ గదిలో పిశాచ ముంది. ఆ పిశాచాన్ని వకుళ స్వాధీనం చేసుకుంది—" అంది.

"ఏమయిందే?" అన్నాడు జోగారావు కొంచెం విసుగ్గా.

శారద మంచంమీద పడుకుని ఇంకా రొప్పుతూనే తను చూసిన దృశ్యాన్ని నెమ్మదిగా భర్తకు వర్ణించి చెప్పింది. ఆమె చెప్పడం పూర్తికాగానే గుమ్మంవంక చూసి చటుక్కున ఆగిపోయింది.

అక్కడ వకుళ నిలబడి వుంది. ఆమె కళ్ళు అదో రకమైన, మానవాతీతమైన క్రూరత్వంతో శారదవంక నే చూస్తున్నాయి.

"ఏం ఆగిపోయావ్ పిన్నీ!" అంది వకుళ.

జోగారావు వెనక్కు తిరిగి—"నువ్వా?" అన్నాడు ఆశ్చర్యంగా. భార్య చెప్పినవిధంగా స్నానంచేసిన చిహ్నాలేమీ వకుళలో గోచరించడంలేదు. ఆమె ఇందాక ధరించిన బట్టల్లోనే వున్నది. అవి పొడిగానూ వున్నవి.

"నేనే నాన్నా! మీరు నన్ను నిర్దాక్షిణ్యంగా ధర్మాసుపత్రిలో వదిలేసిపోయారు. అంతా ఉండీ కూడా నన్ను నాథను చేశారు. ఎలాగో ఈ రూపంలో నేను మీ

ఎదురుగా నిలబడ్డాను. కానీ నా వళ్ళంతా పగతో రగిలిపోతోంది. అందుకే రాగానే పిన్నిని భయపెట్టాను. భయపెట్టడం కోసమే ఓ బొమ్మను కొని గదిలో వుంచాను. పిన్ని నీళ్ళలో చూసింది బొమ్మను! నేనిప్పుడు మునుపటి వకుళను కాను! నేనెవ్వరికి భయపడను. నన్ను బాధించేవారి గుండెలదరగొడతాను. నా జోలికి వచ్చే ముందు ఇవన్నీ ఆలోచించుకోండి—" అంది వకుళ.

"ఏమిటమ్మా ఆ పిచ్చి మాటలు—" అన్నాడు జోగారావు.

"పుట్టెడు జబ్బుతో నన్ను వదిలేసిపోయారు. వారం కాకుండా తిరిగొచ్చి నేను వండిపెడతాననుకుంటున్నారు. పిచ్చి మాటలు నావా, మీవా?" అంది వకుళ.

జోగారావు హోటలుకు వెళ్ళి అందరికీ క్యారేజీ భోజనం తీసుకు వచ్చాడు.

వకుళ తను భోజనం చేయనన్నది. ఎవరెంత బలవంత పెట్టినా ఒప్పుకోలేదు.

శారదా వాళ్ళూ భోంచేస్తూండగా ఎవరో తలుపు తట్టారు. వకుళ వెళ్ళింది తలుపు తీయడానికి.

మధు వచ్చి రక్తం సీసా ఆమె చేతికిచ్చాడు. ఒక్క గుక్కలో రక్తం తాగేసిందామె. మధును వెళ్ళి పొమ్మనమని చెప్పి లోపలకు వెళ్ళబోతూంటే—"వకుళా మూతి తుడుచుకో!" అన్నాడు మధు. వకుళ చటుక్కున మూతి తుడుచుకుని తలుపు వేసి లోపలకు వెళ్ళింది.

"ఎవరే వస్తే?" అనడిగింది శారద.

"మధు!"

"ఎందుకు?"

"నాకోసం?"

"నీ కోసమే-ఎందుకు వచ్చాడూ అనడుగుతున్నాను."

"నా కోసం కాకపోతే నీ కోసం వస్తాడను కున్నావా?" అంది వకుళ.

"వకుళా — పెద్దా చిన్నా లేకుండా ఏమిటా మాటలు?" అన్నాడు జోగారావు.

శారద ఆశ్చర్యంగా వకుళ వైపు చూస్తోంది. ఏమిటి దాని ధైర్యం? పిల్లిలా పడుండే మనిషి ఇంతలా ఎదురు సమాధానాలెలా చెప్పగల్గుతోంది?

భోజనాలవగానే జోగారావు, పిల్లలు వెళ్ళి పడు కున్నారు. శారద వకుళను ఎంగిళ్ళు తియ్యమన్నది.

"నేను తియ్యను—నాకూ నిద్రవస్తోంది-"అంది వకుళ.

"ఎవరికోసం తీస్తావే"—అంటూ శారద వకుళ చేయి పట్టుకుని లాగి గుంజబోయి—అప్రయత్నంగా పట్టు వదిలే సింది. ఆ చేయి మంచుకన్న చల్లగా వుంది.

"చెయ్యి చల్లగా వుందా? మరిందాకా మధు వచ్చాడుగా—వెచ్చదనమంతా తనే తీసుకుపోయాడు—" అని ఫక్కున నవ్వింది వకుళ.

ఆ నవ్వు....అదే నవ్వు....ఇందాకా... ఇంటి కప్పు కదుల్కొని....నగ్నంగా....వకుళ నవ్విన నవ్వు....అదే నవ్వు....ఆ నవ్వు....

"అదేం నవ్వు?" అంది శారద భయంగా.

"నీ కోసం ప్రత్యేకంగా ప్రాక్టీసు చేస్తున్నాను—" అంది వకుళ.

"తల్లీ—ముందు నువ్విక్కణ్నుంచి వెళ్ళు—" అంది శారద.

"ఆ మాటకోసమే ఎదురు చూస్తున్నాను...." అంటూ క్షణాలమీద తన గదిలోకి వెళ్ళి తలుపులు వేసు

కుంది వకుళ.

శారద ఎంగిళ్ళెత్తుకుని తలుపులు వేసుకుంది. కానీ ఇంట్లో ఎక్కడా లైట్లార్పలేదు. ఆమెకిప్పుడు చాలా భయంగా వుంది. మళ్ళీ ఓసారి వకుళ గదిలోకి వెళ్ళి తిట్టివద్దామనుకున్నది. గది గుమ్మందాకా వెళ్ళి ధైర్యం చాలక వెనక్కి వచ్చేసింది..

ఆమె పడక గదిలోకి వెళ్ళేసరికి భర్త, పిల్లలు— అంతా నిద్రపోతున్నారు.

అప్పుడు శారదకు హఠాత్తుగా ఆ యింట్లో మెలకువగా వున్నది తనొక్కర్తేనని గుర్తుకొచ్చింది. అంతులేని భయం ఆమెను ఆవహించింది.

సాధారణంగా పిల్లలు వేరే గదిలో పడుకుంటారు. భయపడ్డారో ఏమో వాళ్ళా ఆ గదిలోనే పడుకున్నారు. వాళ్ళ కోసం జోగారావు గదిలో రెండు మడత మంచాలు వేశాడు.

శారద వెళ్ళి భర్తను లేపింది.

"ఏమిటే?" అనడిగాడు జోగారావు కళ్ళు నులుము కుంటూ.

"అప్పుడే అంత నిద్రేమిటండీ—" అంది శారద.

"నిద్రపోకుండా ఏం చేయాలో చెప్పు—" అన్నాడు జోగారావు.

"నాకు భయం వేస్తోందండీ — అందుకే ఇంట్లో ఎక్కడా దీపాలార్పలేదు. మీరు వెళ్ళి అన్నీ ఆఫ్ చేసి రండీ—"

జోగారావు మాట్లాడకుండా లేచివెళ్ళాడు. ఎప్పుడో తప్ప భార్య మాటలకు విసుక్కోవడం అతడి కలవాటు లేదు.

శారద కళ్ళు తెరవలేదు. భర్త వెళ్ళగానే కళ్ళు మూసింది.

"పిన్నీ!" అంటూ ఎవరో చెవి దగ్గర గుసగుసలాడి నట్లయింది. ఆ పిలుపు శారదకు స్పష్టంగా వినబడింది. కానీ ఆమె కళ్ళు తెరవలేదు. పిలుపు మళ్ళీ వినబడింది. అయినా ఆమె కళ్ళు తెరవలేదు.

అప్పుడామెను ఎవరో కుదిపారు. "పిన్నీ!" అన్న గుసగుసలాంటి పిలుపు ఆమెకు మళ్ళీ వినబడింది. అయితే తన్ను కుదిపినవారి స్పర్శ—మంచుకన్న చల్లగా వుంది!

చటుక్కున శారద కళ్ళు విప్పింది.

ఎవ్వరూ లేరు—ఆమె అటూ యిటూ చూసింది. ఎవ్వరూ లేరు.

ఇంతలో దూరంగా అడుగుల చప్పుడు వినపడింది.

శారద ఊపిరి బిగబట్టింది.

అడుగుల చప్పుడు క్రమంగా దగ్గరయింది.

శారదకు శ్వాస ఆగిపోయినట్లే అయింది.

చీకట్లో ఒక ఆకారం గదిముందు అడుగుపెట్టింది

కెవ్వుమని అరిచింది శారద.

గదిలోని పిల్లలిద్దరూ కూడా చటుక్కున లేచి కూర్చుని గుమ్మంకేసి చూసి కెవ్వుమని అరిచారు.

"ఏమయిందే?" అడిగాడు గుమ్మంలోని జోగారావు ఆశ్చర్యంగా.

"మీరా?" అంది శారద తేరుకుని.

"బాగుంది. హఠాత్తుగా నీలో భయం పుట్టుకుంది. ఆఖరికి నన్ను కూడా దెయ్యమనేటట్టున్నావ్?" అని—

"మీరు పడుకోండి. రాత్రి తెల్లవార్లూ కవ్వ్యమన్న కేకలు వినపడ్డా మీరు లేవకండి. మీ అమ్మ చిన్న పిల్లలకంటే ఘోరంగా తయారయింది—" అన్నాడు పిల్లలతో జోగారావు.

అతను గదిలో లైటు ఆర్పబోతే—"వద్దండీ—అది వుంచండి—" అంది శారద.

"సరే—నీ యిష్టం—నేనూ ఓ మడత మంచం తెచ్చి తెచ్చుకుంటాన్లే—" అన్నాడు జోగారావు.

గదిలో పిల్లలు కూడా పడుకొన్నారు. అందువల్ల లైటుంటేే భర్త తన మంచంమీద పడుకోడు. ఈ రోజు తన కెంత భయంగా వుందంటే ఒక్కర్తీ పడుకుంటే గుండె ఆగిపోవచ్చు.

"వద్దు లెండి. దీపం ఆర్పేయండి—" అన్నది శారద.

జోగారావు డబల్ కాట్ మీద భార్య పక్కన చోటు చేసుకొన్నాడు.

శారద భర్తను నిద్రపోనివ్వలేదు. పిల్లలు నిద్రపోయారని రూఢి అయ్యేవరకూ ఆమె ఆ కబురూ ఈ కబురూ చెప్పి—తర్వాత—"ఏమండీ వకుళ గురించి మీ కే అనుమానమూ లేదూ?" అంది.

జోగారావు గొంతు సరించుకొని "నీ మాట నేను వినడమే కానీ నా మాట నువ్వెప్పుడూ వినలేదు. వింటానంటే ఒక్క మాట చెబుతాను—" అన్నాడు.

"చెప్పండి—" అంది శారద నీరసంగా.

"నీ మనసు చాలా మంచిది. ఆ సంగతి నీకే తెలియదని నా అనుమానం. నీకు వకుళమీద ప్రేమానురాగాలున్నాయి. అది మొండిది కావడంవల్ల నువ్వు దానిపట్ల కఠినంగా వ్యవహరించావు తప్పితే పెంచిన ప్రేమ ఏమై

పోతుంది? అయినా చివర్లో బారసాలకు బయల్దేరినప్పుడు నువ్వు వకుళను ధర్మాసుపత్రిలో వదిలేశావు. ఆ క్షణంలో ఏ పిశాచం నిన్నావహించిందో కానీ—అది నీ సహజ ప్రవర్తనకు భిన్నంగా ప్రవర్తింపజేసింది. అందువల్ల నీ మనసు బాధపడుతోంది.

వకుళకు నీ కారణంగా దారుణమైన నిర్లక్ష్యం జరిగిందనీ—దాని ప్రాణాలు పోతే ఆ బాధ్యత నీదేననీ నీకు అనిపించింది. అది ప్రాణాలతో బ్రతికివుండదనీ పిశాచమై నిన్ను పట్టి పీడిస్తుందనీ ఏ మూలో నీలో బెదురుంది. అందుకే—రాగానే ఈ యింట్లో నీకు యెటు చూసినా పిశాచమే కనబడుతోంది. నిజానికి అదంతా నీ భ్రమ. దెయ్యాలే వుంటే యింట్లో అందరికీ కనిపించేవి. కాస్త మనసు కుదటపర్చుకో. ధైర్యం వహించు. దెయ్యం గియ్యం యేమీ వుండదు."

భర్త మాటలు శారదకు కొంత ఉపశాంతిని కలిగించాయి. "అంతేనంటారా, అంతా నా భ్రమే నంటారా? ఈ భ్రమంతా పోవడానికి ఏం చేయాలంటారు?"

"నాలుగురోజులు వకుళను ఏమీ అనకు. అది పెంకిగా వున్నా సహించు. అప్పటికి నీ మనసు కుదుటపడుతుంది" అన్నాడు జోగారావు.

అప్పుడు గదిలో ఒక నవ్వు వినిపించింది. అది ఇందాకా వకుళ నవ్విన నవ్వులాగే వుంది.

"ఎవరో నవ్వారు కదండీ!" అంది శారద.

"నాకేం వినబడలేదే—నా మాట విని సుఖంగా నిద్రపో—" అన్నాడు జోగారావు. నిజానికి ఆ నవ్వు అతడికీ వినిపించింది.

(ఇంకా వుంది)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- లు నగదు బహుమతి పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలెదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును. •





# క్రైమ్‌లో తమాషాలు

(ఈ శీర్షికలో ప్రచురితమయ్యే ప్రతిరచనకూ రూ. 5 పారితోషకం ఇవ్వబడును.)

## పొగమంచు

సమయం రాత్రి 8-30 గం॥ అయ్యింది. డిటెక్టివ్ అప్పారావు ఇంక కేసులేమీ తనని వెతుక్కుంటూ వచ్చే టట్టు లేవని, తనే కేసులని వెతుక్కుంటూ వెళ్ళాలని నిశ్చ యానికి వచ్చి ఆఫీసు మూసి రోడ్డుమీద పడ్డాడు.

తనుంటున్నది మహారాణిపేటలో. ఇది విశాఖపట్నంలో కొంచెం ఎత్తయిన ప్రదేశం.

అప్పారావు చుట్టూ ఓసారి పరికించాడు. దూరంగా విశాఖపట్నం పోర్టు లైట్లతో వెలిగిపోతోంది.

"అహ! విశాఖపట్నం రాత్రిపూట ఎంత అందంగా వుంటుంది!" అని అనుకోకుండా ఉండలేకపోయాడు.

అప్పారావు సాలిపేటలోనుండి నడవడం మొదలు పెట్టాడు చుట్టూ పరికిస్తూ. కొంచెం ముందుకు వెళ్ళేటప్ప టికి దూరంగా ఏదో చప్పుడు. అప్పారావు కొన్ని అడు గులు ముందుకి వెళ్ళాడు చప్పుడు వినిపించిన వైపుగా.

అంతే టక్కున ఆగిపోయాడు. కారణం, ఒక ట్రక్కు నెమ్మదిగా వస్తోంది. దానిచుట్టూ పొగ! విపరీతమైనపొగ!!

ఆ ట్రక్కు వెనుకభాగం, డిక్కీనుండి తెల్లటి పొగ వెలువడుతోంది. చూస్తున్న అప్పారావు నిశ్చేష్టుడయి

పోయాడు.

ముందు ఆ ట్రక్కు తగలబడిపోతోందని అనుకొన్నాడు. కాని అది వదులుతున్న పొగ?

అంతే. వెంటనే అప్పారావు బుర్రలో ఫ్లాష్ వెలిగింది. అప్పుడే 'అపన'లో చదివిన పొగమంచు సీరియల్ గుర్తు కొచ్చింది!

"అమ్మ! డాకూ నా కొడుకులు ఈ ఊరిలో విష ప్రయోగం చేద్దామని విషవాయువు వదులుతున్నారన్నమాట" అనుకొని రంగంలోకి ప్రవేశించాడు 'రాణా'ని తలచుకొని.

జేబులోనుండి రుమాలుతీసి ముక్కుకి అడ్డుపెట్టుకొని, ట్రక్కు ముందుకు వచ్చి "ఆపండి!" అర్చాడు.

కాని ట్రక్కు ఇంకా వేగంతో తన మీదకే రావడంతో ప్రక్కకి మెరుపులా జంపు చేశాడు. అంతే! దట్టమయిన తెల్లటిపొగ అప్పారావుని కప్పేసింది.

కొంచెంసేపటికి అప్పారావు తేరుకొన్నాడు.

"నేను రుమాలు ముక్కుకి అడ్డుపెట్టుకున్నాను కాబట్టి సరిపోయింది. లేకపోతేనా?" అనుకొని ట్రక్కుకోసం చూశాడు. అది కనిపించలేదు గాని పొగమట్టుకు దట్టంగా వుండి పరిసరాలు కనిపించకుండా పోయాయి. వెంటనే అప్పారావు అటుగాపోతున్న మొబైల్ పోలీస్‌వాన్‌ని ఆపి, అందులోని ఇన్‌స్పెక్టర్‌కు సంగతి వివరించాడు.

ఇన్‌స్పెక్టర్ అటు పొగవైపుచూపి విపరీతంగా నవ్వడం మొదలుపెట్టాడు. అతడు అప్పారావువేపు తిరిగి, "ఐతే మీరు రేడియోలో వినలేదన్నమాట! అది విషవాయువు కాదండీ? దోమలు పోవడానికి మన కార్పొరేషన్‌వారు కని పెట్టిన పొగమంచు అది!" అంటూ మళ్ళీ నవ్వడం మొదలెట్టాడు.

పాపం! అప్పారావు తన అవివేకానికి తను కూడా ఏడవలేని నవ్వు నవ్వాడు.

—అడబాల సత్యనారాయణ, విశాఖపట్నం-2.

## ఆదివాసుల వర్షసూచన!

ఒక ప్రొఫెసర్‌గారు ఆదివాసులున్న ఓ అడవి ప్రాంతానికి వారి జీవితాలను అధ్యయనం చేయడానికి వెళ్ళారు. ఆదివాసులు వర్షం ఎప్పుడొస్తుందో, ఎప్పుడు రాదో అన్న విషయం బాగా చెబుతారని ప్రొఫెసర్‌గారు విన్నారు.

ప్రొఫెసర్‌గారు ఒక ఆదివాసిని "ఈరోజు వాతావరణం ఎలా వుంటుంది?" అని అడిగారు.

"మధ్యాహ్నం వరకు చిన్న మబ్బులుంటాయి. ఆపైన ఎండ కాస్తుంది. వాతావరణంలో మార్పేమీ వుండదు" అన్నాడా ఆదివాసి.

ఆ ఆదివాసి చెప్పిన వాతావరణ సూచన నిజమయింది. ప్రొఫెసర్‌కు చాలా ఆశ్చర్యం వేసింది. మరురోజు కూడా అదే ఆదివాసిని అడిగాడు.

"మూడు గంటలవరకు వర్షం తుంపరగా పడుతుంది. ఆపైన ఎండ ఫెళ్ళున కాస్తుంది" చెప్పాడు. ఆ వాతావరణసూచన కూడా నిజమైంది.

మూడవరోజు కూడా అడిగాడు ప్రొఫెసర్. "ఈరోజు నేనేమీ చెప్పలేకపోతున్నాను" అన్నాడు అతను విచారంగా.

"ఎందుకు?"

"నా రేడియో చెడిపోయింది."

—చాగాపురం నాగేశ్వరరావు, గద్వాల.

## నగ్నస్నానాలు!

భారతీయ సెన్సార్ ఆఫీసర్ ఒకతను జపాన్ పర్యటన

కెళ్ళాడు. ఓరోజు గైడ్‌ని తీసుకుని కార్లో బయల్దేరాడు.

ఒకచోట కొలనులో స్త్రీలు పూర్తి నగ్నంగా స్నానాలు చేయడం కనిపించింది. చాలాసేపు కన్నార్పకుండా ఆ దృశ్యాన్నే చూస్తుండిపోయిన ఆఫీసర్‌గారు గైడ్‌ను అడిగారు—"మీ దేశంలో స్త్రీలు ఇలా నగ్నంగా బహిరంగ స్నానాలు చేయడం తప్పుగా భావించరా?" అని.

గైడ్ ఇబ్బందిగా "లేదండీ! కాని అలా నగ్నంగా బహిరంగ ప్రదేశాల్లో స్నానంచేసే స్త్రీలను చూస్తూ కూర్చోవటం మాత్రం తప్పుగా భావిస్తారు" అన్నాడు.

—డి. మహబూబ్‌బాషా, ఆదోని.

## నిలువుటద్దంలో ఎదురింటావిడ!

సుబ్బారావు వాళ్ళావిడ పుట్టింటినుంచి వస్తూ ఒక నిలువుటద్దం తీసుకొచ్చింది. దాన్ని తలవాకిలి యెదురుగా గోడకు తగిలించింది. ఆ అద్దంలోనుంచి చూస్తే యెదురింట్లో జరిగే ప్రతి విషయమూ స్పష్టంగా కనిపిస్తుంది.

ప్రతిరోజూ మధ్యాహ్నం సుబ్బారావు భోంచేసేటప్పుడు సుబ్బారావు భార్య అతనికి ఎదురింట్లో జరిగే సంగతులన్నీ చెప్పేది. ఇది సుబ్బారావుకు పెద్ద తలనొప్పిగా తయారయింది.

ఆ అద్దాన్ని ఎలా వదిలించుకోవాలో అర్థంకాలేదు. చివరకొక ఉపాయం ఆలోచించాడు.

మరునాడు సాయంత్రం పేపరు చదువుతూ వాళ్ళావిడతో "ఎదురింటి కనకం ఈమధ్య ఎర్రబడ్డట్టుంది కదూ?" అని అడిగాడు.

అంతే! మర్నాటికి నిలువుటద్దం అక్కడలేదు.

—డి. వి. ప్రసాద్, హైద్రాబాద్.

